అస్తామిత్రో స్తరూపశ్చాస్థలత్సుగతి దాయకః ।
కార్తికేయః కామరూపః కుమారః క్రౌఞ్చదారణః॥ 22

కామదః కారణః కామ్యః కమనీయః కృపాకరః।
కాఞ్చనాధః కాన్తియుక్తః కామీ కామప్రదః కవిః॥ 23

కీర్తికృత్ కుక్కుటధరః కూటస్థః కువలేక్షణః।
కుంకుమాంగః క్లమహరః కుశలః కుక్కుటధ్వజః॥ 24

కృశాను సంభవః క్రూరః క్రూరఘ్నః కలితాపహృత్ ।
కామరూపః కల్పరతుః కాంతః కామితదాయకః॥ 25

కళ్యాణకృత్ క్లేశనాశః కృపాళుః కరుణాకరః।
కలుషఘ్నః క్రియాశక్తిః కఠోరః కవచీ కృతిః॥ 26

కోమలాంగో కుశప్రీతిః కుత్సితఘ్నః కలాధరః ।
ఖ్యాతః ఖేటధరః ఖడ్గీ ఖట్వాఙ్గీ ఖలనిగ్రహః॥ 27

ఖ్యాతి ప్రదః ఖేచరేశః ఖ్యాతేహః ఖేచరస్తుతః।
ఖరతాపహరః ఖస్థఖేచరః ఖేచరాశ్రయః॥ 28

ఖేణ్డేన్దుమౌలితనయః ఖేలాఖేచరపాలకః।
ఖస్థలః ఖండితార్కశ్చ ఖేచరీజనపూజితః॥ 29

గాఙ్గేయా గిరిజాపుత్రో గణనాథానుజో గుహః।
గోప్తాగీర్వాణసంసేవ్యోగుణాతీతో గుహాశ్రయః॥ 30

గతిప్రదో గుణనిధి ర్గంభీరో గిరిజాత్మజః।
గూఢరూపో గదహరః గుణాధీశో గుణాగ్రణీః॥ 31

గోధరో గహనో గుప్తో గర్వఘ్నో గుణవర్ధనః।
గుహ్యో గుణజ్ఞోగీతజ్ఞో గతాతంకో గుణాశ్రయః॥ 32

గద్యపద్య ప్రియోగుణ్యో గోస్తుతో గగనేచరః।
గణనీయ చరిత్రశ్చ గతిక్లేశో గుణార్ణవః॥ 33

ఘూర్ణితాక్షో ఘృణనిధిః ఘనగంభీరఘోషణః ।
ఘంటానాద ప్రియో ఘోరాఘౌఘనాశో ఘనప్రియః॥ 34

ఘనానందో ఘర్మహంతా ఘృణివాన్ ఘృష్టిపాతకః।
ఘృణీ ఘృణాకరో ఘోషో ఘోరదైత్య ప్రహారకః॥ 35

ఘటితైశ్వర్య సందోహో ఘనర్ధిః ఘనసంక్రమః।
చిత్రకృత్ చిత్రవర్ణశ్చ చంచలశ్చపలాద్యుతిః॥ 36



చిన్మయశ్చిత్స్వరూపశ్చ చిదానంద శ్చిరంతనః।
చిత్రచేల శ్చిత్రరథ శ్చింతనీయశ్చ మత్కృతిః॥ 37

చోరఘ్న శ్చతురశ్చారురుచామీకరవిభూషణః।
చంద్రార్కకోటి సదృశ శ్చంద్రమౌళి తనూభవః॥ 38

ఛాదితాంగ శ్ఛద్మహంతా ఛేదితాఖిలపాతకః।
ఛేదీకృత తమఃక్లేశః ఛత్రీకృత మహాయశాః॥ 39

ఛేదితాశేషసంతాప శ్ఛరితామృతసాగరః।
ఛన్నత్రైగుణ్యరూపశ్చ ఛేతేహశ్ఛిన్నసంశయః॥ 40

ఛందోమయశ్చ న్నగామీ ఛిన్నపాశశ్ఛవిచ్ఛదః।
జగద్ధితో జగత్పూజ్యో జగజ్జ్యేష్ఠో జగన్మయః॥ 41

జనకో జాహ్నవీసూనుర్జితామత్రో జగద్గురు ః।
జయీ జితేంద్రియో జైత్రో జరామరణవర్జితః॥ 42

జ్యోతిర్మయోజగన్నాథో జగజ్జీవో జనాశ్రయః।
జగత్సేవ్యోజగత్కరాక్త జగత్సాక్షీ జగత్ప్రియః॥ 43

జంభారివన్ద్యో జయదో జగజ్జనమనోహరః।
జగదానన్దజనకో జనజాడ్యాపహారకః॥ 44

జపాకుసుమసఙ్కాశో జనలోచనశోభనః।
జనేశ్వరోజితక్రోధో జనజన్మనిబర్హణః॥ 45

జయదోజస్తుతాపఘ్నో జితదైత్య మహావ్రజః।
జితమాయో జితక్రోధో జితజమ్భో జనప్రియః॥ 46

ఝంఝా నిలమహావేగో ఝటితా శేషపాతకః।
ఝర్ఝరీకృత దైత్యౌఘో ఝల్లరీవాద్యసుప్రియః॥ 47

జ్ఞానమూర్తిర్జ్ఞా నగమ్యో జ్ఞానీ జ్ఞానమహానిధిః।
టంకారనృత్యవిభవష్టఙ్క వజ్రద్వజాంకితః॥ 48

టఙ్కితాఖిలలోకశ్చ టఙ్కితైనస్తమోరవిః।
డమ్బరప్రభవో డంభో డమడ్డమరుకప్రియః॥ 49

డమరోత్కటసన్నాదో డమరోత్కటజాణ్డజః।
ఢక్కానాద ప్రీతికరో ఢళితాసురఙ్కులః॥ 50

ఢాకితామరసన్దోహో ఢుణ్ఢీవిఘ్నేశ్వరానుజః।
తత్త్వజ్ఞస్తత్వగస్తీవ్రస్తపోరూపస్తపోమయః॥ 51

త్రయీమయస్త్రి కాలజ్ఞ స్త్రిమూర్తి స్త్రిగుణాత్మకః।
త్రిదశేశస్తారకారిస్తాపఘ్నస్తాపన ప్రియః॥ 52

తుష్టిదస్తుష్టికృత్తీక్ష్ణస్తపోరూప స్త్రికాలవిత్ ।
స్తోతా స్తవ్యస్తవ ప్రీతస్తుత తస్తోత్రస్తుతిప్రియః॥ 53

స్థితస్థాయీ స్తాపకశ్చ స్థూలసూక్ష్మ ప్రదర్శకః।
స్థవిష్ఠః స్థవిరః స్థూలః స్థానదః స్థైర్యదః స్థిరః॥ 54

దాంతో దయాపరో దాతా దురితఘ్నో దురాసదః।
దర్శనీయో దయాసారో దేవదేవో దయానిధిః॥ 55

దురాధర్షో దుర్విగాహ్యో దక్షో దర్పణశోభితః।
దుర్ధరో దానశీలశ్చ ద్వాదశాక్షో ద్విషడ్భుజః॥ 56

ద్విషట్కర్ణో ద్విషడ్బాహుర్దీనసంతాపనాశనః।
దందశూకేశ్వరో దేవో దివ్యో దివ్యాకృతిర్దమః॥ 57

దీర్ఘవృత్తో దీర్ఘబాహుర్దీర్ఘదృష్టి ర్దివస్పతిః।
దండో ధమయితా దర్పో దేవసింహో దృఢవ్రతః॥ 58

దుర్గభో దుర్గమో దీప్తో దుష్ప్రేక్ష్యో ధివ్యమణ్డనః।
దురోదరఘ్నో దుఃఖఘ్నో దురారిఘ్నో విశాంపతిః॥ 59

దుర్జయో దేవసేనేశో దుర్జ్ఞేయో దురతిక్రమః।
దంభో దృప్తో దేవఋషి ర్దైవజ్ఞో దైవచింతకః॥ 60

ధురంధరో ధర్మధరో ధనదో ధృతివర్ధనః।
ధర్మేశో ధర్మశాస్త్రజ్ఞోధన్వీ ధర్మపరాయణః॥ 61

ధనాధాన్యక్షోధనపతిర్ధృతిమాన్ హృతకిల్బిషః।
ధర్మహేతు ర్ధర్మశూరో ధర్మకృద్ధర్మవిద్ధ్రువః॥ 62

ధాతా ధీమాన్ ధర్మచారీ ధన్యో ధుర్యో ధృతవ్రతః।
నిత్యోత్సవో నిత్యతృప్తో నిర్లేపో నిశ్చలాత్మకః॥ 63

నిరవద్యో నిరాధరో నిష్కళఙ్కో నిరఞ్జనః।
నిర్మమో నిరహఙ్కారో నిర్మోహో నిరుపద్రవః॥ 64

నిత్యానన్దో నిరాతఙ్కో నిష్ప్రపఞ్చో నిరామయః।
నిరవద్యో నిరీహశ్చ నిర్ద్వన్ద్వో నిర్మలాత్మకః॥ 65

నిత్యానన్దో  నిర్జరేశో నిసఙ్గో నిగమస్తుతః।
నిష్కళఙ్కో నిరాలమ్బో నిష్ప్రత్యూహో నిజోద్భవః॥ 66



నిత్యో నియతకల్యాణో నిర్వికల్పో నిరాశ్రయః।
నేతానిధిర్నైకరూపో నిరాకారో నదీసుతః॥ 67

పుళిన్దకన్యారమణో పురజిత్పరమప్రియః।
ప్రత్యక్షమూర్తిః ప్రత్యక్షః పరేశః పూర్ణపుణ్యదః॥ 68

పుణ్యాకరః పుణ్యరూపః పుణ్యః పుణ్యపరాయణః।
పుణ్యోదయః పరంజ్యోతిః పుణ్యకృత్పుణ్యవర్ధనః॥ 69

పరానన్దః పరతనః పుణ్యకీర్తిః పురాతనః।
ప్రసన్నరూపః పుణ్యేశః పన్నగః పావనాశనః॥ 70

ప్రణతార్తిహరః పూర్ణః పార్వతీనన్దనః ప్రభుః।
పూతాత్మా పురుషః ప్రాణః ప్రభవః పురుషోత్తమః॥ 71

ప్రసన్నః పరమ స్పష్టః పటుః పరిబృఢః పరః।
పరమాత్మా పరబ్రహ్మ పరార్థః ప్రియదర్శనః॥ 72

పవిత్రః పుష్టిదః పూర్తిః పిఙ్గళః పుష్టివర్ధనః।
పాపహారీ పాశధరః ప్రమత్తాసురశిక్షకః॥ 73

పావనః పావకః పూజ్యః పూర్ణానన్దః పరాత్పరః।
పుష్కలః ప్రవరః పూర్వః పితృభక్తః పురోగమః॥ 74

ప్రాణదః ప్రాణజనకః ప్రతిష్ఠా పావకోద్భవః।
పరబ్రహ్మస్వరూపశ్చ పరమైశ్వర్యకారణమ్ ॥ 75

పరార్ధదః పుష్టికరః ప్రకాశాత్మా ప్రతాపవాన్ ।
ప్రజ్ఞాకరః ప్రకృష్టార్థః పృథుః పృథుపరాక్రమః॥ 76

ఫణీశ్వరః ఫణివరః ఫణామణివిభూషణః।
ఫలదః ఫలహస్తశ్చ ఫుల్లామమ్బుజవిలోచనః॥ 77

ఫడుచ్చాటితపాపౌఘః ఫణిరాజవిభూషణః।
బాహులేయో బ్రహ్మరూపో బలిష్ఠో బలవాన్ జలీ ॥ 78

బ్రహ్మేశవిష్ణురూపశ్చ బుద్ధో బుద్ధి మతాం వరః।
బాలరూపో బ్రహ్మగర్భో బ్రహ్మచారీ బుధప్రియః॥ 79

బహుశ్రుతో బహుమతిః బ్రహ్మణ్యో బ్రాహ్మణప్రియః।
బలప్రమథనో బ్రహ్మ బహురూపో బహుప్రదః॥ 80

బృహద్భాను తనూద్భూతో బృహత్సేనో బిలేశయః।
బహుబాహుర్బలశ్రీమాన్ బాహుదైత్యవినాశకః॥ 81

బిలద్వారా న్తరాళస్థో బృహచ్ఛక్తి దనుర్ధరః,
బాలార్కద్యుతిమాన్ బాలో బృహద్వక్షా బృహత్తనుః॥ 82

భవ్యోభోగీశ్వరో భావ్యో భవనాశో భవప్రియః।
భుక్తిగమ్యో భయహరో భావజ్ఞో భక్తసుప్రియః॥ 83

ముక్తిప్రదోభోగీ భగవాన్ భాగ్యవర్ధనః।
భ్రాజిష్ణుర్భావనోభర్తా భీమో భీమపరాక్రమః॥ 84

భూతిదోభూతికృద్భోక్తాభూతాత్మా భువనేశ్వరః।
భావుకోభాగ్యకృద్భేషో భావుకేష్టో భవోద్భవః॥ 85

భవతాపప్రశమనోభోగవాన్ భూతభావనః।
భోజ్యప్రదో భ్రాంతినాశో భానుమాన్ భువనాశ్రయః॥ 86

భూరిభోగప్రదో భద్రో భజనీయో భిషగ్వరః।
మహాసేనో మహోదారో మహాశక్తిర్మహాద్యుతిః॥ 87

మహాబుద్ధి ర్మహావీర్యో మహోత్సాహో మహాబలః।
మహాభోగీ మహామాయీ మేధావీ మేఖలీ మహాన్ ॥ 88

మునిస్తుతో మహామాన్యో మహానందో మహాయశాః।
మహోర్జితో మాననిధిర్మనోరథ ఫలప్రదః॥ 89

మహోదయో మహాపుణ్యో మహాబలపరాక్రమః।
మానదో మతిదో మాలీ ముక్తామాలా విభూషణః॥ 90

మనోహరో మహాముఖ్యో మహర్ధిర్మూర్తి మాన్మునిః।
మహోత్తమో మహోపాయో మోక్షదో మఙ్గళప్రదః॥ 91

ముదాకరో ముక్తిదాతా మహాభోగో మహోరగః।
యశస్కరో యోగయోని ర్యోగిష్ఠో యమినాం వరః॥ 92

యశస్వీ యోగపురుషో యోగ్యో యోగనిధి ర్యమీ ।
యతిసేవ్యో భోగయుక్తో యోగవిద్యోగసిద్ధిదః॥ 93

యన్త్రో యన్త్రీ చ యన్త్రజ్ఞో యన్త్రవాన్ యన్త్రవాహకః।
యాతనారహితో యోగీ యోగీశో యోగినాం వరః॥ 94

రమణీయో రమ్యరూపో రసజ్ఞో రసభావకః।
రఞ్జనో రఞ్జితో రాగీరుధిరో రుద్రసంభవః॥ 95

రణప్రియో రణోదారో రాగద్వేషవినాశనః।
రత్నార్చీరుచిరో రమ్యో రూపలావణ్యవిగ్రహః॥ 96



రత్నాంగదధరో రత్నభూషణో రమణీయకః।
రుచికృద్రోచమానశ్చ రంజితో రోగనాశనః॥ 97

రాజీవాక్షో రాజరోజా రత్నమాల్యానులేపనః।
ఋుగ్యజుస్సామసంస్తుత్యో రజస్సత్వ గుణాన్వితః॥ 98

రజీనీశకలారమ్యో రత్న కుణ్డలమణ్డితః।
రత్నసన్మౌళిశోభాఢ్యో రజన్మంజీరభూషణః॥ 99

లోకైకనాథో లోకేశో లలితో లోకనాశకః।
లోకరక్షో లోకశిక్షో లోకలోచనరంజితః॥ 100

లోకబంధుర్లోకధాతా లోకత్రయ సమాహితః।
లోకచూడామణి ర్లోకవంద్యో లావణ్యవిగ్రహః॥ 101

లోకాధ్యక్షస్తు లీలావాన్ లోకోత్తరగుణాన్వితః।
వరిష్ఠో వరదో వైద్యో విశిష్టో విక్రమో విభుః॥ 102

విబుధాగ్రచరో వశ్యో వికల్పపరివర్జితః।
విపాశో విగతాతంకో విచిత్రాఙ్గో విరోచనః॥ 103

విద్యాధరో విశుద్ధాత్మావేదాఙ్గో విబుధప్రియః।
వచస్కరో వ్యాపకశ్చ విజ్ఞానీ వినయాన్వితః॥ 104

విద్వత్తమో విరోధిఘ్నో వీరోవిగతరాగవాన్ ।
వీతభావో వినీతాత్మా వేదగర్భో వసుప్రదః ॥ 105

విశ్వదీప్తిర్విశాలోక్షో విజితాత్మా విభావనః।
వేదవేద్యో విధేయాత్మా వీతదోషశ్చ వేదవిత్ ॥ 106

విశ్వకర్మా జితభయో వాగీశోవాసవార్చితః।
వీరధ్వంసో విశ్వమూర్తిర్విశ్వరూపో వరాననః॥ 107

విశాఖో విమలో వాగ్మీ విద్వాన్ వేదధరో వటుః ।
వీరచూడామణి ర్వీరో విద్యేశో విబుధాశ్రయః॥ 108

విజయీ వినయీ వేత్తా వరీయాన్ వీరజో వసుః।
వీరఘ్నో విజ్వరో వేద్యో వేగవాన్ వీర్యవాన్ వశీ ॥ 109

వరశీలో వరగుణో విశోకో వజ్రధారకః।
శరజన్మాశక్తిధర శ్శత్రుఘ్న శ్శిఖివాహనః॥ 110

శ్రీమాన్ శిష్టశ్శుచిశ్శుద్ధ శ్శాశ్వతః శ్రుతిసాగరః।
శరణ్యశ్శుభదశ్శ్రీమాన్ శిష్టుష్టశ్శుభలక్షణః॥ 111

శాంతశ్శూలధరః శ్రేష్ఠశ్శుద్ధాత్మా శంకరశ్శివః।
శితికంఠాత్మజశ్శూర శ్శాంతిదశ్శోకనాశనః॥ 112

షాణ్మాతుర ష్షణ్ముఖశ్చ షడ్గుణైశ్వర్యసంయుతః।
షట్చక్రస్థష్షడూర్మిఘ్న ష్షడఙ్గశ్రుతిపారగః॥ 113

షడ్భావరహితష్షట్కష్షట్చాస్త్రస్మృతిపారగః।
షడ్వర్గ్యదాతా షడ్గ్రీవో షడరిఘ్నష్షడాశ్రయః॥ 114

షట్కిరీటధర శ్రీమాన్ షడాధారశ్చ షట్క్రమః।
షట్కోణమధ్యనిలయ ష్షండత్వ పరిహారకః॥ 115

సేనానీస్సుభగస్స్కందస్సు రానందస్సతాం గతిః।
సుబ్రహ్మణ్యస్సురాధ్యక్ష స్సర్వజ్ఞ స్సర్వద స్సుఖీ॥ 116

సులభస్సిద్ధిదస్సామస్యస్సిద్ధేశ స్సిద్ధిసాధనః।
సిద్ధార్థస్సిద్ధసంకల్పస్సిద్ధ స్సాధుస్సురేశ్వరః॥ 117

సుభుజస్సర్వదృక్సాక్షీ సుప్రసాదస్సనాతనః।
సుధాపతి స్స్వయంజ్యోతిస్స్వయంభూస్సర్వతోముఖః॥ 118

సమర్థ స్సత్కృతి స్సూక్ష్మ స్సుఘోష స్సుఖద స్సుహృత్।
సుప్రసన్న స్సుర శ్రేష్ఠస్సుశీల స్సత్వ సాయకః॥ 119

సంభావ్య స్సుమనస్సేవ్య స్సకలాగమపారగః।
సువ్యక్త స్సచ్చిదానంద స్సువీర స్సుజనాశ్రయః॥ 120

సర్వలక్షణసంపన్న స్సత్యధర్మపరాయణః।
సర్వదేవమయ స్సత్య స్సదామృష్టాన్నదాయకః॥ 121

సుధాపీ సుమనాస్సత్య స్సర్వవిఘ్నవినాశనః।
సర్వదుఃఖప్రశమన స్సుకుమార స్సులోచనః॥ 122

సుగ్రీవ స్సుధృతిస్సార స్సురారాధ్యస్సువిక్రమః।
సురారిఘ్న స్స్వర్ణవర్ణస్సర్పరాజ స్సదాశుచిః॥ 123

సప్తార్చి ర్భూసురవర స్సర్వాయుధవిశారదః।
హస్తిచర్మాంబరసుతోహస్తివాహనసేవితః॥ 124

హస్తచిత్రాయుధధరో హృతాఘో హసితాసనః।
హేమభూషో హరిద్వర్ణోహృష్టిదో హృష్టివర్ధనః॥ 125

హేమాద్రిభి ద్ధ్వంసరూపో హుంకారహతల్బిషః।
హేమాద్రి జాతాతనుజో హరికేశో హిరణ్మయః॥ 126



హృద్యోహృష్టో హరిసఖో హంసో హంసగతి ర్హవిః।
హరిణ్యవర్ణో హితకృత్ హర్షదో హేమభూషణః॥ 127

హరప్రియో హితకరో హతపాపో హరోద్భవః।
క్షేమదః క్షేమకృత్ క్షేమ్యః క్షేత్రజ్ఞః క్షామవర్జితః॥ 128

క్షేత్రపాలః క్షమాధారః క్షేమక్షేత్రః క్షమకరః।
క్షుద్రఘ్నః క్షాంతిదః క్షేమః క్షీతిభూషః క్షమాశ్రయః॥ 129

క్షాళితాఘః క్షితిధరః క్షీణసంరక్షణక్షమః।
క్షణభంగురసన్నద్ధఘనశోభీ కపర్దకః॥ 130

క్షితిభృన్నాథతనయాముఖపంకజభాస్కరః।
ఇతి నామ్నాం సహస్రాణి షణ్ముఖస్య చ నారద॥ 131

యః పఠేచ్ఛృణుయాద్వాపి భక్తియుక్తేన చేతసా ।
స సద్యో ముచ్యతే పాపైర్మనో వాక్కాయసంభవైః॥ 132

ఆయుర్వృద్ధికరం పుంసాం స్థైర్యవీర్యవివర్ధనమ్ ।
వాక్యైనై కేన వక్ష్యామి వాంఛితార్థం ప్రయచ్ఛతి॥ 133

తస్మాత్ సర్వాత్మనా బ్రహ్మన్ నియమేన జపేత్సుధీః॥ 134





# కుజదోషము కాలసర్పదోషము



## కుజగ్రహ జన్మరహస్యము

హిరణ్యాక్షుడు అను రాక్షసుని కుమార్తె "వికేశి" శివుడు కోరుకొనగా అగ్ని అడ్డుతగిలెను. దానికి కోపోద్రిక్తుడైన శివుని నుండి చెమట బిందువులు పార్వతి మీద పడగా ఆమె వాటిని మింగి గర్భవతి అయి, ఆ తేజము భరించలేక భూమిపై జారవిడువగా భూదేవి ఆ తేజమును కుజునిగా రూపము ఒసటి అక్షయనామ సంవత్సరము శ్రావణ మాస శుద్ధ త్రయోదశి నాడు పూర్వషాఢ నక్షత్రమున జన్మను ఒసగెను. అంగారకుడు అవంతీ పట్టణమునకు చెందిన శక్తిదేవిని పెళ్ళాడగా సమరసేనుడు అనుపుత్రుడు ఉదయించెను. కుజుడు తన కుడిచేతి యందు దండము, ఎడమచేతి యందు కమండలము ధరించియుండును.

ఉదాహరణకు మీది తులాలగ్నంగా భావించిన యెడల మీ జాతక చక్రములో కుజుడు ఈ క్రింది స్థానాలలో వున్న యెడల కుజదోషముగా భావించవలెను.

| | | | |
|---|---|---|---|
| | కుజ | కుజ | |
| | రాశి చక్రము | | |
| | | | |
| | కుజ | కుజ లగ్నం | కుజ |



## కుజ దోషము - ముఖ్య విషయములు

1. కుజుడు (భూమాతకు, విష్ణుమూర్తి) వరాహ అవతారంలో జన్మించినవాడు.
2. అంగాకమంత్రాన్ని ఉపాసిస్తే మశూచిలాంటి వ్యాధులు నశించి ఆగ్యోం వస్తుంది.
3. కుజునికి "మంగళుడనే" పేరు ఉన్నది. పార్వతీదేవికి "సర్వమంగళ" అనే పేరుకూడా ఉన్నది.
4. సూర్య, కుజ, అగ్నిశక్తులూ బాధించిన వాడినే కుజదోషం గలవాడని అంటారు.
5. కుజుడు విష్ణంశ సంభూతుడు.
6. కుజుడు గోచారములో మఖ-మూల-పుష్యమి-పుబ్బ-రేవతి-పూర్వాషాఢ నక్షత్రాల్లో ఉన్నప్పుడు ఇల్లు నిర్మిస్తే ఆ ఇల్లు కాలిపోతుంది.
7. 2-4-7-8-12 స్థానాలలో కుజుడు రాశి చక్రములో (జాతకచక్రము) ఉన్న స్త్రీకి వైధవ్యం కలుగుతుంది. పురుషుడయిన భార్యను కోల్పోతాడు. (నారదసంహిత-అగస్త్య సంహిత)
8. ఋణబాధలున్నవారు తప్పకుండా ఈ ఋణవిమోచక అంగారకస్తోత్రాన్ని పారాయణగావించి పూజా కార్యక్రమములు క్రమపద్ధతిలో చేయిస్తే ఋణబాధలు తీరతాయి.
9. ఆర్థిక, నిరుద్యోగ, ఋణబాధలు కేవలం కుజస్తోత్ర పారాయణ వలననే చక్కడబడతాయి.
10. అంగారక వ్రతము (శ్రీకాత్యాయినీ వ్రతము) చేస్తే పూర్తిగా ఋణబాధలు పోతాయని పద్మపురాణములో వున్నది.
11. కుజదోషం గలవారు ఎర్రని ఎద్దును లేదా ఎర్రని వస్త్రములు కందులు దానంగా యిస్తే కుజదోషం నశిస్తుంది.
12. గోచారరీత్యా, 2-4-7-8 స్థానాల్లోకుజుడు సంచరించే సమయాల్లో (2) కుటుంబము నశిస్తుంది. (4) అగ్నివలన ఇల్లు కాలిపోతుంది (7) మగవానికి భార్య, స్త్రీకి పురుషుడు నశిస్తాడు. (8) అగ్నికూడా తోడయితే మారకం ప్రాప్తిస్తుంది.
13. కుజుడు 2-4-7-8-12 స్థానాల్లో క్రొత్తగా పెళ్ళయిన స్త్రీ పురుషుల జాతకాల్లో ఉన్నచో దానినే కుజదోషము అంటారు. దీని వలన భార్యకు భర్తపోవడం, భర్తకు భార్యా వియోగం తప్పక వస్తుంది.

14. కుజునికి మిత్రక్షేత్రాలు సింహ-కర్కాటక మకరరాశిలో పుట్టిన వారికి కుజ దోషముండదు. (వృషభ మిథున, కన్య, తుల, మకర, కుంభ, లగ్నజాతకులకు కుజుడు7,8 భావములలోస్థితి పొందియున్న 7,8 భావాలను సప్తవీక్షణ (7) లో లేదా విశేష వీక్షన (4,8) చూచిన అధిక దోషమునిచ్చును. పై లగ్న జాతకులకు కుజ ఆధిపత్య శుభుడైన మేష, కర్కాటక, సింహ, వృశ్చిక, ధనుస్సు, మీన లగ్నజాతకులకు స్థితిలో లేదా వీక్షణలో పైభావాలను శుభ్ర పరచిన వారితో వివాహము వలన పై జాతకులకు కుజదోషము హరించును.

15. కుజుడు గురువుతో గాని చంద్రునితోగాని చేరినప్పుడు దోషముండదు.

16. వధూవరుల్లో ఒకరి జాతకములోనే కుజదోషము ఉంటే అనేక కష్టనష్టాలకు గురవుతారు. (కేరళజ్యోతిషము)

17. వధూవరులకు జన్మలగ్నములందుగాని, చంద్రునిరాశియందుగాని 2-12-4-7-1 స్థానాల్లో ఇద్దరు జాతకాల్లో కుజగ్రహమున్నవారు దీర్ఘాయుష్కు లవుతారు.

18. లగ్నములో కుజుడున్నవారికి దోషముగాని, వారిని పెండ్లిగావించుకొన్నవారికి యేదోషములేదు.

19. జన్మలగ్నాత్ కుజదోషము 3 పాళ్ళు, చంద్రలగ్నాత్ కుజదోషము 2 పాళ్ళు, 3 శుక్రాత్ కుజదోషము 1పాలు.

20. జాతక పారిజాతములో 2,4,7,8 స్థానములలో కుజుడు వున్నచో పురుషునికి భార్య వియోగము స్త్రీకి భర్తవియోగము వున్నది.

21. బృహత్ హోరాశాస్త్రములో కుజదోషాన్ని లగ్నాన్నించి కాకుండా శుక్ర చంద్ర లగ్నాల నుండి కూడా పరిశీలించాలి.

22. స్త్రీ జాతకములో గురువు బలం వల్ల పురుష జాతకములో శుక్ర బలం వల్ల కుజదోషము పూర్తిగా వుండదు.

23. జామిత్రేచ యదా సౌరిః లగ్నేవా ధ చతుర్థకే ।
నవమే ద్వాదశే చైవ కుజదోషన విద్యతే ॥
శని జన్మలగ్నంలోగాని 7-4-9-12 స్థానాల్లో ఎక్కువగా కుజదోషం వుండదు.

24. మేష, కర్కాటక, సింహ, వృశ్చిక, ధను, మకర, మీన లగ్నాల్లో జన్మించిన వారికి ఏ భావములో (2,4,7,8,12భావాలు) వున్ననూ కుజదోషము వుం డదు. కాని ఈ అభిప్రాయం తప్పు. 12 లగ్నాల్లో 7 లగ్నాల వారికి కుజదోషం ఉండదు.



25. దేవ కేరళము గ్రంథము నందు మిథున కన్యా లగ్నాల వారికి ద్వితీయములో వృషభ, తులా లగ్నాల వారికి ద్వాదశములో, మేష వృశ్చిక లగ్నాల వారికి చతుర్థములో, మకర, కర్కాటక లగ్నాలకు సప్తమములో, ధనుస్సు మీన లగ్నాల వారికి అష్టమములో కుజుడు వున్న కుజదోషము ఉండదు.

26. కుజదోషము నిర్ణయించునప్పుడు భావచక్రం తప్పక పరిశీలించాలి.

27. కుజునిపై గురుగ్రహము దృష్టి, కలయిక జరిగినను, పూర్ణచంద్రునితో కుజుని కలయిక, దృష్టి చాలా మంచిది కుజ దోషము ఉండదు.

28. 2,11,7,8 రాశులందు కుజుడున్నచో పురుషులకు భార్యావియోగము, స్త్రీలకు భర్తృవియోగము గలదు.

29. అర్కుడనగా సూర్యుడు, ఇందు అనగా చంద్రుడు సూర్యునిరాశి-సింహము, చంద్రునిరాశి, కర్కాటకం, సింహ, కర్కాటకరాశి జాతకులకు కుజదోషంరాదు.

30. అంగారకునికి స్వక్షేత్రములగు మేష, వృశ్చిక రాశులలోను ఉచ్ఛ అయిన మకరమునందు, కుజునికి మిత్రులగు గురు, రవి రాశులైన ధనుస్సు, మీన, సింహ రాశులలో జన్మించువారికి కుజదోషంలేదు.

31. మిథున, కన్యారాశులలో జన్మించువారికి రెండవ యింటియందున్న కుజదోషములేదు.

32. తులారాశి, వృషభరాశి జాతకులకు ద్వాదశ స్థానమందున్న కుజదోషములేదు.

33. మేషము, వృశ్చికములందు జన్మించు వారికి నాల్గవ యింటన్న కుజదోషము లేదు.

34. మకరము, కర్కాటకములందు జన్మించువారికి సప్తమస్థానమందున్న కుజ దోషములేదు.

35. ధనూరాశి, మీనరాశి జాతకులకు అష్టమ స్థానమునందున్న కుజదోషములేదు.

36. కుంభ, సింహరాశి జాతకులకు కుజదోష ప్రసక్తిలేదు.

37. కుజుడు గురువుతో కలిసియున్ననూ, గురుదృష్టి కుజునిపైనున్ననూ ఆ జాతకులకు కుజదోషములేదు.

38. పురుషులకు, సప్తమ, ద్వితీయ స్థానాల్లో కుజుడు మిక్కిలి దోషకారి, స్త్రీలకు చతుర్థ, అష్టమ స్థానములలో ఉన్న కుజుడు మిక్కిలి అపాయకారి.

39. స్త్రీ పురుషులకు అష్టమ స్థానంలో చాలా ప్రమాదకారి.

40. భార్యాభర్తల జన్మరాశికి ద్వాదశ, ద్వితీయ, చతుర్థ, అష్టమ, లగ్నములలో ఎక్కడ కుజుడున్ననూ దోషకారి, ఈ దోషము జన్మ లగ్నమునుండి గానీ,

చంద్రుడున్న రాశి నుండిగానీ, శుక్రుడున్న రాశినుండి గానీ కుజదోషమును చూచుకోవలయును. దంపతులకు జన్మరాశి, చంద్రరాశి, శుక్రరాశులనుండి ఎక్కడ కుజదోషమున్ననూ అది పరిహార శక్యము.

41. పైన చెప్పబడిన రీతులలో నున్న కుజదోషము పరిహారమైనచో దంపతులకు సుఖదాంపత్యం, సంతానం, ధనవృద్ధి, సౌఖ్యం సిద్ధించును.

## కుజ దోషము - పరిహారము - శాంతులు

**(సకాలములో (ఆలస్య వివాహములు)**
**వివాహము కాని కన్యలు చేయవలసిన విధులు)**

1. మోపిదేవి, బిక్కవోలు, నాగులపాడు, పెదకూరపాడు, నవులూరు పుట్టమొద లగు సుబ్రహ్మణ్య క్షేత్రములు దర్శించి కందులు దానము చేయవలెను.
2. కనీసము 7 మంగళవారములు ఉదయం 6 నుంచి ఉదయం 7 లోపుగా దగ్గరలోని సుబ్రహ్మణ్యక్షేత్రములను దర్శించి 7 మార్లు సుబ్రహ్మణ్య అష్టకము పఠించి 70 ప్రదక్షణములుచేసి 70 సార్లు కుజ శ్లోకమును ధ్యానముచేసి చివరి 7వ మంగళవారము కందులు దానము చేయవలెను.
3. తమిళనాడులో అనేక సుబ్రహ్మణ్యక్షేత్రములు కలవు. అవకాశము ఉన్నవారు క్షేత్ర దర్శనముతో దోషనివృత్తి చేసుకొనగలరు. ఒక కృత్తిక నక్షత్రము రోజు గాని, షష్ఠితిథి యందుగాని వైదీశ్వరన్ కోయల్‌ను దర్శించి అభిషేక అర్చ నాదులు జరిపించుకొనగలరు.
4. మంగళవారము రోజు ఎర్రని కుక్కలకు పాలు, రొట్టెలు పెట్టవలెను.
5. మీదగ్గరలో నున్న సుబ్రహ్మణ్యస్వామి గుడికి వెళ్ళి పూజలు జరుపుకొనవలెను. ఎర్రని ఫలములు, ఎర్రని వస్త్రములు దానము చేయవలెను. పేదలకు కందిపప్పు వంటకాలు దానం చేయగలరు.
6. పగడమును ఎడమచేతి ఉంగరపు వ్రేలుకి వెండితో ధరించవలెను.
7. 7 మంగళవారములు ఏకభుక్తము చేసినచో మంచిది. అనగా ఉదయం భోజనము చేసి సాయంత్రము భోజనము చేయరాదు. సుబ్రహ్మణ్య స్వామికి 70 ప్రదక్షణములు చేయగలరు.
8. ముఖ్యముగా స్త్రీలు పగడమాలను ధరించి, ఎరుపు రంగు కలిగిన వస్త్రములు ధరించి ఎరుపు గాజులు, కుంకుమ ధరించవలెను.



9. నవగ్రహములలో కుజ విగ్రహమువద్ద ఎర్రరంగు 7 వత్తులతో దీపారాధన చేసి ఎర్రని పుష్పము, ఎర్రని వస్త్రములు అలంకరించవలెను.
10. 7 మంగళవారములు 1.25 కేజీలు ధాన్యము, కందులు ఎర్రని వస్త్రములో పోసి దక్షిణతాంబూలాదులతో దానము యివ్వవలెను.
11. కుజగ్రహమునకు జపము ఒకమారు చేయించి కందులు దానము చేయవలెను.
12. కుజ ధ్యానశ్లోకం ప్రతిరోజు 70మార్లు చొప్పున పారాయణ చేయవలెను.
13. కుజ గాయత్రీ మంత్రమును 7 మంగళవారములు 70 మార్లు పారాయణ చేయవలెను.
14. కుజమంత్రమును 40 రోజులలో 7000మార్లు జపము చేయవలెను. లేదా ప్రతిరోజు సుబ్రహ్మణ్య అష్టకం పారాయణ చేయగలరు.
15. తీరికలేనివారు కుజశ్లోకమును 7మార్లుగాని, కుజయంత్రమును 70మార్లు గాని పారాయణ చేయవలెను.
16. సుబ్రహ్మణ్యషష్ఠి పర్వదినమున సుబ్రహ్మణ్య అష్టకం 7మార్లు పారాయణ చేయగలరు.

## కుజుడు (ప్రత్యేక పరిహార మార్గములు)

1. బ్రాహ్మణులకు ఎఱ్ఱని వస్త్రములు, కందులు, ఎర్రచందనము, ఎర్రని ఆవు, పగడము, ఎర్రమేక, క్యారట్, దానిమ్మపండ్లు దానము చేయుట మంచిది.
2. ప్రతిరాత్రి రాగిపాత్రనందు నీరు పట్టుకొని ఉదయం త్రాగు, కోతులకు మిఠాయిలు పంచాలి.
3. గోవునకు ఎర్రని పప్పు, బెల్లం, కలిసిన కందిపప్పు తినిపించిన చాలామంచిది.
4. మీ సమీప బంధువులకు గాని, స్నేహితులకుగాని రక్తదానం చేయండి.
5. ఎర్రమందారపువ్వులతో ఒకమాలకట్టి 7 మంగళవారములు సుబ్రహ్మణ్య దేవాలయములో సమర్పించండి.
6. పొట్లకాయలు కత్తిపీటతో తరగకండి, కోడిగ్రుడ్లు పగలగొట్టి స్వయముగా వండకండి.
7. సింధూర వర్ణముగల ఆంజనేయస్వామి మందిరమునకు 7 మంగళవారములు వెళ్ళి 70 ప్రదక్షిణములు చేయండి.

8. 7 మంగళవారములు మోపిదేవిగాని, బిక్కబోలుగాని, సర్పక్షేత్రములు దర్శించి సుబ్రహ్మణ్యస్వామికి పాలాభిషేకము చేయించండి.

9. 7 మంగళవారములు 7 ముత్తైయిదువులకు ఎర్రపువ్వులు, ఎర్రజాకెట్టు, ఎర్రగాజులు, ఎర్రకుంకుమ, కాత్యాయినీ వ్రతం పుస్తకములు దానముగా యివ్వండి.

## సుబ్రహ్మణ్య ఉపాసనా మార్గములు

1. సుబ్రహ్మణ్య అష్టోత్తర శతనామావళి రోజుకు 9 సార్లు 12 రోజులు పారయణచేసి వల్లీ, దేవసేనా అష్టోత్తర శతనామాలు ఒకసారి చదువవలెను.
2. సుబ్రహ్మణ్యమాలా మంత్రము రోజుకొకసారి 40 రోజులు పారాయణ చేయగలరు.
3. షణ్ముఖాష్టకం రోజుకు 80 సార్లు చొప్పున 10 రోజులు పారాయణ చేయగలరు.
4. సుబ్రహ్మణ్యాక్షర మాలికాస్తోత్రం రోజుకొకసారి 27 రోజులు పారాయణ చేయగలరు.
5. సుబ్రహ్మణ్య అష్టోత్తర శతనామ స్తోత్రం రోజూ 12సార్లు 9 రోజులు పారాయణ చేయగలరు.
6. సుబ్రహ్మణ్య కరావలంబ స్తోత్రం రోజుకు 80 సార్లు చొప్పున 11 రోజులు పారాయణ చేయగలరు.
7. సుబ్రహ్మణ్య భుజంగస్తోత్రం రోజుకు 12 సార్లు 18 రోజులు పారాయణ చేయగలరు.
8. సుబ్రహ్మణ్యకవచమ్ రోజుకు 2 సార్లు ఉదయం సాయంత్రం 27 రోజులు పారాయణ చేయగలరు.
9. సుబ్రహ్మణ్యమాలాస్తోత్రం రోజుకు 12 సార్లు 18 రోజులు పారాయణచేయగలరు.
10. సుబ్రహ్మస్తోత్రం రోజుకు 16 సార్లు 40 రోజులు పారాయణ చేయగలరు.
11. సుబ్రహ్మణ్యషట్కమ్ రోజుకు 60 సార్లు 12 రోజులు పారాయణచేయగలరు.
12. సుబ్రహ్మణ్యషోడశనామస్తోత్రం రోజకు 16సార్లు 40 రోజులు పారాయణ చేయగలరు.



## నాగదోష నివారణకు మార్గములు

1. 7 మంగళవారములు ఉదయం 6-00 నుండి 7-00 గంటల లోపున శివాలయంలో "ఏకరుద్రము" అభిషేకం చేయించుకొనగలరు.
2. 7 మంగళవారములు సుబ్రహ్మణ్యస్వామికిగాని, నాగేంద్రస్వామి పుట్టకు గాని 70 ప్రదక్షిణలు చేయగలరు.
3. ఆదివారము ఖచ్చితముగా రాహుకాలములో సాయంత్రం 4-30 నుండి 6-00లోపుగా నిమ్మకాయ డొప్పలో దీపారాధన చేసి సుబ్రహ్మణ్యష్టకం పారాయణ చేయండి.
4. నాగేంద్రస్వామి పుట్ట దగ్గరకు వెళ్లినపుడు పుట్టమన్ను చెవికి ఖచ్చితముగా పెట్టుకొనండి. పాలుపోసి రండి, కొబ్బరికాయ కొట్టండి.
5. శనివారం ఉదయం 9-30 నుండి 11-00 వరకు; ఆదివారం సాయంత్రం 4-30 నుండి 6-00వరకు; సోమవారం ఉదయం 7-30 నుండి 9-00 వరకు; ఈ రాహుకాలములలో అష్టమూలికాతైలంతో సుబ్రహ్మణ్యస్వామికి దీపారాధన ఎర్రటివత్తులతో చేసిన చాలా మంచిది.
6. కృష్ణాజిల్లాలోని మోపిదేవి క్షేత్రమును దర్శించి 70 ప్రదక్షిణములు చేసి వెండి సర్ప పడగను హుండీలో వేసి అభిషేకం చేయించుకొనగలరు.
7. "కుజదోషము" అను 7 పుస్తకములు సుబ్రహ్మణ్య దేవాయలమున మంగళవారము రోజున తాంబూలముతో యివ్వగలరు.
8. ప్రతిమంగళవారం "సుబ్రహ్మణ్య నిత్యపూజ" అను 8 పుస్తకములు సుబ్రహ్మణ్య దేవాలయము మంగళవారం రోజున తాంబూలముతో యివ్వగలరు.
9. 'కాత్యాఇయనీ వ్రతము' అను 7 పుస్తకములు పెళ్ళికాని యువతులకు తాంబూలముతో దానము యివ్వగలరు.
10. కాత్యాయినీ వ్రతము వరసగా 7 మంగళవారములు ఆచరిస్తే శుభఫలితములు కనపడును.
11. కనీసం 7 ఆదివారములు, 1.దామరపల్లి (గుంటూరు) 2. నవులూరుపుట్ట (మంగళగిరి) 3. గౌడపాలెం (పెదకాకాని) 4. నాగులుపాడు (పెదనందిపాడు) 5. కట్టమూరుసత్రంవద్ద పుట్ట (పొన్నూరు) 6. వైకుంఠం (తెనాలి) 7. మోపిదేవి (కృష్ణాజిల్లా) వరుసగా దర్శించగలరు. ఇవి కృష్ణా, గుంటూరు జిల్లా వాసులకు మాత్రమే) ఇతరజిల్లావాసులు వేరే పుట్టలు దర్శించగలరు.



## కాలసర్ప దోషము

శ్లో॥ అగ్రే రాహు రథోకేతుః మధ్యే నవగ్రహాః తథా
యది కాలసర్పాఖ్య యోగాయ నృపరాష్ట్ర వినాశనం ।
అగ్రే కేతు రథో రాహుః గర్భస్థే సప్తకే తథా
యది అపసవ్యకాల సర్పాఖ్య దోషోయం నృపాణాం సమరం భవేత్ ॥

జాతక (రాశి) చక్రములో మిగిలిన ఏడు గ్రహాలన్నియు రాహు, కేతు గ్రహముల మధ్యవున్న కాలసర్పదోషము అందురు. రాహువు నుండి మొదలై కేతు గ్రహముల మధ్యమిగిలిన ఏడుగ్రహముల మధ్య ఉన్నచో 'సవ్యకాల సర్పదోషం' అందురు. కేతువు నుండి మొదలై రాహువు గ్రహము వరకు మధ్య మిగిలిన గ్రహములు మధ్య వున్నచో "అపసవ్యకాల సర్పదోషం" అందురు. దీని దోషము లేదని చెప్పుదురు. ఆ గ్రహములు లగ్నమునుండి సప్తమస్థానం వరకు వున్నచో జీవితప్రథమ భాగం బాగా జరగదు. సప్తమము నుండి ద్వాదశమునకు వున్నచో జీవితము యొక్క రెండవ భాగము బాగా జరగదు. ఇతర యోగము లేని ఈ జాతకులు కేవలము ఈ యోగం పట్టినవారు ఉద్యోగహీనులు, సుఖహీనులు, చెడ్డపనులు చేయువారు, అవివాహితులు అగుదురు. 33 సం॥లు దాటిన తరువాత ఈ దోషము తగ్గును.

జ్యోతిష శాస్త్రములో రాహు, కేతువులను సర్పాలుగా భావిస్తారు. రాహువును సర్పంయొక్క "తల"గా, కేతువును సర్పం "తోక"గా గుర్తించాలి. కొంతమంది కాలసర్ప దోషమును కాలసర్పయోగము అని అంటారు. అన్నిరకాల చెడు యోగాల కన్నా కాలసర్పయోగం చాలా భయంకరమైన ఊహించని చెడుఫలితాలు ఇస్తుంది, అని జ్యోతిషశాస్త్రజ్ఞుల అభిప్రాయం. అంతేగాక 1. జాతక (రాశి) చక్రములో రాహువు నుండి 8వస్థానంలో రవి ఉంటే సర్పదోషముగా భావిస్తారు. 2. జాతక (రాశి) చక్రములో చంద్రుని నుండి 8 స్థానములో రాహువుగాని, కేతువుగాని ఉంటే సర్పదోషము 3. జాతక (రాశి) చక్రములో లగ్నం నుండి 6,7,8వ స్థానములో రాహువుగాని వుంటే సర్పదోషము. 4. జాతక (రాశి) చక్రములో లగ్నం నుండి త్రికోణములో గాని కేంత్రములో గాని రాహు, కేతువులుంటే సర్పదోషముగా భావిస్తారు. ఉదా:– ఈ రెండు జాతక చక్రములో కాలసర్పయోగములు కనిపించును. (కాలసర్పయోగమును లగ్నము నుండి పరిగణించాలి.)





## వివిధ రకాల కాలసర్పయోగములు

1. లగ్నము నుండి ఏడవ స్థానం వరకు రాహు, కేతు గ్రహాల మధ్య మిగతా గ్రహములు (రవి, చంద్ర, కుజ, బుధ, గురు, శుక్ర, శని) వున్నట్లయితే "అనంత కాలసర్పయోగం" వైవాహిక జీవితంలో మరియు శరీర ఆరోగ్య విషయంలో సమస్యలు వుంటాయి.

2. రెండవస్థానం నుండి ఎనిమిదవ స్థానం వరకు రాహు, కేతు, గ్రహాల మధ్య మిగతా గ్రహాలు వున్నట్లయితే "గుళిక కాల సర్పయోగం" ఆర్థిక, కుటుంబ సమస్యలు వుంటాయి.

3. మూడవస్థానం నుండి తొమ్మిదవస్థానం వరకు రాహు, కేతు గ్రహాల మధ్య మిగతా గ్రహాలు వున్నట్లయితే "వాసుకి కాలసర్పయోగం" సోదర బంధు వర్గములవల్ల సమస్యలు వుంటాయి.

4. నాలుగవ స్థానము నుండి పదవ స్థానం వరకు రాహువు, కేతు గ్రహాల మధ్య మిగతా గ్రహాలు వున్నట్లయితే "శంఖుపాల కాలసర్పయోగం", తల్లి, స్థల, గృహ, వాహనముల వలన సమస్యలు వుంటాయి.

5. ఐదవస్థానము నుండి పదకొండవ స్థానం వరకు రాహువు, కేతుగ్రహాల మధ్య మిగతాగ్రహాలు వున్నట్లయితే "పద్మ కాలసర్పయోగం", సంతానము వలన సమస్యలు వుంటాయి.

| | | | |
|---|---|---|---|
| | | | |
| రాహు | రాశిచక్రము అపసవ్యకాల సర్పయోగము | | |
| గురు | | | కేతు లగ్నము |
| | చంద్ర శని | కుజ శుక్ర | రవి బుధ |

| | | | |
|---|---|---|---|
| సూర్య చంద్ర శని | కుజ శుక్ర బుధ | | |
| రాహు గురు లగ్నము | రాశి చక్రము సవ్యకాల సర్పయోగము | | |
| | | | కేతు |
| | | | |

6. ఆరవ స్థానము నుండి పన్నెండవ స్థానం వరకు రాహు, కేతు గ్రహాల మధ్య మిగతా గ్రహాలు వున్నట్లయితే "మహాపద్మ కాలసర్పయోగం", అనారోగ్యం, ఋణం, శత్రువుల వలన సమస్యలు వుంటాయి.

7. ఏడవస్థానము నుండి లగ్నం వరకు రాహు, కేతు గ్రహాలమధ్య మిగతా గ్రహాలు వున్నట్లయితే "తక్షక కాలసర్పయోగం", వ్యాపారములో, జీవిత భాగస్వామితో సమస్యలు వుంటాయి.

8. ఎనిమిదవస్థానము నుండి రెండవ స్థానంవరకు రాహు, కేతు గ్రహాల మధ్య మిగతాగ్రహాలు వున్నట్లయితే "కర్కాటక కాలసర్పయోగం", భార్యవలన, ప్రమాదాల వలన సమస్యలు వుంటాయి.

9. తొమ్మిదవస్థానము నుండి మూడవస్థానం వరకు రాహు, కేతు గ్రహాల మధ్య మిగతా గ్రహాలు వున్నట్లయితే "శంఖచూడ కాలసర్పయోగం" తండ్రి, నాస్తికత్వము, దురదృష్టము, గురువు వలన సమస్యలు వుంటాయి.

10. పదవస్థానమునుండి నాలుగవ స్థానం వరకు రాహు, కేతుగ్రహాల మధ్య మిగతా గ్రహాలు వున్నట్లయితే "ఘటక కాలసర్పయోగం" ఉద్యోగములోను వ్యాపారములోను సమస్యలు వుంటాయి.

11. పదకొండవస్థానము నుండి ఐదవస్థానం వరకు రాహు, కేతు గ్రహాల మధ్య మిగతా గ్రహాలు వున్నట్లయితే "విషధార కాలసర్పయోగం", లాభనష్టాల విషయములో మరియు వ్యాపార లావాదేవీలలో సమస్యలు వుంటాయి.

12. పన్నెండవ స్థానము నుండి ఆరవ స్థానం వరకు రాహు, కేతు గ్రహాల మధ్య మిగతా గ్రహాలు వున్నట్లయితే "శేషనాగ కాలసర్పయోగం", అధిక ఖర్చువలన, శత్రువుల వలన సమస్యలు ఎక్కువగా వుంటాయి.

## కాలసర్పయోగము - ప్రభావము

1. రాహు కేతువుల మహర్దశల అంతర్దశలయందు బాధ ఎక్కువ.
2. రాహుకేతువుల పంచమదృష్టి నవమదృష్టి సప్తమదృష్టి వలన ఆ క్షేత్రములలో ప్రభావము వుండును.
3. రాహు కేతువుల స్థానాధిపతులు తమ తమ బలమును కోల్పోవును.
4. కాలసర్పదోషము కలవారికి వివాహ జీవితములో ఆనందము లభించదు.
5. కాల సర్పదోషము కలవారికి ఎక్కువగా అంతర్గత శత్రువులు ఉంటారు.
6. కాలసర్పదోషము కలవారికి ముఖ్యముగా తోబుట్టువులతో, సంతానముతో ఇబ్బందులు కలుగును.
7. కాలసర్పదోషము కలవారికి ఆర్థిక సమస్యలు ఎక్కువగా ఉంటాయి.



8. కాలసర్పదోషము కలవారికి ప్రతి పనియందు ఆటంకములు కలుగును.
9. కాలసర్పదోషము కలవారికి మరణించు సమయంలో రాహువు ప్రముఖ పాత్ర పోషించునుజ
10. కాలసర్పదోషము కలవారికి ఎక్కువగా అపజయములు కలుగును.
11. కాలసర్పదోషము కలవారికి ఆయుః ప్రమాణము ఎక్కువగా వుండదు.
12. కాలసర్పదోషము కలవారు కొంతమంది గొప్పస్థితిలో వుంటారు.
13. కాలసర్పయోగము కలవారికి ముఖ్యముగా స్త్రీ సంతానము వుంటుంది.
14. పూర్వకాలము జ్యోతిష్య గ్రంథాలలో కాల సర్పయోగము గురించి కనబడదు.
15. కనీసము ఏడు గ్రహములలో ఒక గ్రహానికి రాహు కేతువుల నుండి బయటకు వచ్చినను అది కాలసర్ప దోషము అని అంటారు.

## కాలసర్పదోషము - కాల ప్రమాణము

### కాలసర్ప యోగ కాల ప్రమాణము

1. రాహువు కేతువులు 1 నుండి 7 స్థానములలో ఉండిన 27 సం॥వరకు
2. రాహువు కేతువులు 2 నుండి 8 స్థానములలో ఉండిన 33 సం॥వరకు
3. రాహువు కేతువులు 3 నుండి 9 స్థానములలో ఉండిన 36 సం॥వరకు
4. రాహువు కేతువులు 4 నుండి 10 స్థానములలో ఉండిన 42 సం॥వరకు
5. రాహువు కేతువులు 5 నుండి 11 స్థానములలో ఉండిన 48 సం॥వరకు
6. రాహువు కేతువులు 6 నుండి 12 స్థానములలో ఉండిన 58 సం॥వరకు
7. రాహువు కేతువులు 7 నుండి 1 స్థానములలో ఉండిన 27 సం॥వరకు
8. రాహువు కేతువులు 8 నుండి 2 స్థానములలో ఉండిన 33 సం॥వరకు
9. రాహువు కేతువులు 9 నుండి 3 స్థానములలో ఉండిన 36 సం॥వరకు
10. రాహువు కేతువులు 10 నుండి 4 స్థానములలో ఉండిన 42 సం॥వరకు
11. రాహువు కేతువులు 11 నుండి 5 స్థానములలో ఉండిన 48 సం॥వరకు
12. రాహువు కేతువులు 12 నుండి 6 స్థానములలో ఉండిన 58 సం॥వరకు

రాహు = "జ్ఞాన కారకో రాహుః"
కేతు = మోక్ష కారకో కేతుః
రాహు = "పరంమృత్యో" (అపమృత్యుకారకుడు)
కేతు = "బ్రహ్మదేవానా" (మోక్షకారకుడు)

## కాలసర్పదోషము - నివారణ - వివిధ మార్గములు

1. కుజ, రాహు, కేతు, గ్రహములకు విడివిడిగా జపములు చేయించి ఆయా గ్రహదానములు తప్పకచేయవలెను. వీలైనచో సర్పగ్రహ ప్రతిష్ఠ చేయగలరు.
2. తమిళనాడులో తిరునాగేశం (రాహుదేవాలయం) దర్శించి ఆవుపాలతో రాహు కాలంలో అభిషేకంజరిపించుకోవలెను. తరువాత వైదీశ్వరన్ కోయిల్ (కుజ క్షేత్రం)దర్శించి అభిషేకముచేయించుకొనగలరు. తరువాత కేతు పెరంబారి (కేతుక్షేత్రము) అక్కడ దర్శించి ఆవునెయ్యి దీపాలతో పూజలు చేయవలెను.
3. ముఖ్యముగా కాలసర్పదోషము కలవారు ప్రతి సంవత్సరము శ్రీకాళహస్తి వెళ్ళి కాలసర్పదోష నివారణ పూజలు తప్పక జరిపించుకొని తరువాత జ్ఞానప్రసూనాంబ అమ్మవారి దగ్గర కుంకుమపూజ జరిపించుకొనవలెను.
4. ఆర్థికస్తోమతలేనివారు కనీసము సర్పగ్రహక్షేత్రములు 7 మంగళవారములు గాని, 18ఆదివారములుగాని దర్శించి 70ప్రదక్షణలుచేసి పుట్టలోపాలు పోసి రాగలరు. మోపిదేవి, నాగులపాడు,పెదకూరపాడు,తెనాలి,మంగళగిరి, నవులూరి పుట్ట, బిక్కవోలు మొదలగునవి సుబ్రహ్మణ్య (సర్పగ్రహ క్షేత్రములు) క్షేత్రములు.
5. మద్రాసు నుండి బయలుదేరి 'కొయిలాన్‌మెయిల్' ఎక్కిశంకరన్ కొయిన్ స్టేషన్‌లో దిగి అక్కడ ప్రత్యేకముగా కాలసర్పదోషనివారణకు నిర్మించబడిన దేవాలయములో పూజచేయించుకోవడంవల్ల కాలసర్పదోషము తొలగుతుంది.
6. శ్రీకాళహస్తి వెళ్ళి రాహు, కేతు, సర్పదోష పూజ చేయించుకొని మినుములు, ఉలవలు, కందులు,దానం చేయవలెను.
7. వెండితో సర్పఆకారములో ఉంగరముచేయించి అనామికవ్రేలుకిధరించగలరు.
8. ఆంధ్రప్రదేశ్‌లోని కాకాని మరియు తమిళనాడులోని రామేశ్వరమునందు సర్పదోషములకు నాగప్రతిష్ట చేసిన తొలగిపోవును.
9. గోమేధికము, వైఢూర్యము కలిపిగాని, విడిగాగాని మధ్యవ్రేలు వెండితో ధరించవలెను.
10. బంగారముతోగాని ఆర్థికస్తోమత లేనివారు వెండితో నాగపడగ చేయించి ఏకాదశ రుద్రాభిషేకం చేయించి బ్రాహ్మణునికి పడగ దానం చేయవలెను.
11. ప్రతిరోజు సర్పసూక్తముతో శివాలయములో రుద్రాభిషేకము 11 రోజులు చేయించిన తీవ్రత తగ్గుముఖము పట్టును.

## కాలసర్ప దోష నివారణ మంత్రము

ఓం నమో భగవతే మహా సుదర్శనాయ మహాచక్రాయ
ధగ ద్ధగిత రాంతక జ్వల జ్వల ప్రజ్వల ప్రజ్వల
దుష్ట దానవ భయంకర బ్రహ్మరాక్షస భూచర ఖేచర
అంతరిక్ష చర నిశాచర కాలసర్పకాన్ స్వాహా ఓం ఫట్





# కుమారస్వామి చరిత్ర

## 1. శ్రీ కుమార జననము

పరమశివుని కావాసమై రమణీయ కమనీయ మహనీయ సుందర కుసుమ సౌరభాన్ని నాల్గుదిక్కులకు వెదజల్లు కైలాస గిరీంద్రం, ఆ కైలాసాన్ని వర్ణింపగా శక్యముకాదు. అందున్నవనాలు ఆరుఋతువుల్లో పూసికాసి, ఫలించి శివమాహాత్మ్యాన్ని ప్రపంచాని కందిస్తున్నాయి

గండుతుమ్మెదలు అచటగల పూలచుట్టూ ఝుంకారము గావిస్తూ అందులో గల మకరందాన్ని గ్రోలడం, చూపరులకాహ్లాదాన్ని అందిస్తున్నాయి. ఆ గిరీంద్ర గుహలలో మహర్షులు వేలాది సంవత్సరాలు శంకరుని గూర్చి తపోనిష్ఠా గరిష్ఠులై యెక్కడ జూచినా కానవస్తారు.

అందు పార్వతిని గూడి పరమశివుడు తమ కళ్యాణానంతరం వేయి సంవత్సరాలు శృంగార లీలాకళోల్లాస హృదయులై క్రీడించి వేయి నిమేషాల్లాగ గడుపుతున్నారు. అది ఆది దంపతుల ఆనందనిలయంగా లోకాలన్నింటికీ ఆదర్శవంతమై ఉంది.

సురస్థిర సాధ్య విద్యాధరాదులు తపోసంపన్న క్రూర రాక్షసుడైన తారకాసురుడు గావించు బాధలు ముల్లోకవాసులూ భరింపలేకుండా ఉండగా, వారికి అండగా దేవతలు ఉన్నారు. వాడిని చంపగలిగే వాడొక్కడే ముల్లోకాల్లో ఉన్నాడు. ఆతడు పరమశివువీర్యము వలన ఉద్భవించే బాలుడు.

ఆ బాలుడెప్పు డుద్భవిస్తాడా అని ఆ శుభముహుర్తం కొరకు సర్వదేవతలూ ఒళ్ళంతా కళ్ళుచేసికొని అహరహము యెప్పుడెప్పుడా అనియెదురు చూస్తున్నారు.

అది అంతతేలిగ్గా అవుతుందా? అంచేత దేవతలు సత్యలోకానికేగి వాణీనాధుని దర్శించి అక్కడ నుండి బ్రహ్మను తీసుకొని, శ్రీమన్నారాయణుని దర్శించి బ్రహ్మాదిదేవత లందరు తారకాసురుని ఘోరకృత్యాలన్నీ యేకరువు పెట్టారు. అప్పుడు నారాయణుడు "బ్రహ్మాదిదేవతలారా ! మీకష్టాలు త్వరలో తీరుతాయి. మీరుకొంతకాలము వరకూ క్షమాపణముతో ఓపిక పట్టండి. ముందుగా పరమశివ దివ్యతేజాన్ని పార్వతీగర్భములో చేరకుండా చూడాలి.

ఒకవేళ పార్వతి గర్భమున ఆ తేజము పడిందా, మీరూ, నేనూ తుదకు పరమశివునికి కూడా లొంగని అజేయుడై ముల్లోకాలనూ సాధించే వాడుద్భవిస్తాడు. ముందుగా మీరుచేయవలసిన కార్యమొకటుంది. పార్వతీ పరమేశ్వరుల కలయికను నిరోధించాలి. ఆ పరమేశ్వరుని దివ్యతేజము భూమిపై పడునట్లు చేయాలి. అప్పుడా తేజము నుండి మహాపరాక్రమ సంపన్నుడు పుడతాడు. ఆతడే తారకాసుర మారక బాలుడు. మీరందరూ ముందుగా కైలాసానికి వెళ్ళండి. అనివారందరనూ ఓదార్చి నారాయణు పంపాడు.

దేవతలందరూ తిన్నగా కైలాసాద్రికేగారు. అచ్చట శంకరుని దర్శించి వారంర్రైఖ్య కంఠంతో దానములందు లౌకిక విధానములందు – నశేశ రాజ్యసం – స్థానములందు, నందన వన త్రిదశాబ్జముఖో వినోదసం ధానములందు, దివ్యసరిధానములందు, అమూల్యరత్న సంతానములందు నిల్పవు మనమ్ము భవన్నుతి దక్క శంకరా ! పరమశివా ! భక్తవశంకరా ! దోషనాశంకరా ! శంకరా పాహిమాం పాహిమాం పాహి.

అని పర్వాతీ పరమశివుల పరమక్రీడా భవముఖద్వార దగ్గర నిల్చి దేవాదిదేవా! ప్రభూ! మహా ఆర్తులము! నీ కరుణా కటాక్షంతో కరుణా వరుణాలయా! మమ్ము రక్షింపుమని – తారకాసుర బాధలనుండి కాపాడమని భోరున విలపించారు.

ఆ రక్కసుని అంతమొందించిననే మేము బ్రతుకుదుము. లేకున్న మేమందరమూ కూడి తమ దివ్య పాదారవిందాలు పట్టి యిక్కడే ప్రాణాలు



విడుస్తాము. ఆ రక్కసుని అంతమొందింప తమగర్భవాసము నుండి ఉద్భవించే అజేయుడగు కుమార శేఖరుని మాకు ప్రసాదింపుము ప్రభూ! ప్రసాదింపుమని మొరపెట్టుకున్నారు.

పార్వతీ శృంగార లీలావశంకరుడు శంకరుడు వారి దీనాలాపాలకు ఆర్ద్రహృదయుడై పార్వతీదేవిని విడిచి యీవలకు వచ్చాడు.

అగజాకుమారి తమ శృంగార లీలాకళకు అంతరాయము కలిగించే దేవతలందరిపై మహాకోపాన్నందించి. ముఖము జేవురించింది. బొమముడిపడే సరికి సురలందరూ ఆపాదమస్తకాలూ గడగడలాడ మహాభయభ్రాంతులయ్యారు.

అప్పుడు పార్వతి క్రోధవీక్షణాలతో "నాకు సంతానం కలుగకుండా అడ్డుపడిన మీకందరకూ సంతాన ప్రాప్తి లేకుండుగాక!" అని దేవత లందరికీ శాపమిచ్చింది. ఆ ఘోరశాపాన్ని తలదాల్చి సురలందరూ మనస్సులలో యెంతగానో సంతోషించారు.

రతిక్రీడకు మధ్యలో అంతరాయము కలిగినందువల్ల పరమశివుని దివ్యవీర్యం భూమీమ్మద పడింది. అప్పుడు దేవతలందరు ప్రార్థనలచేత అగ్నిహోత్రుడు ఆ శివతేజాన్ని కపోతరూపంతో మ్రింగాడు. దేవతలందరూ దానిని కొంచము కొంచముగా మ్రింగారు. యిలా సురులు శివుని వీర్యము మ్రింగుటచేత ఆ ఘోరాగ్నిని మ్రింగి జీర్ణించుకోలేక పోయారు. అందరూ హాహాకారాలు గావించి "ప్రభూ! శంకరా! ఆశతో తమవీర్యాన్ని మేమందరమూ కొంచము గానే మ్రింగాము ఆ వీర్యము ఘోరకాలాగ్నిగా మా గర్భకోశాలను దహిస్తూంది. కనుక తమరే యీ విపత్తునుండీ బయటపడే విధానము చెప్పమనగా "ఓహరి! బ్రహ్మదేవ! ఓ మహేంద్ర! ఓ అమరులారా! మీరు వెంటనే వాంతులు చేసికొండని పరమశివుడు చెప్పగా వారందరూ అలాచేయగా, ఆ శివవీర్యము బంగారమయినది. ఆకాశానికి ఎగిరిపోయింది. అప్పుడు దేవతలందరూ శంకరుని ప్రార్థించి వెళ్ళారు.

అగ్నిహోత్రుడు తాను మ్రింగిన శివుని వీర్యాన్ని గర్భమున భరింపలేక శివుని ప్రార్థించాడు. అప్పుడు పరమశివుడు "ఓ అగ్నిదేవా! ముందూ వెనుకా మంచీ చెడూ ఆలోచించకుండా నా వీర్యాన్ని మ్రింగావు. నారేతస్సు నీకు జీర్ణమవుతుందా? మహోజ్జ్వల దాహకశక్తిగల యిది ఒక పవిత్ర స్త్రీగర్భమున పడిన తరువాత నీ గర్భము చల్లబడుతుంది. అను శంకరుని వాక్కులు విని అగ్నిదేవుడు కొంత శాంతినిగొని, వెళ్ళాడు. కాని శివుని వీర్యాగ్నిని భరింపగల స్త్రీ యెవరని అదే ఆలోచనలోనుండి అగ్ని అన్వేషిస్తున్నాడు.

దైవయోగముతో సప్తమహర్షులు తమభార్యలతో ఒకనాడు ఆకాశగంగా తరంగాలలో జలక్రీడా వినోదలీలలో తేలియాడుచున్నారు. అనంతరము వారు దేవతలకు హవ్యమునీయ నెంచి అగ్నిహోత్రుని ప్రార్థింపగా అగ్నిహోత్రుడా హవ్యాన్ని దేవతలందరికీ పంచి పెట్టాడు.

అంతటితో సరిపోలేదు. ఆ అగ్ని భట్టారకుడు ఆ మహర్షుల భార్యల రూపవిలాస శోభలను గాంచి మన్మధాయత్త చిత్తుడైనాడు. "నేనీ శృంగారవతుల కౌగిలులలో చిక్కి వారితో రతిక్రీడా వినోదాల తేలకపోతే నా జీవితమెందుకు? నా బ్రతుకెందుకు?" అని కామదేవతా విష్టుడై క్రిందు మీదులాలోచింపకుండా అక్కడ నుండి ఒక గొప్ప సరోవరతీరాన్ని చేరి ఆలజములో పడిప్రాణాలు పోగొట్టుకొన నెంచాడు.

యీ విషయాన్ని గ్రహించిన పరమ పతివ్రత అగ్నిహోత్రుని భార్య "స్వాహాదేవి" ఆర్గురు మహర్షుల భార్యలరూపాలతో అగ్నిభట్టారకుడైన తన భర్తతో కామక్రీడా విలాసాలతో తేలియాడి అతనికి హృదయానందాన్నిచ్చింది. కాని మహాపతివ్రతా తిలకమైన అరుంధతీ రూపాన్ని మాత్రము ఆమె పొందలేకపోయింది. అప్పుడు అగ్నిదేవుడు తనలోనున్న శివుని దివ్యవీర్యతేజాన్ని ఆరురూపాలతోనున్న స్వాహాదేవి గర్భములో వేశాడు. ఆమెకూడా ఆవీర్యాన్ని భరింపలేక కైలాస శిఖరముపై వేసి తనబాధను బాపుకుంది. ఆ శ్వేతాద్రికూడా శివువీర్యాన్ని భరింపలేక గాలిదేవుని సహాయముతో ఆకాశగంగలో విడిచింది. ఆ ఆకాశగంగ గూడా శంకరుని మహోగ్రానల వీర్యతేజాన్ని భరింపలేక తరంగాల మూలాన రెల్లుపొదలలోనికి నెట్టింది. అప్పుడు మార్గశీర్ష శుక్లషష్ఠితిధిని రెల్లుపొదలో నుంచి ఆరుముఖాలతో పన్నెండు చేతులతో ఒకబాలుడు పుట్టాడు.

త్రిలోకసుందరుడైన ఆబాలుని గని ఆర్గురు కృత్తికలు బదరికావనానికి ఆ బాలుని తీసుకొని పోయారు. తమస్తనాల పాలిచ్చారు.

ఆకాశమునుండి ఆ బాలునిపై పుష్పవర్షము కురిపించారు. దేవత లందరూ పరమానంద భరితులయ్యారు. గంధర్వులు హర్షంతో నాట్యం గావించారు.

అగ్నిహోత్రునిభార్య ఆర్గురు మహర్షులదగ్గరకు వచ్చి హస్తాలు జోడించి, మహాత్ములారా! మీ ధర్మపత్నులు ఆర్గురూ మహాపతివ్రతలు. అట్టి వారిని విడుచుట మీకు ధర్మమా? వారిపై కోపము అనుగ్రహించండి, అని వారిని అనేక విధాల ప్రార్థించింది, బ్రతిమాలింది. అయినా వారు మాత్రము వారిభార్యలను తీసికొనలేదు. శివుని కుమారుడగు కుమారస్వామి ఆరుముఖా



లతో ఆ ఆర్గురు కృత్తికలస్తనాలందు గల పాలను త్రాగుచున్నాడు. "త్రిజగన్మోహన మూర్తివైన కుమారా! మేము కులటలమై నిన్ను కన్నామని జనులు మమ్మాడి పోసుకోగా, మాభర్తలు మమ్ము విడిచిపెట్టారు. మాకింకెవ్వరుదిక్కు నువ్వేకదా! నీ తల్లులమైన మాకు రక్షకుడవు నీవే! అని దుఃఖముతో నున్న ఆ యార్గుర తల్లుల జూచి "తల్లులారా! పతివ్రతామ తలుల్లలార! నేను మీ కుమారుడను, మీ దుఃఖాన్ని విడిచిపెట్టండి.

అని కుమారుడు ఆ తల్లులార్గురనూ తనవద్ద నుంచుకొని వారిని మాతృప్రేమలో మునిగినట్లు చేశాడు.

ఇలాకొంత కాలము జరిగింది. ఒకనాడు బ్రహ్మదేవుడా బాలుని చూడ్డానికి మునిపత్నుల దర్గరకు రాగా! వారుపరమానందముతో వాణీపతిని ఉన్నతా సనాసీను గావించి తమకుమారుని జూపబ్రహ్మ ఆకుమారునికి జాతకర్మాదులు రచించి కుమారుడని నామధేయము గావించాడు. ఆర్గురాతని తల్లులూ ఆనంద సాగరాన మునకలు వేయ వాణీనాధుడా కృత్తికలను జూచి "మునిపత్నులారా! యీ కుమారుడు అసామాన్య త్రైలోక్య వీరవిక్రమ శిఖామణి. అంతేకాదు దేవతల కొరకు శివవీర్య సంజాతుడగుట "స్కందుడను పేరుపొందాడు. అగ్నిభట్టారకుని వలన పుట్టుటచేత "అగ్ని భవుడనబడతాడు; గంగానదిలో కొంతవరకుండుట వలన "గాంగేయు"డని కీర్తింపబడతాడు; "కార్తికేయు" డనినామాన్ని ధరిస్తాడు, కార్తికేయులు చాలామంది ఉండడముచేత బాహులేయ డనబడతాడు, శివువీర్యమువలన ఉద్భవించుటచేత జగత్పావనుండయి "పార్వతీ తనయుడు"గా పేరుపొందుతాడు. సమస్తదేవసేనా నాయకుడౌటచేత "దేవసేనాని" అన బడతాడు;

తనసేనల నన్నింటినీ తగినట్లు రక్షించుటచేత "గుహుడను నామధేయ మందుతాడు, ప్రపంచమున దుర్మార్గుల నంతమందించుట వలన "కుమారుడు" గా పిలవబడతాడు. నెమలి వాహనుడగుట వలన విశాఖుడౌతాడు.

అంతేకాదు, క్రౌంచగిరిని భేదించుటవలన "క్రౌంచధారణుడు" గా పిలువ బడతాడు. అని ఆ కుమారుని ఆశీర్వదించి వాణీనాధుడు వెళ్లాడు.

యిలా దినదినాభివృద్ధితో ఆతడు శుక్లపక్ష క్షపాకరునిలాగ అభివృద్ధి నందుచున్నాడు. యిలా ఉండగా పార్వతీ పరమేశ్వరులు కుమారుడు కృత్తికల దగ్గర ఉన్నట్లు అగ్నిదేవుడు మొదలగు వారివలన విని నందికేశ్వరుని ఆతనిగొనిరా పంపారు. నందికేశ్వరుడు కాలగణపతి మొదలైన వారలను, ఆత్మీయ వీరభద్రాదులు, ప్రమథ నాథ భూతగణాల కోట్లాది పరిజనాన్ని

పంపారు. పుణ్యముని వరేణ్య, శరణ్య భూమియై అలాంటి పవిత్రమైన బదరి కావనాన్ని దర్శించి అక్కడ ఆర్గురు కృత్తికా మాతల హృదయారవిందాలు వికసింప చేస్తున్న కుమారుని దగ్గరకు వారందరూ వచ్చారు.

ఆ వచ్చిన శివసేననంతా కృత్తికలు జూచి భయభ్రాంతులై "కుమారా! యేమి యీ వీరసేనావలి? అన్నారు. అప్పుడు కుమారుడు తల్లులారా! మీకేమీ భయములేదు. యెందరు మనపైకి దండెత్తి వచ్చినా వారినందరరూ క్షణములో నే గెలుస్తాను" యిలా అంటున్న కుమారుని దగ్గరకు నందికేశ్వరుడు వచ్చి ప్రియముతో యిలా అన్నాడు. "కుమారా! కృత్తికామాతలార! మీరు వినండి. త్రిలోకాధినాథుడు యీ కుమారుని తీసుకొని రమ్మని మమ్మందరనూ పంపాడు. నీవు పార్వతీ పుత్రుడవేగాని కృత్తికా పుత్రుడవుకావు. దేవతా కార్యార్థివిగా పరమశివు దివ్యతేజోవీర్యముతో ఉద్భవించావు. అందువలన నిన్ను చూడాలని ఆత్రుతతో నున్నవారిని దర్శించగా రాకుమారా! అనగా, అన్నా నందికేశ్వరా! కృత్తికలునాకు వారు పాలుపోసి నన్ను మాతృప్రేమతో సాకారు. అందువలన వారు నాకు పూజనీయ తల్లులు-వారూ నాకు మాతాపితలే అన్నాడు కుమారుడు.

దానికి నందికేశ్వరుడు పరమానందమందాడు. అప్పుడు ఆరుగురు కృత్తికా మాతలు కుమారుని కౌగిలించుకొని "కుమారా! నీవే మా పంచప్రాణా లుగా నిన్ను పెంచాము. అటువంటి మమ్మువీడి నీవు వెళ్లుచున్నావని యెంతగానో దుఃఖించారు.

అంతవారిని జూచి "మాతలారా! మిమ్ము నేనెన్నటికీ విడువను. మీరు నా హృదయములో యెప్పుడూ నిలిచి ఉంటారు" అని తల్లులను కుమారుడు వారించాడు.

విశ్వకర్మ అనల్ప శిల్పకల్పనలతో నిర్మించిన స్వర్ణరత్న స్థగితమూ నూరు చక్రాలు కలదీ; పుష్పక విమానాన్ని ప్రమథగణాలూ, రథాలూ ఉండగా తల్లులతో కూడా కుమారుడా రథాన్ని అధిరోహించాడు.

## 2. కుమారుడు తల్లి తండ్రులను చేరుట

పార్వతీదేవి తనకుమారుడు తరలి వస్తున్నాడని పట్టరాని ఆనంద మందింది. నందీశ్వరుడు కుమారునికి శ్వేతచ్ఛత్రం పట్టాడు. మరుత్తులు - భూతగణాలు, సంతోషిస్తున్నారు. వారందరు ముందు నడుస్తూ పరమ శివ కుమారునికి జై-జయ ధ్వనులు గావిస్తున్నారు. పరమశివునితో సమానుడైన వీరభద్రుడు యెంతోలాలన గావిస్తున్నారు.



భేరీలు మ్రోగుతున్నాయి. తూర్యనాదాలు మిన్ను ముట్టాయి. పార్వతీదేవి కుమారుడు వచ్చే మార్గమంతా కెంపులు, పచ్చలు, ముత్యాలు, పూవులు చల్లునట్లు యేర్పాటు గావించింది. శ్రీహరి, బ్రహ్మ, దేవతలు మహేంద్రుడు మొదలైనవారంతా వెండికొండచేరిన కుమారుని దండిగా దండాలర్పించారు.

ఇక పరమశివుడు పట్టరాని ఆనందానొలకబోసి కోట సింహద్వారము దగ్గరకు స్వాగతము పల్కగా వచ్చి నిలుచున్నాడు. యింతలో కుమారుడు దగ్గరకు వచ్చాడు. రథాన్ని దిగి ఆనందమందిన డెందముతో పరమశివునకు పాదాభి వందన గావించాడు.

శంకరుడు కుమారుని హస్తాలతో లేవనెత్తి హాయిగ అక్కున చేర్చుకొని మనసారా ముద్దుబెట్టి కొన్నాడు. తరువాత గిరిరాజకుమారి కుమారుని యెత్తికొనగా ఆమెకుపాలు చేపురాగా కుమారునికి తనస్తన్యము పాలుపెట్టింది. మునుపు ఆర్గురు తల్లుల పాలుత్రాగిన కుమారుడిప్పుడు ఒక్కపార్వతీదేవిపాలే ఆనందముతో త్రాగాడు.

ఆ సమయాన గంధర్వులు గీతాలాలపించారు. వేదనాదాలు మిన్ను ముట్టాయి. దేవకాంత లందరూ కుమారునికి మంగళహారతులు సమర్పించారు.

పరమశివమూర్తి తన ఆత్మకుమారుని సువర్ణభవన సభాలయములో సింహాసనముపై తానుకూర్చొని తనకుడి భాగాన కుమారునితొడపై కూర్చుండ బెట్టుకొని ఆనందించాడు.

నవరత్నమయ పీఠాన నవరత్న ఖచిత స్వర్ణాభరణాలతో తన కాంతా రత్నము పార్వతీదేవితో సురరత్నాలందరూ కొలువగా శంకరుడు సంతోష సామ్రాజ్యాభిషిక్తు డయ్యాడు. అప్పుడు కుమారునికి శూలము, పినాకము, పరశువు, శక్తి, పాశుపతము దివ్యబాణము, బ్రహ్మవిద్యలిచ్చి శంకరుడు ఆనందహృదయుడయ్యాడు.

శ్రీహరి ఆ కుమారునికి ధగద్ధగాయ మానమైన నవరత్న స్థగితసువర్ణ కిరీటాన్ని ఆతని ఔదలనుంచి విజయోస్తు అని ఆశీర్వదించాడు. అనేక మణిమయ హారా లిచ్చాడు. సూర్య భగవానుడు మనోజవమున పోవు రథాన్ని, శక్రిచక్రాన్ని, చంద్రుడు అమృతభాండాన్ని, విలువ తెలియని రత్నాలు రత్నాకరుడు; హిమాలయుడు మణులను; సముద్రుడు మంచి గుఱ్ఱాలను; గరుత్మంతుడు మహాఅందమైన నెమలిని వాహనము కొరకు; పార్వతి చిరాయువు, కీర్తిగల వైభవము; శ్రీమహాలక్ష్మీ భోగభాగ్యాలూ; మనోహర రత్నహారాలు, శారదసమస్త విద్యలనూ, కుమారునకు సమస్త దేవతా మూర్తు లందరూ సమర్పించారు.

సువర్ణ ఆభరణాలతో మంచి ముత్యాలు వస్తు వాహనాలతో ప్రాజ్య సామ్రాజ్యా భిషిక్తుడయ్యాడు కుమారుడు. అప్పుడందరూ కలిసి దేవసేనాధిపతిగా అభిషేకించారు.

## 3. తారకాసుర వధ

ప్రజాపతులందరిలో ప్రముఖుడైన కశ్యప ప్రజాపతికి పదముగ్గురు భార్యలున్నారు. అందులో 'దితి, అను ఆమెకు వజ్రాంగుడు' అనువాడు పుట్టాడు. ఆతడు మహావీర శూరత్వముతో సార్థక నామధేయ డయ్యాడు. అంతేకాదు యీవజ్రాంగుడు గురుముఖతా సమస్త శాస్త్రాలధ్యయనముగావించాడు. మహా విద్వాంసు లందరీతనిని వేనోళ్ల కొనియాడేవారు. యింతటివాడు యెక్కడా లేడని కీర్తిగాంచాడు. "వరాంగి అనే కన్యను వజ్రాంగుడు వివాహము గావించుకొన్నాడు. ఒకనాడు భార్యను చూచి "వరాంగీ! మనిషికి యెన్ని ఉన్నా మహాశక్తిని యిచ్చే "తపస్సు లేక నాకు తృప్తిలేదు. అందువలన తపస్సు చేయాలి. నీ యభిప్రాయాన్ని తెలుపు మనగా ఆమె ప్రాణపతీ! అన్ని తెలిసిన మీకు నా యభిప్రాయమేపాటిది? మీ యిష్టమే నాయిష్టమన్నది.

అప్పుడా భార్యాభర్తలు ఘోరారణ్యములో మహాతపస్సు గావించారు.

వరాంగి గావిస్తున్న తపోగ్ని మూడులోకాలను మంగళములో వేచినట్లు మాడిస్తుంది. మహర్షులూ దేవతలూ ఆ తపస్సుకు అట్టుడికినట్లు ఉడికిపోతున్నారు. అప్పుడు వారందరూ కలసి మహేంద్రుని దర్శించి వరాంగి తపస్సు గూర్చి చెప్పి ఆమె తపో భంగము గావించాలి. లేకుంటే ముజ్జగాలు మండిపోతా యని అతనిని కోరారు.

యింకేముంది? ఆమె తపస్సు భగ్నము చేయడానికి ముందుగా ఆమెతపో భూమిలో రాళ్ళవర్షము కురిపించాడు. దానికీ ఆమె చలించలేదు; వాయువును ప్రార్థించగా ఝంఝూమారుతాన్ని వాయుదేవుడామెను ఎగరగొట్టగా మరల దీక్షతో ఆమెతాను పడిన దగ్గరనుండి స్థిరచిత్తైకాగ్రతతో ఘోరతపస్సు గావించింది. అంతటితో ఆగక మహేంద్రుడు ఆమెపై పిడుగుల వర్షం కురిపించాడు. ఆ పిడుగులు ఆమెపై బడి వడగళ్ళయ్యాయి. ఇలా ఎన్ని ప్రయత్నాలు చేసినా ఆమె తపోదీక్ష యెక్కువయ్యేనే కాని దీక్షవిరమించలేదు. వజ్రాంగుడు తన భార్య తపస్సును భగ్నముగావించే ప్రయత్నాలు మహేంద్రుడు గావించిన వన్నీ ఆమె తన భర్తకు చెప్పగా ఆతడు మండిపడ్డాడు. అగ్గిపై గుగ్గిలములాగయ్యాడు. తన అర్థాంగికి గావించిన క్రూర కృత్యానికి ఆపాదమస్తకమూ మంటలెగయ

దేవతలనందర మహేంద్రుని జయింపగల కుమారుడు కావాలని వజ్రాంగుడు బ్రహ్మదేవుని గూర్చి ఘోరతపస్సు గావించాడు.

ఆతని తపోవేడి లోకాలనెల్ల కాల్చగా మహేంద్రాది దేవతలందరూ బ్రహ్మను ప్రార్థించి వజ్రాంగుని తపస్సుగూర్చి ఆతనికి విన్నవించారు. అప్పుడు వాణీపతి వారినందరిని పంపి తాను వజ్రాంగుని దరి ప్రత్యక్షమయ్యాడు. అప్పుడు బ్రహ్మ

**కం॥ లెమ్మా వజ్రాంగ ? నీ**
**విమ్మహి గావించు తపము యెంతో సంతో**
**షమ్మును గూర్చెను; నీవే**
**మిమ్మానెదో కోరుకొమ్ము యిచ్చెదనిపుడే"**

అప్పుడు వజ్రాంగుడు తనదగ్గర ప్రత్యక్షమైన వాణీనాధుని గాంచి అనేక విధాల స్తోత్రము గావించి "సత్యలోకాధినాథా ! "సర్వదేవతలనూ జయించగల పుత్రుని తమరు నాకు ప్రసాదించండని" అనగా "తథాస్తు" అని బ్రహ్మతిరోహితు డయ్యాడు.

అలా వజ్రాంగుడు బ్రహ్మవరాలను పొంది సంతోషముతో ఆ దంపతులు సంసార సారాన్ని అనుభవిస్తూ మనసారా బ్రహ్మను నుతించగా, వరాంగి గర్భము దాల్చింది. దానికి వజ్రాంగుడు పరమానంద భరితుడయ్యాడు. యిలా "వరాంగి, తొమ్మిదినెలలు నిండగా పదవమాసాన ఒక కుమారునికన్నది. తల్లిదండ్రులా తనికి "తారకు"డనే నామకరణం గావించారు. ఆ తారకుడు దినదినాభివృద్ధి గాంచి అప్పుడు బ్రహ్మను గూర్చి తపస్సు చేసి తనకు మారకమున్న బాలుచే అదిరావాలని కోరు కున్నాడు. మహేంద్రాది దేవతల గుండెల్లో గునపాలు గ్రుచ్చుసాగాయి. వరప్రసాది తారకుడు తండ్రిని మించిన వీరుడు, తండ్రికంటే సమస్త శాస్త్రాలు శుక్రాచార్యులవారి దగ్గర అధ్యయనము గావించాడు.

ఒకరోజు అమరావతీ నగరాన్ని ఆక్రమించుకున్నాడు. తారకుడు సర్వదేవతా క్రందనలతో తొడగొట్టి మహేంద్రుని యుద్ధానికి ఆహ్వానించాడు. అంతకుముందే ఆతని ధీరవీర శూరత్వము విని ఉన్న అమరులు భయభ్రాంతులై పరుగెత్తారు. యీ తారకాసురునికి కుడి యెడమ హస్తాల్లాగ కాలనేమి జంభాసురుడూ యిద్దరు వీరవిక్రమ కళాకోవిదులు, కామరూపులు, కామ చారులుకూడా.

జంభాశురుడు వీరశంఖారావం చేయగా విష్ణువు యిది సమయము కాదని యుద్ధరంగమునుండి తప్పుకున్నాడు. మహేంద్రునికిపైకి వాడు వెళ్లగా

మహేంద్రుడు పరమశివుని ప్రార్థించి ఒకే బాణముతో జంభా సురునిపై విజృంభించి వానితలను నేలగూల్చాడు.

తనకన్నివిధాలా బాసటగా నిల్చిన జంభాసురుడునేలకూడముతో తారకుడు రణరంగమంతానై చెలరేగి యింద్రుని జయించాడు. దానిని చూస్తున్న వీరభద్రుడు కోపోద్రిక్తుడై తారకుని యెదిరించాడు. దేవతల నందరనూ వెనకవేసుకొని యెందరినో రాక్షసులను వీరభద్రుడు వధించాడు.

తారకుడు అడ్డమురాగా వాని వక్షస్థలాన త్రిశూలముపై మోదాడు వీరభద్రుడు, ఆ దెబ్బతో తారకుడు తనరథముపై మూర్ఛిల్లాడు. కొంతసేపటికి తారకాసురుడు తెప్పరిల్లి కోపోద్రేకముతో వీరభద్రునిపై ఒకశక్తిని వేయగా అది భయంకరంగా రాగా వీరభద్రుడు తనశక్తితో దానిని త్రుంచాడు.

తారకాసురుడు రణరంగాన దేవతల కందరకన్ని రూపాలతో యెదిరించి యుద్ధము గావింపగా ఆదిగాంచిన వాణీనాధుడు యింకమించిన లాభము లేదని కుమారుని ప్రార్థించాడు.

**శా॥ ఓ వందారు జనావనోద్యమని బద్ధోద్యన్మహా కంకణా !**
**ఓ విశ్వోత్తర శౌర్యధైర్యవిభవా! యో దేవదేవోద్భవా!**
**నీవాలంబును బూని దైత్యునిక ఖండింపంగ భావింపుమా !**
**దేవాత్మవ్యథ దీర్పగా గడగుమా! దివ్యత్కృపాంభోనిధీ.**

## 4. రెండవ రోజు యుద్ధము

అలా బ్రహ్మ ప్రార్థింపగా తన సర్వదేవబలంతో తారకునిపైకి వచ్చాడు కుమారుడు. కుమారుని చూసిన తారకాసురుడు చిరునవ్వుతో "బాలకా! నీకాలమా? దుర్మార్గులైన అమరులు నిన్ను నాపైకి యుద్ధానికి పంపారా! అయ్యోపాపము! బాగా చిన్నవాడవనగా

కుమారుడు "ఓరీ మూర్ఖా! నేను బాలుడనేకాదు. నీకు కాలుడనురా! యుద్ధానికిరా! అనగా, తారకుడు కుమారునిపై బడ్డాడు. యిరువురు యోధులూ అసామాన్యులే. యెవరు వెనుతిరిగినవారుకారు. సమస్త శస్త్రాలతో యిరువురూ త్రిలోక భయంకరంగా యుద్ధముగావింపగా–

కుమారుడు పార్వతీ పరమేశ్వరులను తన హృదయములో గాఢముగా ఉపాసించి ముల్లోకాలనూ అల్లకల్లోలము గావించిందీ, మహోజ్జ్వల తేజముగల శక్తిని కుమారుడు తారకునిపై వేయగా అది ప్రళయకాల దావాగ్నిలాగ భూన



భోంతరాళాలనూ మంటలను ప్రజ్వలింపచేసి క్షణములో తారకుని తలను ఖండిం చింది.

దేవతలకూ, మహేంద్రునకూ పట్టరాని ఆనందం కలిగింది. కుమారునిపై పూలవాన దివినుండి కురిసింది. పార్వతీ పరమేశ్వరులు వచ్చి కుమారుని మాతృపితృప్రేమానురాగ అభిమాన ఆనందబాష్పాలు కనులనుండి ఆతనిపై ఒలికించి తమకౌగిళులలో చేర్చుకున్నారు.

**సర్వం శ్రీ పరమేశ్వరార్పణమస్తు**

## 5. శ్రీవల్లీ కళ్యాణము

**ఉ॥ పుణ్యము ! వైరిజంతు పరిపోషిత తోషిమృగాఽహిగానము**
**ధ్గణ్యము ! సంయమీశ్వర కృతప్రతికూల విహీనయాగనై**
**పుణ్యము ! నిర్జరీతతవిభుస్వనగణ్యము మించు నైమిషా**
**రణ్య మగణ్యపుణ్యముని రాజవరేణ్య శరణ్య భూమియై**

అటువంటి నైమిశారణ్యాన శౌనకాది మహర్షులు దీర్ఘసత్రయాగాన్ని చేస్తుండగా అక్కడకు సూతపౌరాణికుడు రావడం; ఆతడు వారలకు పదునెనిమిది పురాణగాధలను విపులంగా చెప్పడం జరుగుతుంది.

మహర్షులందరూ "మహాత్మా! సూతా! కుమారుని చేతిలో తారకుడు మారకుడైనాడు. తరువాత ఆతని వివాహం యెవరితో జరిగిందో యీరోజు దానిని చెప్పమని ప్రార్థించగా–సూతుడు తనగురు దేవుడగు వ్యాసభగవానుని ప్రార్థించి యిలా చెప్పాడు." మహామునులారా! యీ రోజు "కుమార శ్రీవల్లీ కళ్యాణము మీకు విన్నవిస్తాను వినండి.

ఒకరోజు మహావీర శూర శిఖామణి కుమారుడు తన మిత్రులతో విహారం జరిపి ఆనందలీలాచంద్రుడై ఉండు సమయాన – త్రిలోక సంచారి నారదమహర్షి అక్కడకు రాగా, కుమారుడు యెదురేగి సాష్టాంగవందనాలాచరించాడు. ఆతనికి ఉచితాసనమిచ్చి మహర్షి దానిపై కూర్చుండగా! "మహాత్మా, లోకాల్లో సమస్త విషయాలు తమకు తెలియనివికాదు. నాకు వినిపించండ"ని కోరగా నారదుడాతనికి ఎన్నో విషయాలు చెప్పాడు.

అనంతరం "పరమ శివపుత్రా ! నీకు చెప్ప వలసిందొకటుంది, సావధానంగా వినుము.

ఒక భిల్లపురమందు ఒక భిల్లరాజు సమస్త భాగ్యాలతో శోభిల్లు చున్నాడు.

శివుడనే ఒక మహర్షి ఆతడు శ్రీహరి అంశగలవాడు. హరిణిని మోహించి ఆమెలో తన తేజోవీర్యాంశాన్ని విడిచాడు. అంత దేవాంగన హరిణి ఒక సుందర బాలికను కన్నది. ఆ బిడ్డను ఆ అరణ్యాన విడిచి దేవలోకానికేగింది. ఆ మహర్షి కూడా జరిగినపనికి యెంతగానో చింతించి తనదారిని పోయాడు.

ఆ సమయాన అటు అరణ్యాన యేడుస్తున్న బాలికను భిల్ల చూశాడు. ఆ బాలికను గొనిపోయి తనభార్యకు చూపింపగా ఆమె పరమానందమంది "యీ బిడ్డను సంతానములేని మనకు శంకరుడిచ్చాడయ్యా" అని అక్కున జేర్చుకొని ముద్దాడి ఆమెను అతిగారబంగా పెంచారు.

యిప్పుడాబాలిక నవయౌవనాంగి యయి పురుష కరస్పర్శకై ఉవ్విళ్లూరు తూంది. యిక ఆ కన్య అందచందాలు చెప్పడానికి వేయితలలు గల ఆదిశేషునికి కూడా వశంకాదు. మూడులోకాల్లో అటువంటి సుందరి యెందూలేదు.

ఆమె మోము చంద్రుని యెకసక్కేలాడుతుంది. ఆమెస్తన్యద్వయము చక్రవాకాలను మించి ఉంటాయి. చేడిశలలాంటి నేత్రాలు, ఆదిశేషుడు వంటి జడ; సింగము వంటి నడుము; ఆమెపలుకు అమృతాలు రాజహంసలాటి నడక; అటువంటి అందాలరాశి లేదు లేదు.

వాణీపతి ఒకనాడు "ఆతల్లికి కుమారుడే నాథుడౌతాడని, నాకు చెప్పాడు. సరేలే కుమారా! నేను వెళ్ళి వస్తానని నారదుడు తనదారిని తానుపోయాడు.

కుమారుని నారదునికి వాక్కులు హృదయాన బాగానాటాయి. ఆ వల్లినే నేను పెండ్లాడాలని కుమారుడు మనసులో ముద్రించుకొని విరహంతో బాధపడ సాగాడు.

యిక్కడ యిలా వుండగా, నారదమహర్షి ఒకనాడు భిల్లపురానికి వెళ్లాడు. భిల్లరాజు దంపతి ఎదురుగా వచ్చి, నారదమహర్షికి సాష్టాంగపడి అర్ఘ్యపాద్యాదులిచ్చి పూజించారు. "భిల్లరాజా! మీ దంపతి క్షేమమేనా? యీ కన్యకామణి వలననే మీ వంశము లోకములో మంచి కీర్తివంతమౌతుంది" అనగా శ్రీవల్లియు వచ్చి నారదునకు పాదాభివందన మాచరింపగా భిల్లరాజు ఆనందముతో తనయను తొడపై కూర్చుండ బెట్టుకొన్నాడు.

"మునీంద్రా! యీ కన్యామణికి ఎవరితో యెప్పుడు వివాహము జరుగుతుంది?" అను భిల్లరాజుకు మునీంద్రుడు "భిల్లరాజా! నీకుమారికి పార్వతీపరమేశ్వరుల పుత్రుడు దేవసేనాని మహావీరశూర శిఖామణి కుమారుడే పాణిగ్రహణం చేస్తాడు. తొందరలో వీరిరువురికి వివాహం జరుగుతంది." అని నారదుడు వెళ్ళాడు.



ఇక్కడ కుమారుడు శ్రీవల్లిపై హృదయాన్నిచ్చాడు. సర్వమూ వల్లీరూపంగా కాన్పిస్తుండగా, భరింపలేక యెలాగైనా ఆమె రూపాన్ని ఆపోశనము పట్టాలని భిల్లరూపంతో వెళ్ళాడు.

శ్రీవల్లీ భిల్ల వనాన విహారం చేస్తూంది. కుమారుడామెకు కానరాకుండా చూచి "ఆహా! యేమి యీమె రూపలావణ్యం, అని నారదుడందుకే నాతో అంతగా చెప్పాడను కున్నాడు. "బ్రహ్మ యీమెను హస్తముతో చేయలేదు. ఆత్మతోచేసి ఉంటాడు లేకపోతే యీమె రూపాన ఆతనిహస్తముద్ర పడకుందునా? అని తిన్నగా మోహాన్ని పట్టలేక శ్రీవల్లి దగ్గరేవెళ్లి "రమణీ! నీపైగల మోహముతో నీదగ్గర వచ్చాను. నీదగ్గ దాపరికమెందుకు? నేను పరమేశ్వర కుమారుడను. కుమారుడను, అందువలన నీవు తప్పకుండా వరించాలి?" అనే కుమారు మాటలు విన్న శ్రీవల్లి సిగ్గుతో ముసి ముసి నవ్వులతో తన హృదయాన నారదమహర్షి చెప్పిన గురుతులన్నీ యీతనిలో ఉన్నాయి. నా హృదయమూ యీతనిలోనే వున్నాయి. నా హృదయమూ యీతని రూపములో చిక్కిపోయింది. యీతడు పార్వతీనందనుడే! అని కుమారునితో:

"మహాభాగా! నా తల్లితండ్రులున్నారు. అంతేకాదు. పరమశివుని కుమారుడు కుమారునకే నా హృదయాన్నర్పించాను. నన్ను మీరు కరుణించి మన్నించండి. అన్నది. యింతలో భిల్లరాజు వచ్చి మధ్యాహ్న సమయమయిందని శ్రీవల్లిని తీసుకొని వెళ్లాడు. అక్కడ శ్రీవల్లి యిక్కడ కుమారుడూ పరస్పరం మన్మథాయుక్తచిత్తులై అంతము లేనివిరహాలతో బాధపడుతున్నారు.

యిలా శ్రీవల్లి విరహవేదనతో సర్వమూ విడిచి దేవిని జూచినా శంకరు సుతుని రూపముగానే యెంచి దీనురాలయింది. యింతలో శ్రీవల్లి ఆప్తచెలికత్తె అంతా విని ఒకరేయి శ్రీవల్లిని తీసికొని కుమారునకు అప్పగించి "కుమారా! యీమె యెంతో బేల యెలా యేలుకుంటావో నీదేభారము, అని వెళ్లింది. కుమారుడు ఆమెతో రతిక్రీడావిలాసాలలో మునిగిపోయాడు.

యిక్కడ శ్రీవల్లిని కానక ఆమెతల్లి యెంతో తల్లడిల్లిపోసాగింది. యీ విషయం భర్తకు చెప్పింది. అప్పుడు భిల్లరాజు పట్టరాని క్రోధావేశముతో ఘోరాకారులు, మహాక్రూరులు, కిరాతకులతో బయల్దేరి వెతకడం ప్రారంభిం చారు. సరిగ్గా శ్రీ వల్లీ కుమారులు ఒకపూపొదరింట నుండగా భిల్లుడు కుమారునిచూచి "ఓరీ! చోరుడా? నాకుమార్తెనే దొంగిలించు నంతయోధుడ వయ్యావా?" అని దారుణమైన బాణాలను ఆతడు కుమారునిపై వేశాడు. ఆ కిరాతకులూ ఆతనిపై వాడిములుకులను వేశారు.

కుమారునికి ఆ బాణాలు తగలగా శ్రీవల్లిని భయపడవద్దని చెప్పి ఆ భిల్లరాజు– భిల్లులపై కుమారుడు సమ్మోహనాస్త్రము వేశాడు. దాంతో వారందరూ భూమ్మీద పడి దొర్లుతూ తూగుచూ లేచుచూ మరల పడిపోతూ దిక్కుతోచక వికారాలతో పొర్లాడు వారిని కుమారుడు చూశాడు.

వారందరూ తాముచేసిన తప్పు క్షమింప మనగా కుమారుడు వారందరికీ సేదదీర్చాడు. అప్పుడు వారందరూ పరమానందముతో కుమారునిగా తెలిసి కుమారునికి సాష్టాంగాలు చేశారు.

అప్పుడు భిల్లదంపతి తమవారందరినీ పిలిచి శ్రీవల్లిని కుమారునికిచ్చి జన్మలు తరించాయని అందరూ ఘనముగా వివాహము గావించిరి.

**సర్వం పరమేశ్వరార్పణమస్తు**

## 6. కుమార తత్త్వము



కుమారతత్త్వము చాలా లోతైనది. బ్రహ్మసృష్టి మానవమైంది. యీ జగానికి కారణము. కుమార సృష్టి అమృత ఆనంద ఆధ్యాత్మిక లోకానికి కారణమౌతుంది. కుమారతత్త్వము లోకాన నిత్య జాగ్రత్త అవస్థా చైతన్యాన్ని చూపుతుంది. కుమార జన్మలోనే విశేషముంది.

ఋగ్వేదములో ఒకచోట యీ మంత్రముంది.

**“వవ్రాజాసీమనదతీ రదద్భాదివో యహ్వీదవ సానా అనగ్నాః**
**సనా అత్ర యువతయః స యోనీరేకం గర్భం దధిరేసప్తవాణీః**

(ఋగ్వే 3-1-6)

యీ సప్తవాణీ శబ్దము కుమారుని పుట్టుటకు కారణము కాగల ఆర్గురు తల్లులను చూపుతుంది. ఋగ్వేద అంభాస్సులలో మరొకచోట దేవీ సూక్తాలున్నాయి.

## 7. అగ్నిరాయబార తత్త్వము

కుమారుడు తారకాసునితో యుద్ధము చేయడానికి ముందుగా అగ్నిభట్టార కుని వాని దగ్గరకు రాయబారానికి పంపుతాడు. యిందులో అపూర్వ ఆధ్యాత్మిక తత్త్వము యెంతో యిమిడిఉంది.

అగ్నిదేవుడు స్వర్ణరథా న్నధిష్టించాడు. యీ విషయమెంతో సందర్భముగా ఉంది. “సర్వం బంగారు మయం అగ్ని”



తారకాసురుని చూచి దాతగా వచ్చిన అగ్నిదేవుడు యిలా అన్నాడు.

అన్నిటికీ కాలమే కారణం, కాలానికి ఎదురుగా వ్యతిరేకంగా యెవ్వరూ పోలేరు.

“తారకరాజా! కుమారతత్త్వం విను. సౌమ్య యాగము ఒక యజ్ఞము. కుమారుని బాణం ఆ యజ్ఞవేదిక. ఆతని బాణం రెండుకొనలూ, పిడి త్రేతాగ్నులు (గార్హపత్యము దక్షిణాగ్ని, ఆహవనీయం) ఆతనినారి అధర్వణవేదం, యజ్ఞవేదిక నాలుగువేదాలు; అధర్వణవేదం రాజు; తక్కినవి బ్రాహ్మణుడు, శత్రువుల నశింప చేయడానికి మారణ మంత్రాలున్నాయి. కొన్నివేల దివ్యసంవత్సరాలు తపస్సు చేసిన మహర్షులు యీ మంత్రాలను సృష్టించారు. అది నాల్గవ వేదం. వారు క్షత్రియుల కిచ్చారు మహర్షులు.

కుమారుని బాణానికి యోగవిద్యకూ దగ్గర సంబంధముంది. ఆ ధనస్సుకు ఆరుకమలా లుంటాయి. అవి 1. మూలాధార చక్రము; 2. స్వాధిష్ఠాన చక్రము; 3. మణిపూరకచక్రము; 4. అనాహత చక్రము; 5. విశుద్ధ చక్రము; 6. ఆజ్ఞాచక్రము; వీటికీ రత్నాలకూ యెంతో దగ్గర చుట్టరికముంది. 1. గరుడరత్నం; 2. గోమేధిక రత్నం; 3. ఆశ్మసారమణి; 4. శోణమణి; 5. హరిశిలరత్నం; 6. పుణ్యరోగ శోభతో ప్రకాశించు ఆతని సువర్ణ ధనస్సు.

నీవాకుమారుని, శత్రుదృష్టితో చూడకుండా మైత్రి చేసికో! ఆధ్యాత్మిక దృష్టితో చూస్తే నీ హృదయం పరమానంద భరితమౌతుంది. అందుకే ఆతని బాణానికి అంత మహత్తర శక్తి ఉందని తెలిసికో!

1. మూలాధారం – గుదస్థానములో ఉంటుంది.
2. స్వాధిష్ఠానం – జననేంద్రియములో ఉంటుంది.
3. మణిపూరకం – నాభి దగ్గర ఉంటుంది.
4. అనాహతం – హృదయములో ఉంటుంది.
5. విశుద్ధం – కంఠములో ఉంటుంది.
6. ఆజ్ఞాచక్రం – బొమలు మధ్యలో ఉంటుంది.

ఆతని ధనస్సు మేరుదండం; ఆతడు కుండలినీ శక్తిని స్వాధీనం చేసుకున్నాడు. దాన్నే పొందుతాడు. యిందులో భావనాశద్వోత్తత్తి శాస్త్రం, యోగశాస్త్రం కలిసే ఉంది.

ధనుర్దండం క్రింది నుంచి చూస్తే ఇంద్ర, వరుణ, అగ్ని, వాయువు, ఆకాశ ముతో ఒప్పుకున్నాడా? లేదు మీదుగా అగ్నిని చూసి

"మూర్ఖుడా! ఊరుకుంటే నీవు చాలా చెప్తుతావు. నీశరీరాన్ని కయ్యలుగా కోస్తాను. ఆ దెబ్బమానడానికి అరుంధతి వేస్తావా? (అరుంధతి ఒక ఓషధి; అంతే కాదు" అరుంధతి" అనే శబ్దం అధర్వణ వేదములోనిది, అనగా, తారకుడూ వేద వేదాంగాలు చదివాడని మనం తెలిసికోవాలి.

యింకా తారకుడు యిలా అన్నాడు "నీవు వానికి దాసుడవు; నిన్ను చంపే నీచత్వం నాకేల?" అన్నాడు.

## 8. కుమారుని శక్తి బాణము

**మూలాధారం :**

యీ మూలాధార చక్రం నాలుగు పత్రాలతో నున్నపద్మం. ఆ రేకుల చివర "వం-శం-షం-సం" అను నాలుగు బీజాక్షరాలున్నాయి. యీ పుష్పకర్ణి మధ్యభాగంలో భూమండలన్న నామముతో చతుష్కముంది. దానిచుట్టూ ఎనిమిది బల్యాలుండగా; ధరాబీజుడు (లం) ఉన్నాడు. ఆతడు పసుపు రంగుగలవాడు. దీనికి నాలుగు భుజాలు, ఐరావతము పైని కూర్చొని ఉంటుంది. అతని హస్తంలో వజ్రా యుధ ముంటుంది.

భూబీజం బిందువులో బ్రహ్మశిశువున్నాడు. అతడు రక్తవర్ణములో నుంటాడు. ఆతడు చతుర్భుజుడు. ఆతని నాలుగు భుజాల్లో దండకమండల రుద్రాక్ష మాలలు ధరించి అభయముద్రతో ఉంటాడు. అతనికి నాలుగు భుజాలున్నాయి. యిందులో మరొక రక్త కమలముపై చక్రాధిష్ఠాత్రి ఢాకినీ శక్తిఉంది. ఆమెది రక్తవర్ణం. ఆమె నాలుగు హస్తాల్లో శూల, ఖాట్వాంగ, ఖడ్గ చషకాలు (మధముత్రాగే పాత్ర) ఉంటాయి. కర్ణిక మధ్యలో మెరపులాంటి కాంతిని బోలిన త్రికోణముంది. అందులో కామ, వాయు, కామబీజాలున్నాయి. (క్లీం) దీనిపై స్వయంభూ లింగముంది. ఇది శ్యామలకాంతి గలది. దీనిచుట్టూ మూడున్నర సార్లు చుట్టుకొని దాని చివర లింగముపై చిత్కళారూపముతో ప్రభాసిస్తుంది. కుండలినీ రూపాంతరమే చిత్కట.

**స్వాధిష్ఠాన చక్రము :**

ఇదికుంకుమ రంగులో ఉంటుంది. ఆరు పత్రాలుంటాయి. దీనికి "ఐ,భ,మ,య,ర,ల," మీద బిందువుంటుంది. (బం,భం, మం, యం, రం, లం) అన్నవి యీ బీజాక్షరాలకాంతి మెరపులా ఉంటుంది. యీ పుష్ప కర్ణికలో అష్టదళ పద్మముంది. దానిలో మరొక చిన్న పద్మముంది. యీ రెండు అంచుల్లో



స్పృశిస్తాయి. అందువల్ల యీ రెండింటిమధ్య అర్ధచంద్రాకారము యేర్పడు తుంది. ఇది నీరున్న క్షేత్రం. తెల్లని రంగుతో ఉంటుంది. యీ అక్షరం మెసలా సనంగా ఉంటుంది. దీని హస్తాన పాశముంటుంది. బిందువు తరువాత ఉన్న శూన్యాన గరుత్మంతుడు వాహన ముతో విష్ణువు ఉన్నాడు. నాలుగు హస్తాల్లో శంఖ, చక్ర, గద పద్మాలున్నాయి. పీతాంబరుడు, ఆతని కంఠాన వనమాలుంది. కౌస్తుభము, వక్షమున శ్రీవత్సరం కాంతులీనుతున్నాయి. యీతడు నిత్యయౌవన మూర్తిగా ఉంటాడు.

ఎఱ్ఱని పద్మములో నుండి రాకినీశక్తి పద్మాంచలాన ప్రక్కనే ఉంటుంది. ఆమె శ్యామల కాంతి కలది, శూల, పద్మ, డమరు, టంకములు నాలుగు హస్తాల్లో ఉండగా ఆమె త్రినయన, కుటిలదంష్ట్రి, భయంకర స్వరూపిణి, తెల్లని అన్నమన్న యిష్టము గలది. ముక్కు రంధ్రములలో నుండి అందరూ భయపడినట్లు రక్తము ప్రవహిస్తుంది.

**మణిపూరక చక్రము :**

దీన్నే నాభిపద్మమంటారు. వర్షం మేఘం వంటి రంగుగలది. పదిదళాల్తో శోభిస్తుంది. "డ-ఢ-ణ-త-థ-ధ-న-ప-ఫ బిందువుతో మహాప్రకాశముగా కానవస్తుంది. నీలముగా ఉంటుంది. దీని కర్ణికందు ఎఱ్ఱగా మూడుకోణాలు గల అగ్ని క్షేత్రముంది. దానికి మూడువైపులా స్వస్తిక గుర్తులు ఉన్నాయి. 'రం'అనే అగ్ని బీజం యీ కేంద్రమందుంది. యీ అగ్నిబీజుడు రక్తపురంగువాడు, మేక వాహనుడు, చతుర్భుజునకు వజ్రము-శక్తులను రెండుహస్తాల్లో దాల్చి, యింకా రెండు హస్తాలతో వరదాభయ ముద్రలతో ఉంటాడు. యీ అగ్ని బీజములో రుద్రుడున్నాడు. రక్తపు రంగు గలవారే యీతడు కూడా. వృషభవాహనుడు యీతడు. విభూతి ధరించుట వలన తెల్లగా కానవస్తాడు. బాగావృద్ధుని లాగుంటాడు. కర్ణికాంతరాన లాకినీశక్తి ఉంది. నీలపు రంగుతో మూడుముఖాలతో మూడునేత్రాలతో, నాలుగు భుజాలతో వజ్రశక్తి వరదాభయ ముద్రలతో కానవస్తుంది. కరాళ దంష్ట్రలతో ఉన్న యీ దేవత ఖేచరాన్నమును యెంతో సంతోషముతో తింటుంది. అలాగే రక్తమాంసాలు కలిపిన నైవేద్యం యిష్టం.

**అనాహత చక్రము :**

దీన్ని హృదయ పద్మమంటారు. యిది బంధూక పుష్పపు రంగులో ఉంటుంది. యిది 12 దళాలు కలిగిఉంటుంది. యీ కమలములో "క" కారమునుండి "త" కారము వరకూ బిందు పూర్వకమైన స్పర్శ, హల్లులుంటాయి.

యిది కుంకుమ రంగులో ఉంటుంది. యీ కమలము పైన బిందువుంది. కర్ణికాంతములో ఆరుకోణా లతో వాయు మండలముంది. ధూమ్రవర్ణము కలది. దీనిమీద మూడుకోణాలతో కోటి మెరుపుల కాంతితో సూర్యమండలముంది. దానిలో వాయుబీజం (యం) ఉంది. నలుపురంగు కల వేదిమీద ఉన్న యీ వాయు బీజుని నాలుగు హస్తాల్లో నాలుగు అంకుశాలు ఉన్నాయి.

ఒక అంకములో త్రినేత్రుడున్నాడు. హంసాభుని లాగ ఆతని రెండు హస్తాలూ వరదాభయ ముద్రలను చూపిస్తాయి. కర్ణికాంతములో రక్తవర్ణమున్న పద్మము మీద కాకినీ శక్తికూర్చొని ఉంటుంది. యీమె నాలుగు భుజాలు గలది. పాశ, కపాల వరదాభయహస్తాలు గలది. బంగారు రంగుతో పీతంబరముతో ఉన్న యీమె సకల భూషణ భూషిత, ఎముకలే మూలలుగా దాల్చిన అమృత హృదయ. మూడు కోణాల కేంద్రాన బాణలింగాకారముగా, శివుడు నెలవంకను బిందువును ధరించి తలపై దర్శనమిస్తున్నాడు. ఆతడూ బంగారు వర్ణమువాడే.



ఆతని చూపులు మన్మధ తూపులు. ఆతని క్రింద హంసరాగ జీవాత్ముడున్నాడు. చలన రహితంగా కోసుగా సన్నముగా వెలుగుచున్న జ్యోతి లాగ ప్రభాసిస్తున్నాడు. కర్ణికకు దిగువ అష్టదళ పద్మముంది. అది క్రిందికి ముఖము కలదిగా వుంది. యీ ఎఱ్ఱని కమలమందు కల్పవృక్షం-ధ్వజ పతాకాది అలంకారాలతో నున్న నవరత్న సింహాసనం ప్రకాశిస్తూంది. అదే ధ్యానానికి నెలవు.

**విశుద్ధ చక్రము :**

కంఠమూలాన నిలిచిఉన్న యిది 16 పత్రాలతో శోభిస్తూంది. ధూమ్రవర్ణం కలది. బంగారు వర్ణమున్న యీ కమలదళాలు ప్రకాశిస్తాయి. యివి రక్తవర్ణంతో బిందువుతో ఉంటాయి. "అ"కారమునుండి "అః" వరకూ పదహారు అచ్చులు. వీటి ఎగువభాగాన బిందువులుంటాయి. కార్ణికాంతంలో తెల్లని వృత్తాకారమైన ఆకాశమండలముంది. దానిలో మహేంద్ర మండలం, దానిలో చంద్రమండలం, దానిమీద తెల్లని రంగు వస్త్రముతో ప్రకాశిస్తూ, "హం" అను బీజాక్షరముంది. యీ బీజుడు ఏనుగు ఉన్నాడు. నాలుగు భుజాలతో పాశ, అంకుశ వరదాభయ ముద్రలు కలవాడు. యీ బీజాంకములో యీశ్వరుడున్నాడు. సింహపీఠిపై శివుడుండగా ఆ ఆసనము ఒక వృషభము మూపున మోపబడిఉంది. అర్థనారీశ్వర రూపములో, ప్రకాశిస్తుంది, యీతని సగము దేహము బంగారు కాంతితో, వేరొక సగము హిమ కాంతితో ప్రకాశిస్తూంది. యీతడు అయిదు ముఖాలుకలవాడు, పదిభుజాలున్న వాడు, శూలం, టంకం గంఢ్రగొడ్డలి,



ఖడ్గము, వజ్రము, దహనం (ఆగ్నేయాస్త్రం) నాగేంద్రము, ఘంట, అంకుశము, పాశము, పూసినవాడు. తెల్లగా ఉన్న యీ దేవుడు సర్పమాల గళమందు ధరిస్తాడు. నెలవంక చిందిస్తున్న అమృతం అతని లలాటాన ప్రకాశిస్తుంది.

కర్ణికాంతములో శశిక్షేత్రములో ఎముకలగుట్టపై శాకినీ శక్తి ఉంది. యీమె తెల్లగా నాలుగుభుజాలు అయిదు మోములు కలది. త్రినయన, పీతాంబర ధారిణి ధనుర్బాణ పాశాంకుశాలను హస్తాల దాల్చినది.

**ఆజ్ఞాచక్రము :**

యిది తెల్లగా ఉంటుంది. రెండు రేకులున్నది. "హ"కార "క్ష" కారాలు యీ దళాలమీదుండి చక్రాన్ని చుట్టబడి ఉంటాయి. కర్ణికాంతములో హాకినీశక్తి కూర్చొని ఉంటుంది. తెల్లని రూపము కలది. రక్తవర్ణముతో ఆరుముఖాలతో ఉన్న యీమెకు మూడు నేత్రాలు, ఆరుహస్తాలుంటాయి. తెల్లని పద్మముపై ఆ మాత కూర్చొని ఉంటుంది. వరదాభయముద్రలు, రుద్రాక్షమాల, మానవక పాలం, డమరుకం, పుస్తకాలను దాల్చిన యీమెపై త్రికోణముంది. అందు మెరుపువంటి, ఇతరలింగం, ఉంది. అంతరాత్మ నామముతో ప్రకాశిస్తుంది. దానిపై ఒక త్రికోణం అగ్నివంటి కాంతితో ఉంది. దానికి నలువైపులా మూలం మొదలు బ్రహ్మరంధ్రం వరకూ కానిపించు కాంతిరేఖలు తెలియాడుచున్నాయి. దానిమీద మనస్సు, దానిపై హంస అనుపేరుతో నెలవంక దానిలో శక్తితో పరమశివుడు ఆశీనుడై ఉన్నాడు.

**సహస్రారం :**

యిన్ని పద్మాలపై పరమవ్యోమ మనబడే చిదాకాశాన శంఖినీనాడి విరాజిల్లుతూంది. దాని క్రింద సహస్ర దళాలున్నాయి. సహస్రారకమలాన్ని, అకులా, అనీ అంటారు. ఇది చంద్రకాంతికన్నా తెల్లగా ఉంటుంది. మహాకాంతి వంతమైంది. యీ పద్మపత్రాలు క్రిందనున్న ముఖాలతో ఉన్నాయి. ఇది ఎప్పుడు ప్రకాశిస్తూ ఉంటుంది. వీటి చివరలు బాలసూర్యునివంటి కాంతిగలవి. ఎప్పుడూ వెలుగుతూ ఉంటాయి. అకారాద్యక్షరాలతో యీపద్మం దేదీప్యమానంగా, కేవలానందముగా వెలుగుతుంది.

యీ పైన చెప్పిన మహాశక్తులన్నీ కుమారుని బాణానికి ఉండబట్టే అభేద్యుడై మహేంద్రాది సురలందరినీ ముప్పుతిప్పలు పెట్టి మూడు చెరువుల నీళ్ళు త్రావించి మహా తపస్సంపన్నుడైన తారకాసురుని అంతం చేసింది. "కుమారుడు, అనగా జ్ఞానతత్త్వమే. అతడే సుబ్రహ్మణ్యుడు, ఆరు కమలాలు ఆరుగురు కమలాలు. యిలా యెంతైనా చెప్పవచ్చు.

భగవానుడు నిత్యకౌమారుడు. భగవతత్త్వం నిత్యనూతనముగా ప్రకాశి స్తుంది. మంచి ఆకర్షణగా రమ్యంగా రమణీయంగా కమనీయంగా ఉంటుంది. "కుమార, శబ్దం కుమారతత్త్వం నిత్యనూతనత్వానికి గురుతు. కుమార శబ్దానికి సృష్టిఅనే అర్థంకూడా ఉంది. కుమార శబ్దమనగా "బేలన్స్" ప్రకృతిలో సమతూకాన్ని తెలుపుతుంది. ఎన్ని చావులు సంభవించినా కుమారతత్త్వం ఆలోటు తీరుస్తుంది. నాశనముఅవదు. సృష్టించడమే కుమారతత్త్వం.

## 9. కుమారస్వామి

కార్తికేయుడు, సుబ్రహ్మణ్యుడు అనికూడా పిలువబడే కుమారస్వామి శివుని కుమారుడు. శివపార్వతుల సంగమం వల్ల తనను మించి ప్రభావ వంతుడయిన కొడుకు వారికి పుడతాడేమోననే భయంతో ఇంద్రుడు వారి క్రీడకు భంగం కలిగించమని అగ్నిని ప్రేరేపిస్తాడు. అగ్ని చిలుక రూపంలో వారి అంతఃపురంలోకి ఆ సమయంలో వెళ్ళేసరికి పార్వతి గ్రహించి పక్కకు తొలగుతుంది. ఆ ఆగ్రహంలో శివుడు పతనమైన తన జననశక్తిని ధరించమని అగ్నిని శాసిస్తాడు. ఆ భారాన్ని భరించలేక అగ్ని గంగను కోరగా గంగ తన గర్భంలోకి తీసుకుని తనకూ దుర్భరం కావడంతో రెల్లుగడ్డిలో విడిచిపెట్టింది. అందుండి సూర్యరశ్మికి పెరిగి కుమారస్వామి పుట్టాడనీ బ్రహ్మాండపురాణం చెప్పబడింది. కుమారస్వామి దేవతలకు సేనానాయకుడు, ఇతనికి వాహనం నెమలి, ఆయుధం శక్తి.

పుట్టినప్పుడు కృత్తికలు పెంచడంవల్ల కుమారస్వామికి కృత్తికాకారుడు, కృత్తికాసుతుడు, అనే పేర్లు వచ్చాయి. భారతంలో మరో కథ కూడా ఉంది. మునిపత్నులను చూసి అగ్ని మోహించి కామబాధతో ఉండగా, ఆ బాధను గ్రహించిన అగ్ని భార్య స్వాహాదేవి ఒక్క వసిష్ఠుని భార్య అయిన అరుంధతి రూపంలో తప్ప, మిగతా ఆరుగురు మునిపత్నుల రూపంలో తానే అగ్ని కోర్కెతీర్చగా ఆ శుక్రశక్తి నుంచే కుమారస్వామి పుట్టాడనీ, అందుకే అతనికి ఆరు ముఖములు ఏర్పడ్డాయనీ అందుకే షణ్ముఖుడయ్యాడనీ ఆ కథ, బ్రహ్మ కుమారస్వామిని అభినందించి పార్వతీ పరమేశ్వరులు నీ తల్లిదండ్రులు. శక్తి బలంతో అగ్నిలో, అతనిభార్యతో ఆవేశించి లోకహితం కోసం నిన్ను కన్నారు. అని వివరిస్తాడు. స్కాందపురాణంలోనూ కుమారస్వామి కథ ఉంది. కుమార



స్వామి తపస్సుకు భయపడిన మునులు, దేవతలు ఇంద్రుని దగ్గరకు వెళ్ళి నీ ఇంద్రపదవిని తీసుకోవడానికి శౌర్యవంతుడైన కుమారుడు వస్తున్నాడని చెబుతారు. ఇంద్రుడు సప్తమాతృకలను పంపి కుమారస్వామిని చంపి రమ్మంటాడు. వారు కుమారస్వామి తపోవిశేషానికి భయపడి శరణుకోరి మేము దూతలం, మాయందు మాతృభావం ఉంచమని వేడుకుంటారు. ఇంద్రుడు స్వయంగా యుద్ధానికి వచ్చి తన వజ్రాన్ని ప్రయోగిస్తాడు. అది కుమారుని దక్షిణభాగాన్ని తాకి అందులోంచి విశాఖుడు పుడతాడు. కన్యాకుమార గణాల అనేకం పుడతాయి. ఇంద్రుడు భయపడి కుమారస్వామిని శరణువేడుతాడు. నీకు, నాకు ఎవరైనా వైరం కల్పిస్తారు. నీవు కోపిస్తే నాకు శరణ్యం లేదు. నాపదవి నీవే తీసుకో అంటాడు ఇంద్రుడు. దానికి కుమారస్వామి అంగీకరించక కేవలం సేనానాయకుడవడానికి అంగీకరిస్తాడు. శూరపద్మాసురుడనే రాక్షసుని అవలీలగా కుమారస్వామి సంహరించి నప్పుడు ఇంద్రుడు కుమారస్వామిని మెచ్చుకుని తన కుమార్తెనునిచ్చి వివాహం చేస్తాడు. భూలోకంలో శివభక్తిని వ్యాపింపచేయడానికి భూమిమీద పుట్టనున్న శివుడి ఆదేశం మేరకు కుమారస్వామే ఈలోకంలో చెన్నబసవడిగా పుట్టాడంటారు. బ్రహ్మ పురాణాన్ని అనుసరించి కుమారస్వామి విషయాసక్తుడై దేవతాస్త్రీలను వలచాడనీ, పార్వతీదేవి అనేక రూపాలతో కుమారుని ముందుకు వచ్చిందనీ, పార్వతియే అలా వచ్చిందని గ్రహించిన కుమారస్వామి స్త్రీలందరూ తల్లితో సమానులని విషయ వాంఛలను వదలి, పుణ్యాన్ని పొందాడనీ ఓ కథ. శివపురాణాన్ని అనుసరించి తారకా సుర సంహారం చేసింది కుమారస్వామి. ఈ పురాణాన్ని అనుసరించి దేవతలను బాధిస్తూ నివసిస్తూండగా ఆ పర్వతాన్ని భేదించి కుమారస్వామి వారిని సంహరించా డని వివరించబడింది. విశాఖుడు, మైఘమేఘుడు, వృష్ఠజుడు కుమారస్వామి కుమా రులు, కుమారస్వామి నివాసం 'స్వామిమల.'

**స్వామికి కొన్ని పర్యాయనామాలు :**

అగ్గిచూలి, అగ్నిసంభవుడు, ఆరు మోముల వేల్పు, ఉమాసుతుడు, కార్తికేయుడు, కుక్కుటధ్వజుడు, కృత్తికాభవుడు, క్రౌంచభేది, గాంగేయుడు, జుట్టుపిట్టతాలుపు, నెమ్మిరవుతు, మయూరకేతువు, మహాసేనుడు, శంభుజుడు, శక్తిధరుడు, శరవణ భవుడు, షణ్ముడు, షడాననుడు, షడ్వక్త్రుడు, షణ్ముఖుడు, సామి, షాన్మాతురుడు, షాడాముఖుడు, సుబ్రహ్మణ్యుడు, సేనాని, స్కందుడు, స్థిరుడు.

## 10. సుబ్రహ్మణ్యస్వామి వైభవము

1. మార్గశిర శుద్ధషష్టి సుబ్రహ్మణ్యస్వామి అవతరించినరోజు. దీనినే స్కంధషష్టి.
2. స్వామిని కృత్తికలు పెంచినందువలన కార్తికేయుడు అనిపేరు.
3. స్వామివద్దనుండే నెమలి లౌకిక ఆకర్షణలకు ప్రతీక. పాము ఆధ్యాత్మిక జ్ఞానానికి ప్రతీక.
4. సుబ్రహ్మణ్యుడు అనగా మంచి బ్రహ్మజ్ఞాని అని అర్థం.
5. స్కాందపురాణములో అగస్త్యనారద సంవాదం వున్నది. అందులో స్వామిని సహస్రనామంలో ఉరగేశ్వరాయ నమః మహోదరాయనమః అని పూజిస్తారు. స్వామివారి వల్లీదేవి సర్పరూపములో ఉంటుందని అందుకే ఆమెతో ఉన్నప్పుడు స్వామికూడ సర్పరూపములో ఉంటాడని పురాణ గాధలు ఉన్నాయి.
6. సుబ్రహ్మణ్యస్వామిని సుబ్బరాయుడిగా పూజిస్తారు. బాలునిగా ఉండేవాడు, కుత్సితులను సంహరించేవాడు, మన్మధునివలె అందంగా ఉండేవాడు అని కుమారాస్వామి అనే శబ్దానికి అర్థం.
7. కళ్యాణము కొరకు షష్టివ్రతం చేస్తారు. కార్తీకమాసంలో వచ్చే స్కంధ షష్టికి ఆరు వ్రతాలు పూర్తిచేయాలి.
8. సంతానం కొరకు షష్టివ్రతం చేసేవారు సుబ్బరాయుడి షష్టికి ఆరు వ్రతాలు చేయాలి. నెలకి ఒక షష్టి చొప్పున చేయాలి.
9. కళ్యాణముకొరకు స్కంధ షష్టిరావడానికి ఆరుమాసాలు పూర్వం వ్రతం ప్రారంభించి స్కంధ షష్టి ఆరవ షష్టి అవ్వాలి.
10. జ్యేష్ఠమాసములో శుద్ధ షష్టినుండి ప్రారంభము కావాలి. అమావాస్య మరునాడు వచ్చే పాడ్యమి నుండి దీక్ష స్వీకరించాలి. మెడలో రుద్రాక్షమాల ధరించాలి. పసుపుతాడు కంకణ ధారణ చేయాలి.
11. శుద్ధపాడ్యమి నుండి పంచమి వరకు అయిదు రోజులు స్వామిని పూజించాలి. షష్టినాడు విశేషపూజ జరపాలి.
12. స్వామికి వడపప్పు పాకం సమర్పించాలి.
13. స్కంధుడు అనగా శత్రువులను శోషింపచేసేవాడు అని అర్థము.



14. స్వామికి అనేక పేర్లు వున్నాయి. కార్తికేయుడు, షణ్ముఖుడు, గురు స్వరూపుడు, శరవణభవుడు, శరవణోద్భవుడు, స్కందుడు, స్వామినాధుడు, రుద్రతేజస్వరూ పుడు, గుహుడు, కుమారస్వామి, సుబ్రహ్మణ్యస్వామి, వేలాయుధుడు.
15. గుహ అంటే వేదాంత పరముగా హృదయం గుహ అని అర్థం. అంటే ఆత్మ గుహలో స్వామి ఉన్నట్లు అని అర్థం.
16. తమిళనాడులో సుబ్రహ్మణ్యస్వామి దేవాలయములు ఎక్కువగా వున్నాయి. భక్తులు నెమలి ఈకలతో అందంగా అలంకరించిన కావాడిని తీసుకొని వెళతారు.
17. వారి భాషలో కావాడి అనగా నీ పాదసన్నిధిని రక్షించు ఈ కావాడిసేవలో అహంకారాన్ని విడిచిపెట్టడం సమర్పణ అనే భావాలు వుంటాయి.
18. అగ్నిపురాణములో స్కంధుడే శాఖ, విశాఖ అనే పేర్లుతో వున్నాడు.
19. సుబ్రహ్మణ్యస్వామి దేవేరులైన వల్లీదేవసేనలు ఇచ్ఛాశక్తి జ్ఞానశక్తులకు ప్రతీకలు.
20. స్వామి రెల్లుపొదలలో ఆవిర్భవించాడు. కావున స్వామివారికి శరవణ భవుడు, శరవణోద్భవుడు అనిపేర్లు వున్నాయి.
21. ఖగోళశాస్త్రానికి సాముద్రిక శాస్త్రాలకు కూడ అధిదేవతగా కుమారస్వామిని కొలుస్తారు.
22. ఈశ్వరునికే ప్రణవార్థాన్ని వివరించిన కుమారస్వామి బ్రహ్మవిద్యకు అధిదేవతగా చెప్తారు.
23. నెమలి వాహనంపై వున్న స్వామికి సుముఖం విశాలాక్షి అనే స్త్రీలు ప్రక్కనే ఉన్నట్లుగా ఉంటుంది.
24. స్వామిని పూజిస్తే ఆరోగ్యం ఐశ్వర్యం చేకూరుతుంది. ఋణవిముక్తులవుతారు.
25. శరవణ భవ

శ : శమింపచేయువాడు
ర : రతి పుష్టినిచ్చువాడు
వ : వంధ్యత్వం రూపుమాపువాడు
ణ : రణమున జయమునిచ్చువాడు

భ : భవసాగరాన్ని దాటించేవాడు
వ : వందనీయుడు

26. శ : లక్ష్మీ బీజము అధిదేవత శంకరుడు
ర : అగ్ని బీజము అధిదేవత అగ్ని
వ : అమృత బీజము అధిదేవత వరుణదేవుడు
ణ : యక్ష బీజము అధిదేవత బలభద్రుడు
భ : అరుణ బీజము అధిదేవత భద్రకాళీదేవి
వ : అమృత బీజము అధిదేవత చంద్రుడు

27. శ్రీవల్లీకం అనగా సర్పముయొక్క తోకభాగము అని దేవసేన అనగా పాముపడగ అని అర్థము.

28. రెల్లుగడ్డి పొదల కదలికలకు స్వామి ముఖం ఆరుభాగాలుగా చీలింది కావున షణ్ముఖుడు అని పేరు వచ్చింది.

29. జీవుల వీర్యకణాలు ప్రతిరూపం కావడం వల్ల ధాతుపతి అని తేజోపతి అని, ఓజోపతి అని పేర్లు వున్నాయి.

30. మూలాధార చక్రం క్రింద ఉండే మూడున్నరచోట్ల సర్పానికి సుబ్రహ్మణ్య స్వామి ప్రతీక స్వామి "కుండలీనీపతి" అనిపేరు.

31. వల్లీకి నాధుడు కావున వల్లీనాధుడు అని దేవతలసేనాని కావడం వల్ల దేవసేనుడు అని పేరు వచ్చినది.

32. తపస్సువల్ల యోగాభ్యాసం వలన తేజస్సుకు కుమారుడు అని పేరు ఉన్నది.

33. చీలిపోవడానికి సంస్కృతములో స్కంధము అంటారు. ఇలా చీలిన ముఖములు గలిగినవాడు అవ్వడం వల్ల స్కంధుడు అనిపేరు వచ్చినది.

34. మురగన్ (అందగాడు) అనిపేరు స్వామికి వున్నది. ఆయనను మరుమగున్ అని అంటారు. అంటే మేనల్లుడు స్వామి విష్ణువునకు మేనల్లుడు ఆయన భార్యలైన వల్లీ దేవసేనలు విష్ణువు కుమార్తెలు.

35. కుమారస్వామిని ఉపాసించడం కౌమారమతం అని అంటారు.

36. ముత్తుస్వామి దీక్షితులు వాసుకి తక్షకాది సర్పస్వరూపధారణాయ నమః అని సుబ్రహ్మణ్యస్వామిని స్తుతిస్తారు.



37. కాళిదాసు తన కుమారసంభవంలో అద్భుతంగా రచించాడు. స్వామిపుట్టుక గూర్చి స్కాంధపురాణం తెలిపింది.

38. అరుణగిరినాధుడు తిరుప్పగళ్ అనే గ్రంథాన్ని కుమారస్వామిపై రచించాడు.

39. స్వామి వేల్ అనే ఆయుధాన్ని ధరించాడు. అందుచేత వేలాయుధపాణి అయినాడు. వేల్ అంటే ఈటె.

40. తిరుమల తిరుపతి వేంకటేశ్వరస్వామిని గూడా సుబ్రహ్మణ్యస్వామి అని కొన్ని వందల ఏళ్లు పూజించిన చరిత్ర ఉన్నది.

41. సనత్కుమార ఋషి స్కందుడే అని దెలుపబడినది. "భగవాన్ సనత్కు మారస్తగ్ంం స్కంద ఇత్యాచక్షుతే" ఈ విషయం చాంధోగ్యోపనిషత్తు ప్రస్తావించబడినది.

42. తమిళనాడులో సుబ్రహ్మణ్య దీక్ష పాటించెదరు.

43. సుబ్రహ్మణ్యస్వామి దీక్ష వస్త్రములు ఆకుపచ్చ రంగులో ఉండును. స్వామి భక్తులు "హరోంహర" అని ధ్యానిస్తూ కాలినడకన పళని కొండ చేరుకుంటారు.

44. భక్తులు మొక్కుతీర్చుకునేవారు కావడి మోసుకుంటూ స్వామిని చేరి తమని కాపాడమని ప్రార్థిస్తారు.

45. రాహుకాలములో స్వామికెదురుగా 18 ప్రమిదెలలో 18 ఎర్రటి వత్తులుతో వెలిగిస్తారు. ఇలా చేస్తే స్వామి రాహుదోషము పోగొడతాడని ప్రతీతి.

## 11. షష్ఠి దేవత దేవసేన

షష్ఠిదేవత గురించి ఎక్కువ మందికి తెలియక పోవచ్చు. లక్ష్మీదేవి సంపదనిచ్చే దేవత అయితే భౌతిక అంశాలను అందించే దేవత ఈమె. భౌతిక అంశాల్లో ఆరవవంతు ఆమెది. ఆరోవంతు భాగం కల్గినదికాబట్టి షష్ఠి అని పిలిచారు.

షష్ఠిదేవతకు పిల్లలంటే మహాఇష్టం. నిజానికి ఆమె బాలసంక్షేమదేవత. ఆమెను పురాణాలు ధ్యానమంత్రగా వర్ణించాయి. ఆమెదీవెనలు, వరాలందించే ఒక యవ్వన దేవత అని పురాతన గ్రంథాలు చెప్తున్నాయి. ఘనమైన కీర్తికలిగి, ఒంటినిండా ఆభరణాలు నింపుకుని వెలుగులు చిమ్ముతూ తిరుగుతుందీ దేవత.

ఆమె చెంత ఆనందం తప్పించి ఇతర భావాలు చేరనే చేరవు. ఆమె ధరించిన వస్త్రాలన్నీ ఎంతో నాణ్యమైన నేతవి. ఆమె ఎప్పుడు ధగధగా మెరిసే పట్టుపీతాంబరాల లోనే వుంటుంది. ఆమెచుట్టూ ఎప్పుడూ పసిపిల్లలు వుంటారు, పసిపిల్లలేకాదు పసి జంతువులుకూడా ఆమెను వదిలివెళ్ళవు. అలా బాల ప్రేమను పుష్కలంగా పంచే తల్లిచేతిలో శుభాలనుఅందించే ఒక కొమ్మ వుంటుంది. ఆమె చూపులు ఆకర్షణీయంగా ఉంటాయి. సృష్టి మొత్తానికి ఆమె రక్షణను ఇస్తుంటుంది.

సంతానం కలగగానే తొలిగా పూజించేది షష్ఠి అమ్మవారినే. ప్రసవ మయిన గదిలో ప్రసవించిన ఆరవ రోజున నిర్వహించే పూజాకార్య క్రమాలు ఈమెకే చెందు తాయి. నేను జన్మనిచ్చినా బిడ్డకు అసలుతల్లివి నీవే, నీ చల్లని చూపులతో నా బిడ్డను చల్లగా చూడు తల్లీ అని షష్ఠిదేవతకు పూజచేసి నైవేద్యం పెడతారు.

షష్ఠిదేవతకు పన్నెండు రూపాలు ఉన్నాయి. సంవత్సరానికి పన్నెండు నెలలు. ఒక్కొక్క నెలలో ఆమెను ఒక్కొక్క పేరుతో పూజిస్తారు. చందన, అరణ్య, కార్ధమ, లుంఠాన, చాపేటి, దుర్గ, నది, ములక, అన్న, శితాల, గోరూపిణి, అశోక అనేవి ఆ పేర్లు. షష్ఠిదేవతల సైన్యాధిపతి కార్తికేయుని భార్య అని పురాణాలు చెప్తున్నాయి. కార్తికేయుని బాల్యంలో ఆరుగురు కృత్తికలు పెంచాయి. ఆ ఆరుఅనే సంఖ్యాపరంగా ఈమెకు షష్ఠిదేవతనే పేరు వచ్చిందంటారు.

ఈ సృష్టికి మూలపురుషుడు స్వయంభువమనువు, అతనికొడుకు ప్రియవ్రతుడు. బ్రహ్మచారిగా జీవించాలనుకున్న ప్రియవ్రతుని అతనికి తగిన భార్యను వెతుకమని బ్రహ్మ ఆజ్ఞాపించాడు. బ్రహ్మమాట మేరకు పెళ్ళాడినా ప్రియవ్రతునికి సంతానం కలుగలేదు. మగబిడ్డకోసం తానేం చేయాలని పండితు లను అడిగాడు.

పుత్రకామేష్టి చేయాలని సూచించగా ప్రియవ్రతుడు పాటించి యజ్ఞఫలాన్ని తన భార్య మాలినికి అందించాడు. ఫలితంగా మాలిని గర్భవతి అయినా ఆ శిశువు తల్లికడుపులో పన్నెండు సంవత్సరాలు ఎదిగాకగాని ప్రసవంకాలేదు. అన్నాళ్ళు తల్లిగర్భంలోవున్న ఆ శిశువు సక్రమంగా ఎదగలేదు. కళ్ళలో ప్రాణంలేదు. ఆ బిడ్డను చూసి దుఃఖంతో మాలిని మూర్ఛపోయింది.

ఆ శిశువు మృతశిశువు అని తెలియగానే ఆ శిశువును తీసుకుని శ్మశానానికి బయలుదేరిన ప్రియవ్రతునికి ఒక్కసారిగా ఏడుపు వచ్చింది. ప్రియవ్రతుడు దుఃఖితుడై వుండగా హఠాత్తుగా ఆకాశం నుండి ఒక దేవత



సాక్షాత్కరించి నేను షష్ఠి దేవతను, బ్రహ్మపుత్రికను, కార్తికేయుని భార్యను, ప్రకృతిలో ఆరవవంతునాది, నన్ను దేవసేన అంటారు అని చెప్పి ఆ మృతదేహాన్ని తనచేతుల్లోకి తీసుకుంది. వెంటనే ఆ బిడ్డలో ప్రాణంవచ్చింది. రూపం మారిపోయింది. తండ్రిని చూసి చిరునవ్వు నవ్వాడు.

ఆ బిడ్డను చూసిన ఆనందంతో ప్రియవ్రతుడు వుండగానే షష్ఠిదేవత ఆ బిడ్డను తీసుకుని ఆకాశమార్గన వెళ్ళసాగింది. ప్రియవ్రతుడు ఆమెను బతిమాలగా ఆమె ఒక షరతుమీద బిడ్డను ప్రాణాలతో అప్పగించేందుకు అంగీకరించింది. లోకమంతా షష్ఠిదేవతను ఆరాధించేలా చేయాలి. ఆ పూజ నీతోనే ఆరంభమవ్వాలి అని అనగా అందుకు ఆ రాజు అంగీకారం తెలిపాడు. బిడ్డకు సువ్రతుడు అనిపేరు పెట్టింది.

ఆబిడ్డ నారాయణ భక్తుడై, అద్భుతజ్ఞాపశక్తి కలవాడై, వందల యజ్ఞాలతో క్షత్రియగా పేరుపొందుతాడు. దానగుణంతో పేరుపొందినవాడవుతాడు అని చెప్పి షష్ఠిదేవత అదృశ్యమైంది. వెంటనే ప్రియవ్రతుడు ప్రతిపక్షంలో ఆరవరాత్రి షష్ఠిపూజ చేశాడు.



షష్ఠిదేవత పూజక్రమంగా దేశమంతా పాకింది. బిడ్డలసంక్షేమం కోసం అందరూ షష్ఠిని పూజించసాగారు. షష్ఠి సంతానం ప్రసాదించే దేవత అయింది. సత్రాజిత్తు అనే రాజుకు సంతానంలేదు. ఓనాడు ఆయన భార్య గంగానదిలో స్నానమాచరిస్తుండగా ఒక ముదుసలి స్నానం చేస్తు కనిపించింది. ఆ ముదుసలి ముఖంలో తెలియని ఆకర్షణ ఏదో ఉంది. ఆమె ఎవరని విచారించగా వర్ధమాన నగరం నుండి వచ్చాను. నేను షష్ఠిదేవతను, నేడు అరణ్యషష్ఠి పూజాదినం. కాబట్టి నన్నుపూజించు అని చెప్పింది ఆమె. ఆ పూజ చేయటంవల్ల వచ్చే లాభం ఏమిటని అడగ్గా షష్ఠిపూజచేసి గతంలో లాభంపొందినవారి గురించి వివరించింది. షష్ఠిమాతకు పూజచేసిన ఒక వ్యాపారకుటుంబీకుని ఉదంతాన్ని వివరంగా చెప్పింది.

ఒక వ్యాపారికి ఏడుగురు కొడుకులు. వారందరికి వివాహం చేశాక ఒకరోజు షష్ఠివ్రతం తలపెట్టారు. షష్ఠివ్రతానికి తగిన తినుబండారాలన్నీ తయారుచేశారు. పూజ ముగించి నైవేద్యం పెట్టేవరకు ఆ వంటకాలను ఎవరూ తాకరాదు. ఆ వంటకాలను జాగ్రత్తగా చేసే బాధ్యతను అత్తగారు చిన్నకోడలుకు అప్పగించింది. ఐతే చిన్నకోడలు గర్భిణి, చిన్నవయసు, ఆగలేక ఆపదార్థలలో కొన్నింటిని రుచి చూసింది. అత్తగారితో నల్లిపిల్లి వచ్చి తిని వెళ్లిందని అబద్ధ మాడింది.

నల్లపిల్లి షష్ఠిదేవత వాహనం, ఆ దేవతలాగానే ఆమె వాహనానికి మేలు తప్పించి కీడుచేయుటం తెలియదు అటువంటిది తనమీద షష్ఠిదేవత నైవేద్యం తిన్న నెపం వస్తుందా అని ఆ నల్లపిల్లి పగపట్టింది.

ఆ చిన్నకోడలు ప్రసవించగానే ఎవరికీ తెలియకుండా ఆ పసిగుడ్డును నోటకరుచుకువెళ్ళి తినేసింది. నల్లపిల్లి అలా వరసగా ఆరు కాన్పులలో బిడ్డ పుట్టినా ఎవరికీ తెలియకుండా మాయమయ్యేది ఆ వ్యాపార కుటుంబానికి అంతా గందర గోళంగా అనిపించింది. చివరికి ఏడవకాన్పులో కోడలిని అడవిలోకి తీసుకెళ్ళి నిర్జీవ ప్రదేశంలో ప్రసవం చేయించారు.

బిడ్డను ఎవరూ తీసుకువెళ్ళలేదు. తన మగబిడ్డను ఒళ్ళోపెట్టుకుని ఆనందంగా చూసుకుంది నాలుగురోజులు నిద్రలేకుండా బిడ్డను చూసుకున్న ఆ పిల్ల అలా కనుమూయగానే నల్లపిల్లి బిడ్డను మాయంచేసింది. ఈ సారి ఆ బిడ్డను తినక తన యజమాని అయిన షష్ఠీదేవత పాదాలచెంత వదిలిపెట్టింది.

బిడ్డను దొంగిలించి తెచ్చినందుకు షష్ఠిదేవతకు తీవ్రమైన కోపంవచ్చింది. ఒక తల్లిని బాధించినందుకు మందలించి ఆ తల్లి ఎక్కడున్నదో వెతుక్కుంటూ వచ్చింది. అడవిలో ఏడుస్తూ సొమ్మసిల్లి పడిపోయిన ఆ తల్లికి సేవచేసి స్పృహ తెప్పించింది.

ఆమెముందు నిలబడి తన వాహనంచేసిన తప్పును క్షమించమంది. అయితే ఆమె చేసిన పొరపాటుకి ప్రతీకారంగానే ఇది జరిగిందని షష్ఠిదేవత మిగిలిన గాథ సంతటినీ వివరించింది. నా నైవేద్యం ఎంగిలి చేసినందుకు అది తగిన శిక్ష అనికూడా చెప్పింది. అయితే ఆ శిక్ష తప్పునిమించి సాగిందని కాబట్టి ఇకముందు బుద్ధిగా వ్యవహరించమని షష్ఠిదేవత చెప్పింది. అంతేగాక గతంలో నల్లపిల్లి చేతిలో మరణించిన ఆరుగురి సంతానానికి ప్రాణంపోసి తిరిగి అందించింది. ఏడుగురు బిడ్డలను వెంట తీసుకుని ఇంటికి తరలివస్తున్న తమకోడల్ని చూసి ఆ వ్యాపారి కుటుంబమంతా ఆనందోత్సాహాలతో పొంగిపోయింది.

ఏడుగురు బిడ్డలకు వారి జీవితకాలంలో ఎటువంటి ఇబ్బందీ రాకుండా చూసుకుంటానని షష్ఠిదేవత ఇచ్చిన వాగ్దానం ప్రకారం ఆమె సంతానమంతా ఆరోగ్యంతో ఎదిగారు. షష్ఠీమాత తన గాథంతా వివరించేసరికి ఆ సత్రాజిత్తు మహారాణి కళ్ళుతిరిగాయి. తనను ఆదుకోవటానికి చేసిటానికి వచ్చిన ఆమాతను తగినవిధంగా దేవి సత్కరించింది. అంతేకాక ఇకనుండి ప్రతీ పక్షం షష్ఠిదేవి పూజలు చేస్తానని మాట ఇచ్చింది. అది జరిగిన కొద్ది రోజులకే ఆ రాణి గర్భవతి అయింది.



## 12. సుబ్రహ్మణ్య షష్ఠి

| | | |
|---|---|---|
| 1. | లేవవలసిన సమయము | : ఉదయం 5 గంటలు |
| 2. | శుభ్రపరచవలసినవి | : పూజామందిరము, ఇల్లుశుభ్రం చేయాలి. |
| 3. | చేయవలసినఅలంకారములు | : గడపకు పసుపు కుంకుమ, గుమ్మానికి తోరణాలు, పూజా మందిరములో ముగ్గులు |
| 4. | చేయవలసిన స్నానము | : తలస్నానము |
| 5. | ధరించవలసిన పట్టుబట్టలు | : ఎరుపు |
| 6. | పూజామందిరంలో చేయవలసినవి | : పూజాకు ఉపయోగపడు వస్తువులు- పటములకు గంధము,కుంకుమ అలంకరించాలి. |
| 7. | మందిరంలో పరచవలసిన వస్త్రము | : ఎరుపు వస్త్రము |
| 8. | కలశముపై వస్త్రము రంగు | : ఎర్రటిరంగు |
| 9. | పూజించవలసిన ఫోటో | : సుబ్రహ్మణ్య స్వామి |
| 10. | పూజించవలసిన ప్రతిమ | : ఆరుముఖాల షణ్ముఖుడు |
| 11. | పూజించవలసిన దైవము | : కుమారస్వామి |
| 12. | తయారు చేయవలసిన అక్షతలు | : తెల్లటి అక్షతలు |
| 13. | పూజకు కావలసిన పువ్వులు | : ఎర్రటి పువ్వులు, మందారపువ్వులు |
| 14. | అలంకరణకు వాడవలసినపూలు | : ఎర్రటి చామంతి పువ్వులు |
| 15. | నివేదన చేయవలసిననైవేద్యం | : కందిపప్పు నానబెట్టినవి |
| 16. | సమర్పించవలసిన పిండివంటలు | : కందిపప్పుతో వంటకాలు |
| 17. | నివేదించవలసిన పండ్లు | : దానిమ్మపండ్లు |
| 18. | పారాయణ చేయవలసినఅష్టోత్తరం | : సుబ్రహ్మణ్యస్వామి |
| 19. | పారాయణ చేయవలసిని స్తోత్రాలు | : సుబ్రహ్మణ్య అష్టకము |
| 20. | పారాయణ చేయవలసిన ఇతరస్తోత్రాలు | : సుబ్రహ్మణ్య షోడశనామస్తోత్రము |
| 21. | పారాయణచేయవలసిన సహస్రాలు | : సుబ్రహ్మణ్య సహస్రనామము |
| 22. | పారాయణ చేయవలసినగ్రంథం | : సుబ్రహ్మణ్య చరిత్రము |
| 23. | పారాయణ చేయవలసిన అధ్యాయములు | : కుమారసంభవము |
| 24. | దర్శించవలసిన దేవాలయాలు | : సుబ్రహ్మణ్యస్వామి |

25. దర్శించవలసిన పుణ్యక్షేత్రాలు : మోపిదేవి
26. చేయవలసిన ధ్యానములు : సుబ్రహ్మణ్య ధ్యానములు
27. చేయించవలసిన పూజలు : సుబ్రహ్మణ్యస్వామి సహస్రనామ పూజ
28. దేవాలయములో చేయించవలసిన పూజాకార్యక్రమములు : పుట్ట పూజలు, పుట్టలకు పాలు, సుబ్రహ్మణ్య కళ్యాణము
29. ఆచరించవలసిన వ్రతము : సుబ్రహ్మణ్య వ్రతము
30. ఉపవాసము నియమము : ఉదయంనుండి మరుసటిదినము ఉదయం వరకు
31. జాగరణ నియమము : లేదు
32. సేకరించవలసిన పుస్తకములు : సుబ్రహ్మణ్య నిత్యపూజ, కుమార స్వామి స్తోత్రమాల
33. సన్నిహితులకు శుభాకాంక్షలు తెలుపుచూ అందజేయుపుస్తకములు: సుబ్రహ్మణ్య నిత్యపూజ
34. స్త్రీలకు తాంబూలములో ఇవ్వవలసినవి : కుమారస్వామి స్తోత్రమాల
35. దేవాలయమువారు నిర్వహించవలసిన ఉత్సవములు : సుబ్రహ్మణ్య కళ్యాణము
36. దేవాలయమువారు నిర్వహించవలసిన ప్రత్యేకపూజలు: సుబ్రహ్మణ్యవ్రతము
37. పర్వదిన నక్షత్రము : మృగశిరా
38. పర్వదిన తిథి : మార్గశిర శుద్ధ షష్ఠి
39. పర్వదినము యీవారము వస్తే చాలామంచిది : మంగళవారము
40. పర్వదినము రోజు పూజ చేయవలసిన సమయము : ఉ॥ 9గం॥లోపుగా
41. వెలిగించవలసిన దీపారాధన కుంది: 2 ఎర్రటి మట్టి ప్రమిదలు
42. వెలిగించవలసిన దీపారాధనలు : ఎర్రటి ప్రమిదెలు
43. వెలిగించవలసిన వత్తులసంఖ్య : దూదితో 7 వత్తులు (ఎరుపురంగు)
44. వెలిగించవలసిన వత్తులు : 7 వత్తులు (దూదితో)
45. దీపారాధన వాడవలసిన నూనె : నువ్వులనూనె
46. వెలిగించవలసిన ఆవునేతితోహారతి : 7వత్తులతో హారతి
47. ధరించవలసిన తోరము : ఎర్రటితోరము
48. నుదుటన ధరించవలసినది : కుంకుమ
49. 108 మార్లు జపించవలసిన మంత్రం : ఓం హ్రీం శరవణభవాయ నమః



50. జపమునకు వాడవలసిన మాల : రుద్రాక్ష మాల
51. మెడలో ధరించవలసిన మాల : రుద్రాక్ష మాల
52. మెడలో ధరించవలసిన మాలకుప్రతిమ : సుబ్రహ్మణ్యంస్వామి
53. చేయవలసిన అభిషేకము : పంచామృతములతో
54. ఏదిక్కుకు తిరిగి పూజించాలి : పడమరదిక్కు

## శ్రీ సుబ్రహ్మణ్య షష్ఠి

దేవేంద్రుడు మార్గశిర శుద్ధ షష్టినాడు దేవసేనతో "శ్రీ సుబ్రహ్మణ్యేశ్వర స్వామి" వారికి అత్యంత వైభవంగా వివాహము జరిపించిన ఈ రోజును "శ్రీ సుబ్రహ్మణ్య షష్ఠి"గా పరిగణిస్తారు. ఈ స్వామివారి జన్మవృత్తాంత విశిష్టత సమీక్షగా తెలుసు కుందాము!

పూర్వం మూడులోకాలను భయభ్రాంతులను చేస్తూ బాధిస్తున్న "తారకా సురుడు" అను రాక్షసుని బారి నుండి రక్షణ పొందుటకై! దేవతలు బ్రహ్మదేవుని శరణువేడినారు. దానికి బ్రహ్మ వారికి ఒక సూచన చేసినారు. ఈ తారకాసురుడు అమిత తపోబలసంపన్నుడు, అమితబలశాలి, వీనికి ఈశ్వర తేజాంశ సంభవుని వల్లకాని వానికి మరణములేదు. కావున! మీరు సతివియోగ దుఃఖముతో ఉన్న ఈశ్వరునకు ఆ సతీదేవియే మరుజన్మయందు గిరిరాజు హిమవంతునకు పుత్రికగా అవతరించిన! ఆ పార్వతీదేవికి వివాహం జరిపించండి. వారికి కలుగు పుత్రుడే తారకాసురుని సంహరించగల సమర్థుడు అవుతాడు అని తరుణోపాయంశెలవిచ్చారు.

అప్పటికే తపోదీక్షలో ఉన్న పరమశివునకు సేవలు చేస్తున్న ఆ జగన్మాత పార్వతికి, శివునకు అన్యోన్యత చేకూర్చే వాతావరణాన్ని కల్పించేందుకు! దేవతలు మన్మథుని ఆశ్రయిస్తారు. మొత్తం మీద మన్మథుని పూలబాణాలతో ఈశ్వరుని చలింపచేసి తాను ఈశ్వరుని ఆగ్రహానికి గురి అయినా! పార్వతి పరమేశ్వరుల కళ్యాణానికి మన్మథుడు కారణ భూతుడవుతాడు. కళ్యాణం అనంతరం దేవతల అభ్యర్థనమేరకు పునర్జీవింపబడతాడు.

ఇలా ఉండగా! పార్వతీ పరమేశ్వరులు ఏకాంత ప్రణయానందసమయాన అగ్నిదేవుడు పావురం రూపంల్లో వారి ఏకాంత మందిరంలోకి ప్రవేశిస్తాడు. అది గ్రహించిన పరమ శివుడు తన దివ్య తేజస్సును ఆ అగ్నిహోత్రునిలోకి ప్రవేశ పెడతాడు. దానిని భరించలేక ఆ దివ్య తేజమును గంగానదిలో విడచి పెడతాడు. ఆ తేజము ఆ సమయమందు ఆ నదిలో స్నానమాడుచున్న

షట్‌కృత్తికల దేవతల గర్భానప్రవేశిస్తుంది. ఆ రుద్రతేజమును వారు భరించలేక రెల్లుపొదలో విసర్జిస్తారు. అంత ఆ ఆరుతేజస్సులు కలసి ఆరుముఖలతో ఒక దివ్యమైన బాలుడుగా ఉద్భవిస్తాడు. ఇది తెలిసిన పార్వతీ పరమేశ్వరులు రుద్రాంశ సంభూతినిగా ఆ షణ్ముఖుని అక్కున చేర్చుకుని కైలాసం తీసుకుని వెళతారు.

ఆ బాలుడు గంగాగర్భంలో తేజోరూపంలో ఉన్నందుకు గాంగేయుడని, షట్‌కృత్తికలు వానిని పెంచి పెద్దచేసిన కారణం వల్ల మరియు ఆరుముఖాలు కలవాడు అగుటవల్ల షణ్ముఖుడని, కార్తికేయుడని, అతడు గౌరీశంకరుల పుత్రుడగుటచే కుమారస్వామి అనియు, సుబ్రహ్మణ్యస్వామి అనియు నామాలతో పిలువసాగిరి.

ఇక ఈ “శ్రీ సుబ్రహ్మణ్యస్వామి” వారిని సర్పరూపము కలవాడని కొందరు. మరికొందరు ఈ స్వామి ఆరుముఖాలు పన్నెండు చేతులు కలిసిన నిర్గుణ పరబ్రహ్మ తత్వముతో బాలుని రూపంగా అవతరించారని కొందరు అంటూ ఉంటారు. ఈ రెండూ వాస్తవమేనట!

కారణజన్ముడైన ఈ స్వామి పార్వతి పరమేశ్వరులు, దేవతలు కోరిక మేరకు కుమారస్వామిగా చేసి, వానిని దేవతల సర్వసైన్యాధ్యక్షునిగా నియమించి పరమేశ్వరుడు “శూలం” మొదలైన ఆయుధాలను ఇవ్వగా, ఆ జగన్మాత పార్వతి కుమారుని దీవించి “శక్తి” అను ఆయుధాలను ఇచ్చి సర్వశక్తివంతుడ్నిచేసి, తారకాసురు నిపై యుద్ధ శంఖరావాన్ని మ్రోగిస్తారు. అంత ఆ స్వామి నెమలి వాహనారూఢుడై ఆరుముఖాలు పన్నెండు చేతులతో ఉగ్రరూపందాల్చి ఆరు చేతులతో ధనస్సులను మనో ఆరు చేతులతో బాణాలు ధరించి కొన్ని అక్షౌహిణులను సంహరించి, రాక్షస సేనను ఒకేసారి సంహరించాలని తలచి “సర్పరూపం” దాల్చి వారిని ఉక్కిరి బిక్కిరి చేసి, భీకర యుద్ధము చేసి తారకాసురుని సంహరించి విజయుడైనాడు.

సర్వశక్తి స్వరూపుడైన ఈ స్వామికి దేవేంద్రుడు దేవసేనతో వివాహము జరిపిన ఈరోజును “శ్రీ సుబ్రహ్మణ్యషష్ఠి”గా పరిగణిస్తారని, సర్వులకు పూజ్యనీయు లైన శ్రీ వేదవ్యాసులవారు దీని విశిష్టతను వివరిస్తారు.

ఈ సుబ్రహ్మణ్యేశ్వరస్వామి వార్కి గ్రామాలు, పట్టణాలు అనుభేదము లేకుండా దేశం నలుమూలలా దేవాలయాలు కలవు. ఈ రోజున “శ్రీవల్లి దేవసేనా సమేత శ్రీ సుబ్రహ్మణ్యేశ్వర స్వామి” వారికి భక్తులు కళ్యాణోత్సవములు, సహస్రనామ పూజలు తీర్థములు అత్యంత వైభవంగా జరుపుతూ ఉంటారు.



ఈ స్వామి ఆరాధనవల్ల నేత్రరోగాలు, చర్మవ్యాధులు తగ్గుతాయని; పెళ్లికాని వారికి వివాహం జరిగి సత్‌సంతాన సౌభాగ్యం కలిగి ఆయురారోగ్య ఐశ్వర్యములతో వర్ధిల్లు తారని ప్రజల విశ్వాసం. అలా సంతానం కలిగినవారు శ్రీ స్వామివారి సహస్రనామాలలో ఇష్టమైన పేరును వారి బిడ్డలకు పెట్టు కుంటారు. ఈ పుణ్యదినాన శ్రీ స్వామికి పాలు, పండ్లు, వెండి, పూలు పడగలు, వెండి కళ్ళు మొదలైన మొక్కుబడులు సమర్పించుకుంటూ ఉంటారు.

ఇటువంటి పుణ్యప్రదమైన “శ్రీ సుబ్రహ్మణ్యషష్ఠి” నాడు మనమంతా శ్రీ స్వామి విశేష పూజలు గావించి శ్రీ స్వామివారి కృపాకటాక్ష వీక్షణలు పొందుదాము.

## 13. కుమారషష్ఠి

షణ్మతాలలో కుమారోపాసన (సుబ్రహ్మణ్యోపాసన) ఒకటి. మిగిలినవి. సౌర, శాక్త, వైష్ణవ, గాణాపత్య, శైవములు. అయితే ‘అగ్నిగర్భుడు’ అని పేరు పొందిన సుబ్రహ్మణ్యారాధన అగ్ని ఉపాసనతోనే జరుగుతుందని శాస్త్ర హృదయం. అంచేత పంచదేవతారాధనలో సుబ్రహ్మణ్యుని ప్రస్తావనరాలేదు. అయితే దీపారాధన ‘శివ శక్త్యాత్మకుడైన ఆగ్నేయుని సుబ్రహ్మణ్యు’ని ఆరాధించడ మేనని తత్త్వజ్ఞుల వచనం. ఈ విధంగా వైదికమతంలో సుబ్రహ్మణ్యోపాసన చెప్పబడింది.

**“...యం సిద్ధ్యంతి స్కందం దేవం సుబ్రహ్మణ్యోం సుబ్రహ్మణ్యోం.”**

బ్రహ్మణస్పతి, బృహస్పతిగా వేదంలో వర్ణితుడైన గణపతివలె... సుబ్రహ్మణ్యునిగా (మంత్రవాచ్య పరతత్త్వంగా) స్కందదేవుని కీర్తించారు. బ్రహ్మణస్పతి, సుబ్రహ్మణ్య నామాల సామ్యం పరిశీలించదగ్గది.

సుబ్రహ్మణ్య గణపతులు పరబ్రహ్మ స్వరూపులేగాక, “కుమార” తత్త్వానికి ప్రతీకలు. మాతాపితృతత్త్వానికి ప్రతీకలు.” పార్వతీ పరమేశ్వరులు” ఈ జగత్తుకి ఈ మూడు తత్త్వాలు మూలాలు. అవ్యక్తం, వ్యక్తం, మహత్, అహంకారం.. ఈనాలుగూ పంచభూతాత్మక జగత్తుకి ఆధారమైనవి. ఇందులో మొదటి రెండు–అవ్యక్తం, వ్యక్తం–శివుడు, పార్వతి, మహత్ తత్త్వం..గణపతి.. అహంకారం... కుమారస్వామి. నిజానికి ఒకే పరతత్త్వం యొక్క నాలుగు భూమికలవి.

“అహంకారం” అంటే లోకంలో అనుకొనే ‘గర్వం’ అనే భావం కాదు. ‘నేను’ అనే స్పృహని ‘అహంకారం’ అంటారు. ఈ స్పృహ ‘వృష్టి’గానే కాక,

సమిష్టిగానూ ఉంటుంది. (Micro-and Macro Levels.) ఈశ్వరుని పరంగానూ ఈ భావం ఉంటుంది. ఇక్కడి నుంచే సృష్టి విస్తృతి ప్రారంభమవుతుంది. చైతన్యం యొక్క లక్షణం అహంకారం. ఈసృష్టిలో కృత్రిమంగా, యాంత్రికంగా, వైజ్ఞానిక సాంకేతికంగా....మానవుని మెదడు వంటి జ్ఞాపకశక్తి గల యంత్రాన్నో, కంప్యూటర్‌నో తయారు చేయవచ్చు. కానీ దానికి "నేనీ పనిచేస్తున్నాను" 'I' అనే అహంభావం, స్పందన ఇవ్వలేం. అదికేవలం స్వాభావికమైన సృష్టిలక్షణం. అనుభూతులకీ, ఆలోచనలకీ, స్పందనలకీ కేంద్రం ఈ 'అహం'తత్త్వమే.

ఈ అహంతత్త్వానికి ప్రతీక సుబ్రహ్మణ్యుడు. రహస్యంగా అందరిలో ప్రకాశించే పరమాత్మ చైతన్యమిది గనుక 'గుహ' అన్నారు స్వామిని. జ్ఞానలక్షణం గల తత్త్వం గనుక 'గురుగుహ' అన్నారు.

**పురుషోవిష్ణు రిత్యుక్తః శివోనానామతః స్మృతః।**
**అవ్యక్తం తు ఉమాదేవీ శ్రీర్వా పద్మనిభేక్షణా ॥**
**తత్ సంయోగా దహంకారః స చ సేనా పతిరుహః॥**

పరమపురుషుడు "విష్ణువు" లేక "శివుడు" అవ్యక్త శక్తి "లక్ష్మి" లేక ఉమాదేవి, వీరిరువురి సమైక్య, సమన్వయ తత్త్వమూర్తి కుమారస్వామి అని స్కాందపురాణం.

అంటే కుమారస్వామిని అర్చిస్తే శివశక్తుల్నీ, లక్ష్మీనారాయణుల్నీ కలిపి అర్చించినట్లే. ప్రకృతీ పురుషుల ఏకత్వం కుమారస్వామితత్త్వం. షట్కోణ యంత్రమే షణ్ముఖతత్త్వానికి ప్రతీక.

ఇది రెండు త్రికోణాల సంయోగము. ఊర్ధ్వంగా సాగే త్రికోణం. శివతత్త్వం అధోముఖంగా సాగే త్రికోణం. శక్తితత్త్వం. శివశక్తుల సంకేతమైన రెండు త్రికోణాల ఆగమం షట్కోణం.

ఈ రెండు త్రికోణాల వల్ల ఏర్పడ్డ షట్కోణాలు షణ్ముఖాలకు ప్రతీకలు. దీనివల్ల ఉత్పన్నమయ్యే శక్తి అమోఘం. దివ్యాతి దివ్యం. అందుకే ఈ దివ్య సంకేతాన్ని అనేక ప్రాచీన ఇతరమతాలు కూడా గ్రహించి, ఉపాసించాయి. యూదులు ఉపాసనా చిహ్నంగా దీనిని గ్రహించారు. ఈ విషయంబట్టి భారతీయ మతంయొక్క ప్రభావం ఎటువంటిదో తెలుసుకోవచ్చు. అమోఘమైన శివశక్తిని గురించిన తత్త్వం కనుక శక్తిధరుడు అన్నారు.

కుమార జననంలోనే అనేక తాత్త్విక మర్మాలు ద్యోతకమౌతాయి. పరతత్త్వం-అవ్యక్తం నుండి జగద్రూపం తీసుకొనే పరిణామక్రమం కుమార



జననంలో కనబడు తుంది. అమోఘ శివతేజాన్ని పృథ్వి, అగ్ని, జలం (గంగ) నక్షత్రశక్తి (షట్కృత్తికలు) ధరించి చివరకు బ్రహ్మతపోనిర్మితమైన అలౌకిక మహాగ్ని శరవణం (గొప్ప అగ్నిమయమైన రెల్లుతుప్ప) లో రూపుదిద్దుకుంది. శరవణభవుడు-సుబ్రహ్మణ్యుడు.

**కాలస్వరూపం :** వేదాలలో షణ్ముఖీనమైన సంవత్సరాగ్ని స్వరూపంగా స్వామిని వర్ణించారు. కాలాగ్ని స్వరూపమే ఇది. కాలాగ్నిరుద్రుడైన శివుని తేజమే ఈ సంవత్సరాగ్ని. ఆరుముఖాలు, ఆరు రుతువులు. పన్నెండు చేతులు, పన్నెండు మాసాలు. ఇదీ సంవత్సరాగ్ని రూపం. ఈ రూపం 'చిత్రాగ్ని'అనే నెమలిపై ఆసీనమయ్యింది. వివిధ వర్ణాలను వెదజల్లే కాంతి పుంజమే ఈ నెమలి.

**జ్ఞానస్వరూపుడు :** జ్ఞానశక్తి మూర్తిమత్త్వం సుబ్రహ్మణ్య తత్త్వం. సునిశితమైన మేధాశక్తి ప్రతీక ఆయన చేతిలో శక్తిహస్తం. (బల్లెం). శివజ్ఞానప్రదాయిని అయిన అమ్మవారు ప్రసాదించిన దివ్యాయుధమిది. ఇదే అజ్ఞానమనే తారకాసురుని సంహరించిన జ్ఞానశక్త్యా యుధం. "జ్ఞానశక్త్యాత్మా" అనేది సుబ్రహ్మణ్యానామం. **ఇచ్ఛా జ్ఞానక్రియారూప మహాశక్తిధరం భజే । శివశక్తి జ్ఞానయోగం. జ్ఞానశక్తి స్వరూపకమ్॥ (శివపురాణం)** ఇచ్ఛా, జ్ఞాన, క్రియా అనేమూడు శక్తుల మయమైన శక్తిని ధరించిన జ్ఞానశక్తి స్వరూపుడు, జ్ఞానయోగంలో సాక్షాత్కరించే శివశక్త్యాత్మకతేజః పుంజం- కుమారస్వామి. ఆరుకోణాల చక్రం-బహుముఖీనమైన ప్రజ్ఞకు సంకేతం కనుక కవిత్వానికీ, ప్రతిభకీ ఆధారశక్తిగా కూడా కుమారస్వామి ఉపాసన చెప్పబడింది. "షణ్ముఖీ ప్రతిభ"ను ప్రసాదించే ఈ కార్తికేయుని 'కవి'గా పేర్కొన్నాయి శాస్త్రాలు.

**"పుట్టన్ బుట్ట, శరంబునన్ మొలువ"** అనే పద్యంలో పోతన గారు..."కావ్య రచనా సామర్థ్యానికి నేను వాల్మీకిని కాను (పుట్టన్‌బుట్ట) శరవణభవుణ్ణి కాను (శరంబునన్ మొలువ)" అంటూ ప్రార్థించారు. ఈ మాటలో కూడా కవితాశక్తి నిధిగా స్కందుడు గోచరిస్తున్నాడు. శివతేజం స్కన్నమై వచ్చి రూపుకట్టిన దైవం కనుక ఈయన స్కందుడు. రామాయణంలో యాగరక్షణకు విశ్వామిత్రుడు రామ లక్ష్మణులతో వెళుతుండగా, మార్గమధ్యంలో సుబ్రహ్మణ్యుని గాథను వర్ణిస్తాడు.

కార్తికేయభక్తులు ఇహలోకంలో ఆయుష్మంతులై పుత్రపౌత్రులతో వర్ధిల్లి అంత్యమున స్కందసాలోక్యాన్ని పొందుతారు. ఓరామా! ఈ కుమారసంభవం ధన్యపుణ్యగాథ" అని విశ్వామిత్రుని మాట (వాల్మీకి రామాయణం -బాలకాండ)

ఏషతే రామ గంగాయా విస్తరోమయా ।
కుమారసంభవశ్చైవధన్యం పుణ్యస్తథైవచ॥
భక్తశ్చయఃకార్తికేయే కాకుత్స్థ భువిమానవాః॥
ఆయుష్మాన్‌పుత్రపౌత్రైశ్చస్కందసాలోక్యతాం వ్రజేత్‌॥

మహాభారతంలో కూడా ప్రత్యేకించి సుబ్రహ్మణ్య జననగాథ, తారకాసుర సంహారం అద్భుతంగా వర్ణించాడు వ్యాసదేవుడు. కుమారస్వామి జనన నిమిత్తం శివపార్వతుల కళ్యాణం. వారి ఏకత్వమే కుమారుని సంభవం. అందుకే – ఆ కళ్యాణ గాథను 'కుమారసంభవం' అనే గొప్పకావ్యంగా తీర్చి దిద్దాడు కాళిదాస మహాకవి. వాల్మీకులవారి "కుమారసంభవం" అనే మాటను కాళిదాసు తన కావ్యనామంగా గ్రహించారు.

అష్టాదశ పురాణాలలో గణ్యమైన 'స్కాందపురాణం' శివుని నుండి స్కందుడు విన్నది. కనుక ఆయన (స్కంద) పేరునే ఈ పురాణం పేరు పొందింది. తంత్రశాస్త్రంలో కూడా వివిధ సుబ్రహ్మణ్య స్వరూపాలు చెప్పబడ్డాయి.

బాలసుబ్రహ్మణ్యుడు, షణ్ముఖ సుబ్రహ్మణ్యుడు, వల్లీదేవసేనాసమేతుడు... ఇలా అనేక రూపాలు! ఉత్థిత కుండలినీ శక్తికి ప్రతీకగా సుబ్రహ్మణ్యుని 'సర్ప' రూపాన ఆరాధిస్తారు. సుబ్రహ్మణ్యుని శక్తులు–కుండలినీశక్తి చలనానికి, ఆగమనంలో ప్రాకే నాదశక్తికి ప్రతీక 'వల్లీ' (తీగ). ఇంద్రియశక్తులే "దేవసేన" ఈమె ఇంద్రకుమార్తె, ఈ రెండూ చైతన్యానికి పత్నీస్థానాలు. ఈవిధంగా సుబ్రహ్మణ్యస్వామిని పరబ్రహ్మగా ఉపాసించారు.

"నీవంటి దైవము షడానన ! నేనెందుకు కాననురా! మారకోటులందు గల శృంగారము, ఇందుముఖా! నీ కొనగోటను బోలునే!"– అని స్కందుని కీర్తించారు నాదబ్రహ్మ త్యాగరాజస్వామి.

శ్రీ ముత్తుస్వామి దీక్షితులు సుబ్రహ్మణ్య సాక్షాత్కారం (తిరుత్తణి క్షేత్రంలో) పొందిన సిద్ధపురుషుడు. కుమారస్వామి గురురూపంగా కనిపించి, కలకండను తినిపించి దీక్షితులను అనుగ్రహించాడు. ఆ స్వామి ప్రసాదంచేతనే సంగీత, సాహిత్య, మంత్రశాస్త్ర, నాదరహస్యాలు కలబోసిన దివ్యకృతుల్ని రచించారు శ్రీ ముత్తుస్వామి.

ప్రతికీర్తన సుబ్రహ్మణ్యుని పేరు పైననే ఆయన నామాలలో ఒకటైన "గురుగుహ నామంతో ముద్రాంకితం చేశారు. "శ్రీగురుగుహా! తారయాశు



మాం శరవణభవ! శ్రీ గురుగుహా! తారయాశుమాం" "స్వామినాథ! పరిపాలయా శుమాం స్వప్రకాశ! వల్లీశ! గురుగుహా! దేవసేనేశ!" ఇలా ఎన్నెన్నో కీర్తనలను ప్రత్యేకించి స్వామిపై రచించారు. "స్వామి"అనే నామం సుబ్రహ్మణ్యునకు సిద్ధమైన నామం. అరుణగిరి నాథుడు– వంటి మహాభక్తులు సుబ్రహ్మణ్యోపాసనలో సిద్ధులు. వేగంగా అనుగ్రహించే కరుణాళువు. శివశక్తుల సమైక్యమూర్తి, అమోఘ మేధాప్రదాత, వంశవర్ధనుడు పరబ్రహ్మ సుబ్రహ్మణ్యస్వామి. (ఋషిపీఠం వారి సౌజన్యంతో)

## 14. సుబ్రహ్మణ్య షష్ఠి ప్రాశస్త్యమ్

**"మాసానాం మార్గశీర్షోహం"** అని గీతాచార్యులు తెలిపినారు. ఇట్లనుటకు కారణములు అనేకములు గలవు. ఏకాదశీ దేవి యొక్క ఆవిర్భావము మార్గశీర్ష శుక్ల ఏకాదశినాడు జరిగినది. ఈ మార్గశీర్ష మాసములోనే సుబ్రహ్మణ్యేశ్వరుని షష్ఠి వచ్చును. కేశి అనే పేరుగల ఒక రాక్షసుడు దేవసేన అను పేరుగల కన్యను బంధించి తీసుకొని పోవుచుండగా దేవేంద్రుడు అడ్డుపడి వజ్రా యుధముతో ఆ రాక్షసుని సంహరించి ఈ దేవసేన తనకు పినతల్లి కుమార్తె అని దేవేంద్రునికి తెలిసినది. అతడు ఈమెనెవరికిచ్చి వివాహము చేయవలెను? అని ఆలోచనలో ఉండెను. ఇంతలో ఈశ్వర తేజస్సును అగ్నిహోత్రుడు రెల్లు పొదలో నిక్షిప్తము చేసిన సందర్భమున మహావీరుడు ఉదయించెను. షట్‌కృత్తికలు ఆ పిల్లవానిని పెంచి పెద్దచేసిన కారణమున ఆ బాలుడు ఆరుముఖములు కలవాడయ్యెను. అతడు మహాబల సంపన్నుడు. దేవేంద్రుడతనిని ఒక భూతముగా భావించి ఆ బాలునితో యుద్ధముచేసి ఓడిపోయెను. పార్వతీ పరమేశ్వరులు అచటికొచ్చెను. అతడు గౌరీ శంకరుల పుత్రుడని విదితమయ్యెను. కార్తికేయుడని విదిత మయ్యెను. ఈతనికే సుబ్రహ్మణ్యేశ్వరుడనియు కుమారస్వామి అనియు నామకరణముచేయబడినది. గుహుండని పేరు కూడా కలదు. తన ఉదర గహ్వరములో అన్నివిద్యలు యిమిడివున్నవి.

నిర్గుణమైన పరబ్రహ్మతత్త్వము సగుణముగా ఈ బాలుని రూపముగా అవతరించిన కారణముగా సుబ్రహ్మణ్యేశ్వరుడని పేరువచ్చెను. పుట్టిన ఆరురోజులకే సర్వశక్తి సమన్వితుడైన కారణమున దేవేంద్రుడు, దేవసేననిచ్చి వివాము చేసెను దేవసేనా సుబ్రహ్మణ్యేశ్వరుల వివాహమైనరోజు సుబ్రహ్మణ్యషష్ఠి సంస్కృత భారతములో 'తస్మాత్ షష్ఠీ మహాతిథిః' అని వేదవ్యాసులవారు దీని ప్రాశస్త్యమును తెలుపు ఒక గాథ దేవీభాగవతములో గలదు. పూర్వము

స్వాయంభూమనువునకు ఉత్తాన పాదుడు, ప్రియవ్రతుడు అని యిద్దరు కుమారులు గలరు. ఉత్తాన పాదుడు ధృవుడు అన్న విషయం అందరికీ తెలిసినదే ప్రియవ్రతుడు విరక్తిభావము గలవాడై ప్రవృత్తిభావము నందు అభిలాష లేక మోక్షకామియై తపస్సుకు పూనుకొనెను.

తపస్సుకు బ్రహ్మదేవుడు అతనికి ప్రత్యక్షమై నీ ప్రియవ్రతుండు సాంసారిక జీవితము అశాశ్వతమైనది. భోగభాగ్యములు బహు అశాశ్వతము. జీవితము క్షణభంగురము, 'రాజ్యాంతే నరకం ధృవం' అని పెద్దలు చెప్పిన కారణమున నేను రాజ్యమునందు కోరికలేని వాడనయి తపస్సునకు ఉపక్రమించినవి చెప్పెను. అది విని బ్రహ్మ దేవుడు ఓ రాజా! నిండు సంసార సుఖమును విడిచిపెట్టి క్లేశమును పొందుచూ తపస్సుచేయుట వలన ఎట్టి ప్రయాజనము లేదు. కనుక నీవు వివాహము చేసుకొని రాజ్యపరిపాలన చేయుము అని పలికెను.



బ్రహ్మఉపదేశమును తీసుకొని ప్రియవ్రతుడు తపస్సు విరమించి మాలతి అనునామెను వివాహము చేసుకొని ధర్మనిష్టతో పరిపాలన చేయదొడగెను. పుత్రసంతతికై అతడు పుత్రకామేష్టి చేయగా కుమారుడు కలిగెను. కాని ఆ పిల్లవాడు మరణించివుండెను.

ప్రియవ్రతుడు ఆ శవమును భుజముపై వేసుకొని శ్మశానమునకు వెళ్ళి ఖననం చేయు ప్రయత్నములో వుండగా ప్రియవ్రతుని వెంట వచ్చిన వారందరును ఎంతయో దుఃఖించిరి. ఆ అర్ధరాత్రి సమయమున ఆకాశంపై ఒక మెరుపు మెరిసెను. ఆ మెరుపు నిలకడగా వుండి భూమి మీదకు దిగుచుండెను. చూడగా చూడగా అది కేవలం మెరుపేకాదు. ప్రకాశించుచున్న దివ్య విమానము, ఆ విమానము ప్రియ వ్రతునకు సమీపమున ఆగెను. ఆ విమానములో నుండి ఒక తేజోవతియైన స్త్రీమూర్తి ప్రియవ్రతుని సమీపమున ఆగెను. ఆ విమానములో నుండి ఒక తేజోవతియైన స్త్రీమూర్తి ప్రియవ్రతునకు దర్శనమిచ్చెను. ఆశ్చర్యపడుచున్న ప్రియవ్రతునితో ఆ స్త్రీమూర్తి నేను ప్రకృతికి అందని దానిని. ఆదిపరాశక్తి యొక్క ఆరవ అంశతో అవతరించినదానిని కనుక నాపేరు షష్టీదేవి. దేవసేన అని మరొక పేరుకూడా నాకు కలదు. నేను సుబ్రహ్మణ్యేశ్వరునకు ధర్మపత్నిని, నా దర్శనము వృధాకాదు. ఎవరికేది కావలసి నను ఈయగలను, నీ కుమారుడిని బ్రతికించెదనని పలికి ఆ షష్టీదేవి ఆ పిల్లవానికి ప్రాణదానము చేసి సువ్రతుడు అని పేరు పెట్టెను. ప్రియవ్రత



డెంతయో ఆనందించెను. ఓ ప్రియవ్రతా! మీరందరును షష్టివ్రతము చేయుడు. మార్గశీర్ష శుద్ధ షష్టినాడు షష్టీవ్రతమును ప్రారంభించి ప్రతినెలలోను వచ్చిన శుద్ధ షష్టినాడు షష్టీ వ్రతము సంవత్సరకాలము చేసినచో సత్పురుష సంతానము కలుగునని నుడివి ఆ దేవి అంతర్ధానమాయెను. సుబ్రహ్మణ్యేశ్వర సహితయగు షష్టీదేవి వ్రతమాచరించినచో తప్పక సత్పుత్రసంతానము కలుగును. దేవసేనా సుబ్రహ్మణ్యేశ్వ రుల ఆరాధన ఫలితముగా సమస్త శుభములను సర్వులకును లభించును. శ్రీ సుబ్రహ్మణ్యేశ్వరుని దేవాలయాలు మన భారతదేశములో అనేకచోట్ల ఉన్నాయి. ఆంధ్ర దేశములోనే కాక తమిళనాడులో కూడా ఫళని మొదలగు అనేక పుణ్యక్షేత్రాల్లో సుబ్రహ్మణ్యేశ్వరుని ఆరాధన జరుగుతూ ఉన్నది. ప్రతిగ్రామ, పట్టణాల్లో ఆ స్వామికి ఆలయాలున్నాయి.

షష్టినాడు సుబ్రహ్మణ్యేశ్వర స్వామి తీర్థములు, జాతరలు చేసి ఆ స్వామిని కొలుస్తారు. మనదేశంలో అనేకమంది సహస్రనామాలు గల ఆ షణ్ముఖుని పేర్లను తమ బిడ్డలకు పెట్టుకుంటూంటారు.

సుబ్రహ్మణ్యేశ్వరుడు ఆరు ముఖములు కలవాడని, పన్నెండు చేతులు కలవాడనియు పురాణములలో వర్ణించబడింది. కొన్ని గాథలలో ఈ స్వామి సర్ప స్వరూపుడని అభివర్ణింపబడింది. ఈ రెండింటిలో ఏది నిజం? ఈ ప్రశ్నకు సమాధానం రెండూ నిజలే. తారకాసురునితో యుద్ధం చేసేటప్పుడు నెమలి వాహనమెక్కి ఆరుముఖాలతో గర్జించుచూ, ఆరు చేతులతో బాణములను ధరించి భయంకర యుద్ధము చేశాడు. ఈ సందర్భంలో తారకాసురుని సేన కొన్ని అక్షోహిణీలు వున్నవి. రాక్షసులందరినీ ఒక్కసారి ఉక్కిరిబిక్కిరి చేసి చంపుటకు కుమారస్వామి సర్పరూపమై రాక్షస సేనను చుట్టివేసి ఉక్కిరిబిక్కిరిచేసి క్షణకాలములో రాక్షస సేనను సంహరించెను. అని వ్యాస ప్రోక్త పురాణములలో చెప్పబడినది. కుండలినీశక్తే సుబ్రహ్మణ్యేశ్వరుని శక్తి కనుక కుమారస్వామి అనుగ్రహము వలన వర్షుడను పేరుగల నిరక్షరకుక్షి సకలవేదశాస్త్ర పండితుడయ్యెను. ఆ వర్షుని దగ్గర పాణిని, వర్షురుషి మున్నగు వారు విద్యలనభ్యసించెను. వీనిలో పాణిని అనువాడు మొట్టమొదటిలో చదువురాని మొద్దుగా నుండెడివాడు. అతను కుమారస్వామిని గూర్చి తపస్సుచేసి సర్వవిద్యా పరిపూర్ణుడయ్యెను. పాణినీయము అని ప్రసిద్ధి పొందిన వ్యాకరణశాస్త్రం రచించిన మహానుభావుడు ఈ పాణిని, శత్రువినాశనము, శాస్త్ర జ్ఞానము, వేదాంత శాస్త్ర పరిజ్ఞానము మున్నగునవన్నియు సుబ్రహ్మణ్యేశ్వరుని కటాక్షమువలన లభించెను.

# ఆంధ్రాలోని సుబ్రహ్మణ్య క్షేత్రములు



## సుబ్రహ్మణ్య క్షేత్రాలు

1. తూర్పుగోదావరి జిల్లాలోని బిక్కవోలులో సుబ్రహ్మణ్యస్వామి
2. పెద్దాపురం (అమరగిరి-పాండవులమెట్టపైన) లో సుబ్రహ్మణ్యస్వామి
3. కృష్ణాజిల్లాలోని మోపిదేవిలో సుబ్రహ్మణ్యస్వామి
4. కృష్ణాజిల్లాలోని పెదకళ్ళేపల్లిలోని దుర్గానాగేశ్వరస్వామి
5. గుంటూరు జిల్లాలోని పెదనందిపాడు సమీపంలో నాగులపాడు సుబ్రహ్మణ్య స్వామి
6. గుంటూరు జిల్లాలోని పొన్నూరు నాగేంద్రస్వామి (కట్టమూరు అడ్డరోడ్డు నందు)
7. గుంటూరుజిల్లాలోని పెదకూరపాడులో (పుట్ట) నాగంద్రస్వామి
8. గుంటూరు జిల్లాలోని మంగళగిరి సమీపములో నవులూరు నాగేంద్ర స్వామి
9. కృష్ణాజిల్లాలోని చోడవరం నాగేంద్రస్వామి
10. విజయవాడ కనకదుర్గ ఆలయములో కుమారస్వామి
11. తూర్పుగోదావరి జిల్లాలోని పందలపాక (బిక్కవోలు) సోమేశ్వర సుబ్రహ్మణ్యేశ్వరస్వామి



12. కృష్ణా జిల్లాలోని చేపూరుపాలెం (శింగరాయపాలెం సెంటర్) (ముదినేపల్లి)లో శ్రీవల్లీదేవసేన సుబ్రహ్మణ్యేశ్వరస్వామి
13. కర్నూలుజిల్లాలోని ఎస్.కొత్తూరు (పాణ్యం)లో సుబ్రహ్మణ్యేశ్వరస్వామి
14. పశ్చిమగోదావరి జిల్లాలోని జుత్తిగలో ఉమావాసుకి రవిసోమేశ్వరస్వామి
15. కృష్ణాజిల్లాలోని విజయవాడలోని సత్యనారాయణపురం కుమారస్వామి
16. కృష్ణాజిల్లాలోని మండవల్లిలో నాగసుబ్రహ్మణ్యస్వామి
17. కృష్ణాజిల్లాలోని ఘంటసాలలో సుబ్రహ్మణ్యస్వామి
18. గుంటూరు జిల్లాలోని తెనాలి (వైకుంఠపురం పుట్ట)లో నాగేంద్రస్వామి
19. గుంటూరు జిల్లాలోని (దామరపల్లి)లో నాగేంద్రస్వామి
20. గుంటూరు జిల్లాలోని పెదకాకాని (గొడపాలెం) లో గిరిజాంబ సమేత నాగేంద్రస్వామి
21. తూర్పుగోదావరి జిల్లాలోని కోరుకొండలో సుబ్రహ్మణ్యస్వామి
22. తూర్పుగోదావరి జిల్లాలోని రాజమండ్రిలో సుబ్రహ్మణ్యస్వామి
23. పశ్చిమగోదావరి జిల్లాలోని చేబ్రోలులో కుమారస్వామి
24. నెల్లూరు జిల్లాలోని బాలయపల్లె గ్రామం వద్ద కుమారస్వామి
25. నెల్లూరు జిల్లాలోని మల్లాంలో స్వయంభూ సుబ్రహ్మణ్యస్వామి
26. కర్నూలు జిల్లాలోని ఓర్వకల్లులో నాగేశ్వరస్వామి
27. విశాఖ జిల్లాలోని విశాఖపట్నంలో (ఊర్వశిజంక్షన్) సుబ్రహ్మణ్యస్వామి
28. విశాఖ జిల్లాలోని విశాఖపట్నంలో (శాంతిపురం) సుబ్రహ్మణ్యస్వామి
29. సికింద్రాబాద్ స్కందగిరిలో సుబ్రహ్మణ్యస్వామి
30. మహబూబ్‌నగర్ జిల్లాలోని నాగర్ కర్నూలులో సుబ్రహ్మణ్యస్వామి
31. చిత్తూరు జిల్లాలోని చిత్తూరులో సుబ్రహ్మణ్యస్వామి
32. నెల్లూరు జిల్లా జొన్నవాడలో సుబ్రహ్మణ్యస్వామి
33. పశ్చిమగోదావరి జిల్లా యనమదుర్రులో సుబ్రహ్మణ్యస్వామి
34. కృష్ణాజిల్లా నందివాడ మండలం రుద్రపాక గ్రామ శివారులో నాగులకోన అవతల (గుడివాడకు 20కి.మీ.) సర్పక్షేత్రములో నాగసుబ్రహ్మణ్యస్వామి
35. కర్నూలు జిల్లాలో ఎస్.కొత్తూరులో సుబ్రహ్మణ్యస్వామి
36. కర్నూలు జిల్లాలో పాణ్యంలో సుబ్రహ్మణ్యస్వామి

## 2. ఆంధ్రలోని నాగేశ్వరస్వామి ఆలయాలు

1. కృష్ణాజిల్లాలోని పెదకళ్ళేపల్లిలో - శ్రీ దుర్గానాగేశ్వరస్వామి
2. తూర్పుగోదావరి జిల్లాలోని మందపల్లిలో - నాగేశ్వరస్వామివారు
3. కర్నూలు జిల్లాలోని ఓర్వకల్లులో నాగేశ్వరస్వామి
4. కర్నూలు జిల్లాలోని పాతకోట (నందికొట్కూరు తాలూకా) నాగేశ్వరస్వామి
5. శ్రీకాకుళం జిల్లాలోని మోసుబందరులో - మణినాగేశ్వరస్వామి
6. కృష్ణాజిల్లాలోని మచిలీపట్నంలో - నాగేశ్వరస్వామి
7. కృష్ణాజిల్లాఓని మేడూరులో - దుర్గానాగేశ్వరస్వామి
8. ప్రకాశం జిల్లాలోని గిద్దలూరులో - పాతాళగాగేశ్వరస్వామి

## 3. తమిళనాడులోని సుబ్రహ్మణ్య క్షేత్రములు

1. తమిళనాడులో ఘటికాచలంలో ఘటికాచల మురుగన్
2. తమిళనాడులో రెట్టిపాట్టి (కందగిరి) దండాయుధపాణి
3. తమిళనాడులో చిన్నిల్‌పట్టి (10 కి.మీ. దిండిగల్) నాన్‌గుముఖా మురుగన్
4. తమిళనాడులో ఎట్టికుడి (20 కి.మీ. నాగపట్టణం) వేలవన్
5. తమిళనాడులో ఎన్‌కాన్ (తంజావూరు జిల్లా) షణ్ముగన్
6. తమిళనాడులో కుమారగిరి - (సేలం) దండాయుధపాణి
7. తమిళనాడులో కొంకణగిరి - వట్టమలాల్ (పళనిదగ్గర) మురుగన్
8. తమిళనాడులో రత్నగిరి - (వెల్లూరు - ఆర్కాట్‌రూటు) మురుగన్
9. తమిళనాడులో కున్‌రాకుడి (12కి.మీ. కరైకుడి) కుమరన్
10. తమిళనాడులో కుమార్‌కోయిల్ (తిరువనంతపురం - నాగర్ కోయిల్‌రూటు) కుమరన్
11. తమిళనాడులో మద్రాసు (కుమార్‌కొట్టమ్) కుమారన్
12. తమిళనాడులో వడపళని (మద్రాసు) దండాయుధపాణి
13. తమిళనాడులో కంకొట్టమ్ (మద్రాసు) ముత్తుకుమారస్వామి
14. తమిళనాడులో కంచిలోని సోమస్కందుడు
15. తమిళనాడులో కంచమలాల్ (20కి.మీ.సేలం) బాలమురుగన్



16. తమిళనాడులో శివన్‌మలాల్ (నమ్మక్కాల్) బాలమురుగన్
17. తమిళనాడులో కపిలాల్‌మలై (నమ్మక్కాల్) బాలమురుగన్
18. తమిళనాడులో తిండిమలై (10కి.మీ.కోయంబత్తూర్) బాలమురుగన్
19. తమిళనాడులో కలుగుమలైలో మురుగన్
20. తమిళనాడులో కుడిమియమలై (18కి.మీ. పుదక్కోటై) కురుమినాథన్
21. తమిళనాడులో పోల్లాచ్చి (40కి.మీ. కొయంబత్తూర్) సుబ్రహ్మణ్యస్వామి
22. తమిళనాడులో మల్లామ్ (50కి.మీ. పాండిచ్చేరి) సుబ్రహ్మణ్యస్వామి
23. తమిళనాడులో తిరుపోరూర్ (16కి.మీ.మహాబలిపురం) సుబ్రహ్మణ్య స్వామి
24. తమిళనాడులో చెయ్యూరు (మధురాంతకం దగ్గర) మురుగన్
25. తమిళనాడులో మదుదమలై (12కి.మీ. కోయంబత్తూర్) సుబ్రహ్మణ్య స్వామి
26. తమిళనాడులో తిరువణ్ణామలై (కాట్పాడి - విల్లిపురంరూటు) మురుగన్
27. తమిళనాడులో ఉతరపు సెన్నమలై (సేలంనుండి బస్సులో) కందే పెరుమాన్
28. తమిళనాడులో వల్లిమలై (30 కి.మీ.తిరుత్తణి) మురుగన్
29. తమిళనాడులో తిరుమలై (5కి.మీ. మద్రాసు) కుమారన్
30. తమిళనాడులో తిరుపోరూరు (50 కి.మీ.మద్రాసు) కుమారన్
31. తమిళనాడులో కేములవలూరు (తంజావూరు-నాగపట్టణం రూటు) బాలసుబ్రహ్మణ్యస్వామి
32. తమిళనాడులో చెట్టికులామ్ (తిరుచ్చి - పెరంబూరురూటు) బాల సుబ్రహ్మణ్యస్వామి
33. తమిళనాడులో తిరువిడైకులి (మాయవరం - తరంగబడిరూటు) శివ సుబ్రహ్మణ్యం
34. తమిళనాడులో ఎల్లాత్తూరు (సన్‌పవార్‌యార్ గ్రామం) తిరువణ్ణామలై జిల్లా) కందేపెరుమాన్
35. తమిళనాడులో కరామదై (కోయంబత్తూరు జిల్లా) మురుగన్
36. తమిళనాడులో అందవార్ కుప్పం (4కి.మీ.పొన్నేరి, చెంగల్పట్టు జిల్లా) మురుగన్

37. తమిళనాడులో అందవార్‌కుప్పం (4కి.మీ.పొన్నేరి, చెంగల్పట్టుజిల్లా) మురుగన్

38. తమిళనాడులో సిక్కాల్ (4కి.మీ. నాగపట్టణం) సింగారావెలన్

39. తమిళనాడులో మైలామ్ (పాండిచ్చేరి-దిండివనం) మురుగన్

## 4. తమిళనాడులోని ముఖ్య సుబ్రహ్మణ్య క్షేత్రాలు

**1. తిరువణ్ణామలై (లేక) అరుణాచలం :** శివుని అగ్ని తేజోలింగము. దేవాలయములో సుబ్రహ్మణ్యస్వామి కొలువైఉన్నారు. ఇక్కడ శ్రీరమణ మహర్షి ఆశ్రమం కూడ కలదు.

**2. పులముదిరచోళై (లేక) అలగర్ కోయిల్ :** శ్రీ సుబ్రహ్మణ్యస్వామివారు కొలువై ఉన్నారు.

**3. మరుదమలై :** శ్రీ సుబ్రహ్మణ్యస్వామివారు ఉన్నారు.

**4. ఇల్లంజి :** కుర్తాళం నుంచి 2 కి.మీ.దూరం ఉన్న కుమారస్వామి (మురుగన్) సుప్రసిద్ధఆలయం.

**5. కురుంజి అండవార్ (కుమారస్వామి) :** కొడైకెనాల్ మధురై నుండి 120 కి.మీ. దూరంలో సుబ్రహ్మణ్య స్వామి ఆలయం కలదు.

**6. వైదీశ్వరన్ కోయిల్ (ముఖ్యక్షేత్రం) :** చిదంబరంకు దగ్గరలో గల ప్రసిద్ధి అంగారక క్షేత్రం. ఇక్కడ నాడీజాతకములు భూత, వర్తమాన, భవిష్యత్తుకాలాన్ని తాళపత్రములలో చూచి చెపుతారు. దర్శించవలసిన కోవెల.

**7. కలుగునాదర్ :** కలుగుమలై మధురైకు 120 కి.మీ. దూరంలోగల కుమారస్వామి క్షేత్రం , గర్భగుడిలో జంబుకేశ్వరుడు, అఖిలాండేశ్వరి వెలసివున్నారు.

**8. తంజావూరు సుబ్రహ్మణ్యస్వామి :** బృహదీశ్వర ఆలయంలోని సుబ్రహ్మణ్య స్వామి ఆలయం చూడదగినది. విగ్రహం చాలాపెద్దది.

**9. తిరుగోకర్ణం :** పుదుక్కోటకు 5 కి.మీ. దగ్గరలో నున్న తిరుగోకర్ణంలో గుట్టమీద సుబ్రహ్మణ్యస్వామి చూడదగిన దేవాలయం. ఈ ప్రదేశమును కుమారమలై అని అంటారు.

**10. వయలూరు :** తిరుచ్చికి 8 కి.మీ. దూరములో మురగన్ దేవాలయం వున్నది. తప్పక చూడదగినది. స్వామివారు ఆది కుమారుడు.



**11. విరలిమలైర్ :** తిరుచ్చికి 30 కి.మీ. దూరములో సుబ్రహ్మణ్యస్వామి ఆలయం పర్వతం మీద వున్నది. యిక్కడ అందమైన నెమళ్ళుకూడ వున్నాయి.

**12. నాగర్‌కోయల్ :-** ఇచ్చట గల ఆలయంలో నాగరాజస్వామి స్వయంభువు. ఎదురుగా కొలను వున్నది. గర్భాలయంలో నీరు వూరుతూ వుంటుంది. ఈ నీటినే తీర్థముగా యిస్తారు. ఈ నీటి ఊటలో ఇసుక సంవత్సరములో సగభాగం తెల్లగాను, మిగిలిన భాగం నల్లగాను ఉంటుంది.

**13. ఫణ్‌పోళి :** తిరునల్వేలి జిల్లాలోని తెన్‌కాశి తాలూకాలోని ఫణ్‌పోలిలో సుబ్రహ్మణ్యస్వామి ఆలయం కలదు.

**14. పుదుక్కోట :** పుదుక్కోట జిల్లాలోని పుదుక్కోటలో సుబ్రహ్మణ్యస్వామి ఆలయం కలదు.

**15. కున్నాండార్ :** పుదుక్కోటకు 27 కి.మీ. దూరములో కున్నాండార్‌లో సుబ్రహ్మణ్యస్వామి ఆలయం కలదు.

**16. కంచి :** ఇచ్చట స్వామిపేరు స్వామినాధుడు. కుమారస్వామికి మామూ లుగా తేనె అభిషేకము. దీపావళినాడు మాత్రం ఇక్కడ స్వామివారికి తైలాభిషేకం చేస్తారు.

**17. పద్మనాభపురం :** నాగర్ కొయల్‌కు 20 కి.మీ. దూరములో వున్నది. ఆరు సుబ్రహ్మణ్యక్షేత్రాలలోని విగ్రహముకన్న పెద్దదైన విగ్రహము వున్నది.

**18. మాయవరం :** మన్నర్ గుడికి 20కి.మీ. దూరంలో వున్నది. స్వామివారి పేరు మయూరనాధుడు. దీనిని బీదవాళ్ల "దక్షిణకాశి" ప్రసిద్ధినొందిన క్షేత్రము

## ఆరు పడవీడు (ఆరుసుబ్రహ్మణ్యక్షేత్రాలు)

1. **పఝముదిరిసోళై :** 21 కి.మీ. మధురై
2. **తిరుచందూర్ :** 40 కి.మీ. తిరునల్వేలి
3. **స్వామిమలై :** 6 కి.మీ. కుంభకోణం
4. **తిరుపురకుంద్రం :** 8 కి.మీ. మధురై
5. **పళని :** 122 కి.మీ. మధురై
6. **తిరుత్తణి :** 62 కి.మీ. తిరుపతి

## 5. కర్ణాటకలో సుబ్రహ్మణ్య క్షేత్రాలు

**1. ఉడిపి :** శ్రీకృష్ణుని సమేతంగా శ్రీసుబ్రహ్మణ్యస్వామివారు కొలువై ఉన్నారు.

**2. కుక్కేసుబ్రహ్మణ్యం :** శ్రీవల్లీదేవిని వివాహం చేసుకొని కుమారు పర్వతం మీద కుమారనదీ తీరంలో వెలసిన బుట్టస్వామి (కుక్కే-బుట్ట) క్షేత్రము ఇది మంగుళూరుకు సుమారు 90 కి.మీ. దూరంలో కలదు.

**3. బెంగుళూర్ :** బెంగుళూర్ హనుమంత నగర్‌లోగల వినాయకుని గుడిలో సుబ్రహ్మణ్యస్వామి కొలువై వున్నారు.

**4. ఘాటి సుబ్రహ్మణ్యం :** తల్లితండ్రులు శివపార్వతులతో కలిసి వెలసిన కుమారస్వామి పవిత్రస్థలము. ఇది బెంగుళూరుకు సుమారు 50 కి.మీ. దూరంలో కలదు.

**5. శృంగేరి :** సూర్యుని గతిని అనుసరించి నవగ్రహస్థంభాలు కల్గిన ప్రత్యేకమైన నవగ్రహ దేవాలయము.

6. కర్ణాటకలోని సంతురు (5కి.మీ. పాదుబిద్రి) సుబ్రహ్మణ్యస్వామి

7. కర్ణాటకలోని సుబ్రహ్మణ్యం (166ఉడిపి) సుబ్రహ్మణ్యస్వామి

8. కర్ణాటకలోని బెంగుళూరు (హనుమత్‌నగర్) కుమారస్వామి

## 6. కేరళలో సుబ్రహ్మణ్య క్షేత్రాలు

**1. పాలఘాట్ :** ఇక్కడ స్వామి కొడుంబు సుబ్రహ్మణ్య స్వామిగా పేరు పొందినారు.

**2. మన్నార్ :** ఈ క్షేత్రము కొచ్చిన్‌కు సుమారు 150 కి.మీ. దూరంలో కలదు.

**3. కుమారనల్లూర్ :** ఈ క్షేత్రము కొట్టాయంకు సుమారు 4 కి.మీ. దూరంలో కలదు. నైవేద్యం దేవాలయముల ప్రహరీ గోడలపై ఉంచు ఆచారము.

**4. హరిపాడ్ :** ఇక్కడ స్వామివారు చతుర్భుజుడుగా ప్రసిద్ధిపొందారు.

**5. ఉదయనపురం :** ఇక్కడ తారకాసుర సంహారానికి గుర్తుగా తండ్రీ కొడుకులకు ఒకేసారి అర్చన, ఊరేగింపు, స్నానోత్సవం జరిపించుకొనే పుణ్యక్షేత్రం, ఉదయనపురంలో వెలసిన ఈస్వామిని ఉదయనపుర తప్పన్ అని పిలుచుకుంటారు.



6. కేరళలో తిరువనంతపురంలో దండాయుధపాణి

7. కేరళలో కుమారనల్లూరు (3 కి.మీ కొట్టాయం) మురుగన్

8. కేరళలో తిరువిల్లాక్కు (నాగర్‌కోయిల్) తిరువనంతపురం మధ్య) మురుగన్

## 7. బీహారులో సుబ్రహ్మణ్య క్షేత్రాలు

**1. కార్తికేయ గుడి :** పాట్నా నుండి సుమారు 45 కి.మీ. దూరంలో వైశాలి పట్టణంలో ఉన్న ఆలయాన్ని హరికటోరాలని ప్రసిద్ధి. ఇక్కడ నాల్గు ముఖాల శివుని గుడి కూడ కలదు.

## 8. విదేశములలో సుబ్రహ్మణ్యస్వామి

1. శ్రీలంకలోని కొలంబోకి 280 కి.మీ. దూరములో (18కి.మీ.దూరములో ధైసామలై) కద్రికమమ్‌లో సుబ్రహ్మణ్యస్వామి

2. మలేసియాలో కౌలాలంపూర్‌కి 20కి.మీ దూరములో పట్టిమలైలో మురుగన్

3. మలేసియాలో పాసంగల్‌లో మురుగన్

4. మలేసియాలో కిల్లాన్‌లో మురుగన్

## 9. ఇతర రాష్ట్రాలలో సుబ్రహ్మణ్యస్వామి

1. ఉత్తరప్రదేశ్‌లో ఢీల్లి ఉత్తరములో (రామకృష్ణపురం) స్వామిమలైలో స్వామినాథన్ మందిరము.

2. బీహారులో (పాట్నాకు 55కి.మీ.దూరములో) వైశాలిలో సుబ్రహ్మణ్యస్వామి

## 10. శ్రీ సుబ్రహ్మణ్యేశ్వరస్వామివారి దేవస్థానము

**ఎస్. కొత్తూరు, పాణ్యం మండలం, కర్నూలుజిల్లా.**

ఈ క్షేత్రం కర్నూలుజిల్లా, పాణ్యం మండలం, నందివర్గం గ్రామం ముఖద్వారముగా ఎస్.కొత్తూరు గ్రామములో వెలసియున్నది. ఈ క్షేత్రములోని 12 శిరస్సులతో నాగేంద్రుని రూపములో ఉన్న శ్రీ సుబ్రహ్మణ్యేశ్వరస్వామివారిని దర్శించి, తరించండి. శాశ్వత అభిషేకం రుసుము 516/-లు. కార్తీకమాసము,

మాఘ, మాసం మరియు మాఘ శుద్ధ షష్ఠి (సుబ్బరాయుని షష్ఠి) లలో శ్రీ స్వామివారికి విశేష పూజలు జరుగును.

**జరిగిన అభివృద్ధి పనులు :** శ్రీస్వామివార్కి మంటపము, మంటపము చుట్టూ ఇనుప కటాంజనములు, నల్లరాతి మరియు పింక్ రెడ్ గ్రానైటు పలకల మంటపము పై సాలాహారము, మంటపంనుండి పడమర గోడవర్కు పూర్తిగా శ్లాబ్ దాదాపు రు. 2.40 లక్షలతో మరియు తూర్పున క్రొత్తగా 24 రూములు దాదాపు రు. 14 లక్షలతో భక్తాదుల సహకారంతో నిర్మించడమైనది. త్వరలో 3 అంతస్తుల రాజగోపురం పనులు దాదాపు 5.10 లక్షలతో సి.జి.ఎస్. మ్యాచింగ్ నిధులతో ప్రారంభించగలము. దేవస్థానమునకు ఉత్తరాన మరియు ఆగ్నేయ దిశనగల పాతసత్రముల స్థానే క్రొత్త సత్రములు నిర్మాణపనులు చేయుటకు సంకల్పించియున్నాము. పై నిర్మాణములకు దాతలు విరివిగా విరాళములు; కార్యనిర్వహణాధికారి, శ్రీ సుబ్రమణ్యేశ్వర స్వామి దేవస్థానం, ఎస్.కొత్తూరు వారి పేరిట పంపవలసినదిగా ప్రార్థన.

## 11.శ్రీవల్లీ దేవసేన సమేత శ్రీ సుబ్రహ్మణ్యేశ్వరస్వామివారి దేవస్థానము

**చేవూరుపాలెం, శింగరాయపాలెం సెంటర్ (ముదినేపల్లి మండలం) కృష్ణాజిల్లా.**

చరిత్ర : 1954వ సం॥రములో కృష్ణాజిల్లా ముదినేపల్లి మండలం, చేవూరుపాలెం, గుళ్లసింగరాయపాలెంగా ప్రసిద్ధి చెందిన శింగరాయపాలెం గ్రామ ములో ఒక దేవతా సర్పరాజము శ్రీ బావాజీ మఠములో శ్రీలక్ష్మీ నరసింహస్వామి వారి దేవస్థానము, తటాకములోనికివచ్చి, స్నానము గావించి తిరిగి వెళ్ళు సందర్భ ములో ఇద్దరు రైతుసోదరులు అయిన శ్రీ ఆనందాసు వెంకన్న శ్రీ యిసుకపల్లి సుబ్బారావు (చేవూరుపాలెం) ఆ దేవతా సర్పరాజముపై రాళ్ళు విసరగా ఆ సర్ప రాజము తల నేలకుబాదుకొని మరణించెను. ఆ సర్పమును గ్రామస్తులు చేవూరు పాలెం కాలువగట్టుపైన పాతిపెట్టగా ఆ రైతుసోదరులకు చూపుపోయినది. దరిమిలా వారియొక్క అపరాధము మన్నించమని శ్రీ స్వామివారికి మ్రొక్కినదర్మిలా ఆ రైతు సోదరులకు చూపు వచ్చినది. ఈ రోజురాత్రి గ్రామపెద్దలకు శ్రీ స్వామివారు కలలో కనిపించి ఆలయము నిర్మించవలసినదిగా ఆదేశించినందున ఆ పాతిపెట్టబడిన సర్పమును వెలికితీసి ఊరేగించి, దహనసంస్కారములు చేయు ప్రదేశముకోసము పెద్దలు, పండితులు శింగరాయపాలెం సెంటర్లో సమావేశమై చర్చించుచుండగా ఆదారినేపోవు ఆవులమందలో నుంచి ఒక కపిలగోవు అంబా అని అరుచుచూ



శ్రీ లక్ష్మీనరసింహస్వామి దేవస్థాన తటాకములోనికి దిగి స్నానమాచరించి చెరువు గట్టుపైకి వచ్చి చుట్టూ ప్రదక్షిణములుచేసి మలమూత్రములు విసర్జించి కాలిగిట్టలతో నేలను త్రవ్వుతూ అంబా అని అరచుచున్న సందర్భమున ఆ వింత చూస్తున్న పండితులు గ్రామపెద్దలు ఆ ప్రదేశములోనే గుడి నిర్మాణము చేయుట దైవ ఆదేశమని భావించి ఆ దివ్యమైన ప్రదేశములోనే శ్రీ వల్లీదేవ సేనాసమేత శ్రీ సుబ్రహ్మణ్యేశ్వర స్వామివారి దేవస్థానము భక్తుల సహకారముతో నిర్మాణము గావించబడి ఆనాటి నుండి ఈనాటి వరకు దినదినాభివృద్ధి చెందుతూ, శ్రీ స్వామివారు భక్తులకోర్కెలు నెరవేర్చుచున్న సంగతి లోకవిదితమే. ఇటువంటి మహా మహిమాన్వితమైన శ్రీ స్వామివారి దర్శనం సర్వదా శ్రేయో దాయకము.

## 12. శ్రీసోమేశ్వరసుబ్రహ్మణ్యేశ్వరస్వామివారిదేవస్థానము

**పందలపాక, బిక్కవోలు మండలం, తూర్పుగోదావరిజిల్లా.**



తూర్పుగోదావరిజిల్లా అశేష భక్తజనం సందర్శించే దేవాలయాల్లో పందలపాక దేవస్థానం ఒకటి. స్వామి ఇక్కడ స్వయంభువై శ్రీ సోమేశ్వర సుబ్రహ్మణ్యేశ్వర స్వామిగా అవతరించి, ఇతర ఆలయాలలో వున్న దేవతా మూర్తుల చరిత్రకంటే ఈ స్వామి చరిత్ర విలక్షణమైనది.

## 13. మోపిదేవిక్షేత్ర మాహాత్మ్యం

ఒక పురాణగాథ ప్రకారము అగస్త్య మహాముని వింధ్యాచలము నుండి వస్తూ దక్షిణప్రాంతమునకు వచ్చినప్పుడు మోపిదేవి గ్రామ పరిసరములకు రాగానే ఆ ప్రదేశం మనస్సుకు ఎంతో ఆనందము కలిగించింది. వెంటనే తపము ప్రారంభించి నాడు. కొంత కాలము తరువాత సుబ్రహ్మణ్యేశ్వర స్వామి ఆ ప్రదేశములో వున్నట్లు అంతర్వాణి చెప్పగా ఆ ప్రదేశమును త్రవ్వి చూడగా అక్కడ సుబ్రహ్మణ్యస్వామి కనిపించగా అచ్చటనే ఆలయము నిర్మింపజేసి స్వామి వారిని ప్రతిష్ఠించినారు. తరువాత నుండి సుబ్రహ్మణ్యస్వామి ఆరాధనలు అందుకొను చున్నారు. అని పురాణ పండితులు చెప్పుచున్నారు. ఇది ఒక పురాణగాథ మాత్రమే.

ఇంకొక గాథకూడ ప్రచారములో వున్నది. 200 సం॥ ఈ ప్రాంతములో కుమ్మరులు ఎక్కువగా వుండేవారు. వీరిలో వీరారపు పర్వతాలు అనే ఒక శివభక్తుడు ఉండేవాడు. ఇతను భక్తులు వద్ద చందాలు పోగుచేసి ఈశ్వరా

లయము కట్టించవలెనని సంకల్పముతో చిన్న ఆలయము నిర్మాణము చేసి అందులో సుబ్రహ్మణ్యస్వామిని వారిని ప్రతిష్ఠించినారు. తూర్పుముఖముగా వున్న ఆలయములో గర్భగృహములో వల్లీదేవి సేన సమేత సుబ్రహ్మణ్యేశ్వరస్వామి కుడివైపు (పుట్టపూజలు) నాగేంద్ర స్వామి వున్నారు.

ఆదివారము, గురువారము ప్రత్యేక అర్చనలు చేస్తారు. మాఘశుద్ధ షష్ఠినాడు వల్లీ కళ్యాణోత్సవము జరగును. ఇచ్చట స్వామి లింగ రూపము వృత్తాకారములో పలకగా ఉండును. ఇచ్చట ఆలయములో గుర్రం, నంది, గణపతి, గరుత్మంతుడు మట్టి విగ్రహాలు కలవు. ఈ క్షేత్రమును దర్శించినవారికి ఎన్నో విశేషఫలితములు కలుగుచున్నవి.

సంతానము లేనివారికి సంతానము కలుగుతుంది. నేత్రదృష్టి లేనివారికి చూపు వస్తున్నది. ముఖ్యముగా చెవులలో చీముకారుతూ పోటుకలుగు చున్నవారికి వెంటనే నివారణ కలుగుచున్నది. చర్మవ్యాధులు కూడ తగ్గిపోవు చున్నవి. ముఖ్యముగా పిల్లలు పుట్టగానే మరణిస్తున్నవారికి పాపము నివారణ అయి పిల్లలు జీవిస్తున్నారు. పెళ్ళిగాని వాళ్ళకు కుజదోషము తొలగి పెళ్ళిళ్ళు అగుచున్నవి.

ఇచ్చట భక్తులు శనివారమునాడు వచ్చి ఆలయ ప్రాంగణములో నిద్రచేసి ఆదివారము ఉదయం స్వామిని దర్శించి అభిషేకము చేయించుకొనవలెను. ముఖ్య ముగా ఇచ్చట స్వామివారికి 70 ప్రదక్షిణములు చేయగలరు. వెండి సర్ప పడగలు చేసినవి, ఆలయ మంటపములోనే అమ్ముచున్నారు. వాటిని కొనుక్కుని హుండీలోవేసి స్వామికి సమర్పించగలరు. మరియు పుట్టపూజలు నిర్వహించవలెను. అనగా పుట్టలో ఆవుపాలుపోసి వడపప్పు నైవేద్యముగా సమర్పించవలెను. ఈ ఆవుపాలు కూడ ఆలయప్రాంగణములోనే అమ్ముతారు. ముఖ్యముగా కుజదోషము కలవారు 1 1/4 కే.జి. కందిపప్పు ఎర్రటి వస్త్రములోకట్టి ఈ ఆలయములో పూజారులకు దానము చేయగలరు. ముఖ్యముగా సర్పదోషము కలవారు. 1 1/4 కేజీ మినుములు కాఫీపొడి వస్త్రములో దానము చేయగలరు. సంతానము లేనివారు మ్రొక్కితే సంతానము కలుగుతుంది. పిల్లలు పుట్టగానే చాలామంది దంపతులు పుట్టు వెంట్రుకలు ఇచ్చటనే తీయించి చెవులు కుట్టిస్తారు. ఇలా చేయుట వలన పుట్టిన పిల్లలకు ఎటువంటి సర్పదోషము తగలదని చాలా మంది విశ్వాసము.

ఈ క్షేత్రమును చేరవలెనంటే విజయవాడ నుండి అవనిగడ్డ వెళ్ళేబస్సు ఎక్కి మోపిదేవి గ్రామములో దిగాలి. ఆలయ ప్రాంగణము ముందరే బస్సు



ఆగును. విజయవాడ ఉయ్యూరు, పామర్రు, చల్లపల్లి తరువాత మోపిదేవి క్షేత్రము బస్సురూటులో వచ్చును. మచిలీపట్నం నుండి, గుడివాడ నుండి వచ్చేవారు పామర్రు జంక్షన్ నుండి రావాలి. తెనాలి నుండి వచ్చేవారు కొల్లిపర మీదగా "కాటేజ్" ద్వారా (కృష్ణానదిలో నీళ్ళు లేనప్పుడు వేసవికాలములో) శ్రీకాకుళం మీదుగా రావచ్చును.ఇది చాలా దగ్గర దారి. కాని కాజ్‌వేపై వాహనములు వెళ్ళుచున్నవో లేదో కనుక్కొని రావాలి. మోపిదేవి క్షేత్రము దర్శించుట ఒక భాగ్యము. ముఖ్యముగా కుజ నక్షత్రములలో (మృగశిర, చిత్త, ధనిష్ఠ) పుట్టినవారు రాహు నక్షత్రములలో (ఆరుద్ర, స్వాతి, శతభిషం) పుట్టినవారు ఈ క్షేత్రమును ఖచ్చితముగా దర్శించగలరు.

విజయవాడలో కనకదుర్గదేవాలయము దర్శించి, తరువాత ఉయ్యూరులో శ్రీ సాయిబాబా మందిరము, మంటాడలో రెండు శ్రీ వేంకటేశ్వరాస్వామి దేవాలయ ములు దర్శించిన తరువాత మోపిదేవీ సుబ్రహ్మణ్యస్వామిని దర్శించ గలరు. మోపిదేవి క్షేత్రములో భోజనవసతి లేదు. భక్తులు, దర్శించగోరువారు ముందుగాభోజన ఏర్పాట్లతో రాగలరు. మెపిదేవికి దగ్గరలో 5కి.మీ. దూరములో పెదకళ్ళేపల్లి క్షేత్రములో నాగేశ్వరస్వామిని, దుర్గాదేవిని దర్శించగలరు. తరువాత శ్రీకాకుళంలో ఆంధ్ర మహావిష్ణువును, ఏకరాత్రి ప్రసన్న మల్లికార్జున స్వామిని దర్శించగలరు. ఘంటసాలలో సుబ్రహ్మణ్యస్వామిని కూడ దర్శించవచ్చును. యిలా అనేక దేవాలయములు మార్గమధ్యములో కలవు. తెనాలి నుండి వచ్చేవారు వైకుంఠపురం వేంకటేశ్వరస్వామి ఆలయమును దర్శించగలరు. విజయవాడలో సీతమ్మవారి పాదాలువద్ద నున్న శని ప్రత్యేక దేవాలయమును కూడ దర్శించగలరు.

మోపిదేవి క్షేత్రమును కారులో దర్శించేవారు వీలున్నచో అవనిగడ్డపైన వున్న కోడూరు మీదగావెళ్ళి హంసలదీవి వేణుగోపాలస్వామి ఆలయమను (సముద్రతీరం) దర్శించగలరు. మోపిదేవీ క్షేత్రమును దర్శించేవారు కనీసం పెదకళ్లేపల్లిలో దుర్గా నాగేశ్వరస్వామి వారిని దర్శించి కృపపాత్రులు కాగలరు. ఇచ్చట గర్భగృహములో నాగేశ్వరస్వామి ఎడమ వైపున పార్వతీ అమ్మవారు కుడివైపున వీరభద్రుడు, భద్రకాళి, మధ్యభాగమున నందీశ్వరుడు ఆలయమునకు ఎడమవైపున దుర్గా అమ్మవారి ఆలయము) ముందు నవగ్రహ మంటపము మంటపానికి వాయువ్య దిశగా కాలభైరవుడు, నైరుతి దిశగా కళ్యాణ మంటపము, మధ్య నృత్యమంటపముకలవు. ఆలయ ఆవరణలో నైరుతి దిశగా సుబ్రహ్మణ్య స్వామి ఈశాన్య భాగమున నాగమంటపమును, మధ్య ఐదు అంతస్తులు గాలి గోపురము, గాలి గోపురానికి, నృత్యమంటపానికి మధ్య

ఉన్నతమైన ధ్వజస్తంభము. ఆలయము ముందు సరోవరము గవాకారములో ఉంటుంది. ఆలయ ఆవరణలో రెండు మీటర్లు ఎత్తుగల శిలాస్థంభము కలదు. దానినే సత్యస్తంభము అని అంటారు. ఈ స్థంభమూలమున క్షేత్రరూపుడగు కర్కోటకుడు ప్రతిష్ఠించబడియున్నది. ఆలయమునకు వచ్చినవారు ఈ స్థంభమును దర్శించిన తరువాత నాగేశ్వరస్వామిని దర్శిస్తారు. ఈ క్షేత్రమునకు క్షేత్రపాలకుడు వేణుగోపాలస్వామి. ఈ క్షేత్రమును దక్షిణకాశి అని పిలుస్తారు. స్వామివారు ఒకగుంట రూపములో స్వయంభువు అని చెప్తుతారు. ఇవీ పెదకళ్లేపల్లి క్షేత్ర విశేషములు.

రాహు మహర్దశ జరుగుచున్నవారు, కుజమహర్దశ జరుగుచున్నవారు మోపిదేవీ, పెదకళ్లేపల్లి క్షేత్రములను దర్శించి అభిషేక అర్చనాదులు జరిపించు కున్నచో ఫలితము శీఘ్రముగా కనిపించును. కావున ప్రతి ఒక్కరు తప్పక దర్శించి సుబ్రహ్మణ్యస్వామి కృపకు పాత్రులు కాగలరని ఆశిస్తున్నాను.

చల్లపల్లికి 5 కి.మీ. దూరంలో వున్న పెదకళ్లేపల్లిలోని నాగేశ్వరక్షేత్రం పురాణ ప్రసిద్ధమయింది. ఈ ప్రాంతమంతా అరటి తోటలతో నిండివున్న కారణంగా దీనిని కదళీపురి అంటారు లేదా రంభాపురి అని కూడా అంటారు. దీనికి కర్కోటక క్షేత్రం అనే పేరు కూడా వుంది. ఇక్కడి దుర్గ, పార్వతి, నాగేశ్వరస్వామి స్వయం భూవు అని అంటారు.

జనమేజయుడు చేసే సర్పయాగానికి భయపడిన కర్కోటకుడు మహాశివుణ్ణి ప్రార్థించాడని, కర్కోటక నాగేశ్వరుని రూపంలో పరమశివుడు ప్రత్యక్షమై కర్కోటకుని రక్షించాడని చెబుతారు. మహాశివ రాత్రికి ఇక్కడ పెద్ద ఉత్సవం జరుగుతుంది కృష్ణానది ఇక్కడ ఉత్తర వాహినిగా ప్రవహిస్తుంది.

మోపిదేవి శైవక్షేత్రం, ఇక్కడి శివలింగం అగస్త్య మహర్షిచేత ప్రతిష్ఠించబడింది. ఇక్కడ స్వామి అప్పుడప్పుడు నాగుపాము రూపములో దర్శనమిస్తూ వుంటాడని ప్రతీతి. సంతానార్థులు, రోగగ్రస్థులు ఈ స్వామివారిని కొలిచి మొక్కుబడులను చెల్లించుకొని సత్ఫలితాలు పొందుతూ వుంటారు. మహాశివరాత్రికి ఇక్కడ ఉత్సవాలు జరుగుతాయి.

## శ్రీ సుబ్రహ్మణ్యేశ్వర స్వామివారు-మోపిదేవి గ్రామము, కృష్ణాజిల్లా

వ్యాఘ్ర పూర్వదిగ్భాగే కుమారక్షేత్ర ముత్తమం. సుబ్రహ్మణ్యోవ సత్యత్ర భుక్తి ముక్తి ఫలప్రదః అని స్కాంధ పురాణములోని సహ్యాద్రి ఖండమున కృష్ణానదీ మహాత్మ్యము తత్తీరస్థక్షేత్రములు నిరూపించు వరుసలో పేర్కొనబడినది. ఈ విషయము సూచించినవారు అగస్త్య మహర్షి.



సుబ్రహ్మణ్యేశ్వరస్వామి క్షేత్రాల్లో మోపిదేవి క్షేత్రం ప్రసిద్ధమైనది. విజయవాడ నగరానికి 70 కి.మీ. దూరంలో పవిత్ర కృష్ణానదీ తీరాన వెలసిన దివ్యక్షేత్రం మోపిదేవి శ్రీ సుబ్రహ్మణ్యేశ్వరస్వామి క్షేత్రం లోకశ్రేయస్సు కోసం ఇంద్రాది దేవతల ప్రార్థనను మన్నించిన అగస్త్య మహర్షిలోపాముద్ర సహితుడై మహాపుణ్య క్షేత్రమైన కాశీపట్టణాన్ని వీడి దక్షిణ భారతదేశములో పర్యటిస్తూ శిష్యులతో కలసి కృష్ణానదీ తీరంలో ఉన్న కుమార క్షేత్రానికి విచ్చేసిన సందర్భంలో వెలుగు చూసిన మహాక్షేత్రమే మోపిదేవిక్షేత్రం.

**వారణాశిని వీడిన అగస్త్యుడు :** అగస్త్య మహర్షి మహాపుణ్యక్షేత్రమైన వారణాశిలో అత్యంత తపోనిష్ఠా గరిష్ఠులై ఉన్నారు. ఈ ప్రదేశాన్ని నేటికిని "అగస్త్యకాశీ" అని పిలుస్తుంటారు. అంతటి మహర్షి లోకక్షేమానికై వారణాశిని వీడి రావలసివచ్చింది. వింధ్యగిరి పర్వతం తామసంతో విజృభించి ఆకాశంలోకి చొచ్చుకుపోయి సూర్యమండలాన్ని దాటి నిలిచిపోయింది. ఫలితంగా సూర్యగమనం ఆగిపోయి ప్రకృతి స్తంభించి పోయింది. గ్రహసంచారములు నిలిచిపోయినాయి. ప్రజలు పీడితులయ్యారు. భూమి చలించిపోయింది, దేవలోకం గడగడలాడింది, ఇంతటి మహోపద్రవాన్ని నివారించేది అగస్త్య వద్దకు చేరుకుని విషయాన్ని వివరిం చారు. యోగదృష్టితో సర్వము తిలకించిన అగస్త్య మహర్షి లోకశ్రేయస్సు ముఖ్యమని తలంచినవాడై పవిత్ర పుణ్యక్షేత్రం కాశీపురాన్ని వదలితే కల్పాంతమైనను తిరిగి తాను కాశీపురం చేరుకోవడం కుదరదన తెలిసినను అమరకార్యము తప్పదు అను కున్నవాడై కాశీపురాన్ని వీడాలని నిర్ణయాన్ని తీసుకున్నారు. కాశీవిశాలాక్షి విశ్వేశ్వరు లను తన మనోదర్పణంలో నిలుపుకుని లోపాముద్ర సహితుడై కాశీపురం నుండి ప్రయాణం ప్రారంభించారు. త్రోవలోనున్న వింధ్యపర్వతం మహర్షి రాకను గమనించి సాష్టాంగ పడినట్లు పరుండి మహర్షికి త్రోవనిచ్చాడు వింధ్యుడు. అది ఎరింగిన అగస్త్య మహర్షి నేను తిరిగి వచ్చువరకు ఇట్లే ఉండమని శాసించాడు. మునిశక్తికి వింధ్య పర్వతం భయపడి అలాగే ఉండిపోయింది. తపస్వి మనసులో తానీకల్పంలో వచ్చేదిలేదు, వింధ్యుడు పైకి లేచేదిలేదు అనుకున్నారు.

**దక్షిణదేశయాత్ర :** అగస్త్య మహర్షిలోపాముద్ర సహితుడై శిష్యబృందంతో కలసి తీర్థయాత్రలు చేస్తూ కనిపించిన నదీజలాల్లో స్నానమాచరిస్తూ హృదయ బింబితులైన విశ్వేశ్వరులనందు నిల్పి ఆరాధిస్తూ పయనిస్తున్నారు ఆ ముని దంపతులు ఎప్పుడు ఎక్కడ ఏరీతిగా ఆ ముని తనను స్మరించినాడో ఆయా ప్రదేశాల్లో విశ్వేశ్వరుడు లింగరూపుడై నిలిచినాడు. ఆ ప్రదేశాలు దివ్యక్షేత్రాలుగా భాసిల్లాయి. పుణ్యతీర్థాలుగా వినుతికెక్కాయి.

**కుమారక్షేత్ర నిర్ణయం :** అగస్త్య మహర్షి సతీయుతుడై పవిత్ర గోదావరీ తీరాల్లో పయనించి కృష్ణానదీ తీరాన్ని చేరుకున్నారు. ఇంద్రకీలాద్రి చేరుకుని కనకదుర్గను పూజించారు. కృష్ణాతీరాన ఉన్న పుణ్యక్షేత్రాలను దర్శిస్తూ పయనం సాగించారు. కృష్ణానది ఉత్తరవాహినిగా ప్రవహిస్తోంది. ఉభయతో రామలింగే శ్వరుల సందర్శించినారు. శ్రీకాకుళాంధ్ర నాయకస్వామినా లోకించినాడు. వ్యాఘ్రపురం చేరుకున్నారు. తన దివ్యదృష్టితో కుమార క్షేత్రమహాత్మ్యాన్ని గాంచినాడు. రెండవ వారణాశిగా తలంచి ఆనందించినాడు. మహర్షి తదేకదృష్టి శిష్యులకు బోధపడలేదు. ఆ ప్రాంతమంత పెద్దపెద్ద పుట్టలతో నిండి ఉంది.

"వ్యాఘ్రస్య పూర్వ దిగ్భాగే కుమారక్షేత్రముత్తమమ్" అనే మాట మహర్షి నోటవెలు వడింది. ఆ రూపును మనసులో చిత్రీకరించుకున్నారు దృష్టి సారించి ముందుకు అడుగు వేశారు. లోపాముద్రయు, శిష్యబృందము మహర్షిని అనుసరిం చారు. ఒకచోట మొంగిసలున్నాయి. పాములున్నాయి, ఈ రెండింటికి సహజవైరము కాని కలసిమెలసి ఆడుకుంటున్నాయి. మరోచోట సర్పము తలను పైకి పెట్టి తోక నుంచి నడుంవరకు చుట్టచుట్టి ఉన్నది. తలపై భాగమున నెమలి నిలిచి ఉన్నది. ఆ దృశ్యం మహర్షికి ఆశ్చర్యం కలిగించింది. నెమలి కాళ్ళకు సంకెళ్ళు వేసుకున్నట్లు పెనవేసుకుని ఒక సర్పం ఉన్నది. మరికొంత దూరంలో నెమలి, పాములు అన్యోన్యంగా ఆటలాడుకుంటున్నాయి. మరొకచోట దివ్యతేజస్సుతో ప్రకాశించే పుట్ట కనిపించింది. ఆ దివ్య తేజస్సు తొలుత కంటికి చూడ లేదన్నట్లును, హృదయానికి మాత్రమే హత్తుకొన్నట్లుగా అనిపించింది. అగస్త్యునితో ఉన్నవారు వీటిని చూడలేక పోయారు. ఎన్నో విశేషములు కలగడంతో ముని తన దివ్యదృష్టిని ప్రసరించినాడు. శిష్యులకు తాను దివ్య దృష్టితో చూచిన విషయాన్ని వివరించాడు.

కృష్ణాస్రవంతి ఉత్తర నదీతీరమున వ్యాఘ్రపురమునకు తూర్పున ఉన్న స్థలము కుమారక్షేత్రము అని తన హృదయములో గుర్తు నిలుపుకొనినాడు. ఈ స్థలము భుక్తి ముక్తి ఫలప్రదము.

**సుబ్రహ్మణ్య శబ్దనిరుక్తి :** సుబ్రహ్మణ్యుడిందు నివసించుచుండననిన మాటకు కుమారక్షేత్రమునకు పొంతన విషయం మాండవ్యునకు సందేహం కలిగి గురువుతో అది వ్యక్తమొనర్చినాడు. అపుడు లోపాముద్రాధిపతి శిష్యులతో విశదీకరించినాడు. మాండవ్యా! నీ సందేహము సరియైనదే సుమా! ఈ ప్రదేశము సుబ్రహ్మణ్య క్షేత్రమని పించుకొనవలె. కాని యట్లు ప్రతీతి కొనలేదు. కారణం, సాక్షాత్తు పరమేశ్వర నిర్దేశత మనుకొనుడు. కుమారమూర్తికే సుబ్రహ్మణ్య మనెడిపేరు. ఇర్వురు వేరుకాదు.



శృతి "నమోజ్యేష్ఠాయచ కనిష్ఠాయచ" అనుచు ఏ వస్తువును బేర్కొన్నదో యది బ్రహ్మము, నిర్గుణము, నిర్వికారము, నిరామయము, అపర బ్రహ్మము. కారణాం తరమున లోకోపకార్థం గిరిజాగిరీశులకు నౌరసత్వం జెంది కుమారమూర్తిగా విరాజ లిది. పురాణ దంపతులను శివులామూర్తిని విడలేని అనుబంధంతో వామాంకమున నిల్పుకొనినారు. ఒకపరి చతుర్ముఖుడు వెలికొండకు చేరినాడు. సమయములో భవుడు కనులుమూసి ధ్యానస్థితిలో నున్నాడు, నాలుగు ముఖములుగల యా విధాతను గని ముక్కంటిపట్టి బాలకన్యాయంగా "కస్త్వం! నీ వెవరిని అనినాడు నలువ "అహం బ్రహ్మ" అని సమాధానముగా ఇచ్చినాడు. వెంటనే యా కొమరస్వామి నవ్వుచు ఏమి? బ్రహ్మనిర్గుణము, రూపులేదు నీవు రూపముతో తిలకింప బడుచుంటివి. బ్రహ్మ అక్షరుడు నీ రూపము నశించును బ్రహ్మము నిశ్చలము. నీవు చలించు చుంటివి. నీవా శబ్దమునకు తగవని వాదించినాడు. వాణీపతి యేమనుటకశక్తి చాలమి తూష్ణీంభూతుడైనాడు. ఆ స్థితిలో శంకరుడు బాహ్యదృష్టుడై "సుష్ఠుబ్రహ్మణ్య" యనుట జరిగింది. నలువ తలలు వాల్చినాడు. కుమారుడు తండ్రికి సాగిలపడినాడు. శూలి సుబ్రహ్మణ్య పదము నీకు జగద్విశదమౌగాత" అని దీవించినాడు. అభవుని నుడియౌట సుబ్రహ్మణ్య శబ్ధము సుస్థిరమై కుమార పదము నామాంతరమైనది.

**అల్పదోషం – తపస్సు :** తెలియక చేసిన అల్పదోష నివారణార్థం కుమార స్వామి ఉరగరూపం ధరించి తపస్సు చేయవలసిన పరిస్థితి ఏర్పడింది అది సనక, సనకస, సనత్కుమార, సనత్సుజాతులనెడి దేవర్షులు సర్వదా ఐదేళ్ళ ప్రాయులై ఉంటారు. పైగా దిగంబరులు, నిరంతరము వారు భగవంతుని ఆరాధనలో ఉంటారు. అట్టివారు ఒకసారి పరమేశ్వర దర్శనార్థమై కైలాసానికి విచ్చేసారు. వారుకైలాసానికి వచ్చిన వేళలో పరమేశ్వరుడులేడు. లోకమాత పార్వతీదేవి, కుమారస్వామి కైలాసంలో కొలువుతీరి ఉన్నారు. ప్రశాంత స్వభావులైన జడదారులైన దేవర్షులను వారి ఆకారా లను వింతగా కుమారస్వామి చూస్తున్నాడు. అదే సమయంలో శచీ, స్వాహా మొదలైన వేల్పు పడచులు, లక్ష్మి, సరస్వతి గిరిజాదర్శనానికై వచ్చారు. స్త్రీలు వింతవింత ఆభరణాలు, రంగురంగుల చీరలు ధరించినారు. అటుప్రక్క దిగంబరులైన ఋషులు, ఈ వంక వింత ఆకర్షణలతో స్త్రీలు ఒక్కొక్క రూపం ఒక్కోరీతిగా కనిపించింది. అటు జడదారులు, ఇటు సుందరీమణులు ఇటువంటి ప్రకృతిని చూసి శివకుమారుడు ఫక్కున నవ్వాడు. పార్వతీదేవి కుమారా! ఏల నవ్వెదవు? వారు నేనులా కనిపించడం లేదా? ఆ తాపసులు మీ తండ్రివలే లేరా? బేధమేమైనా

కన్పించినదా అని ప్రశ్నించి నది. ఆ ప్రశ్న విన్న కుమారస్వామి లోలోన బాదపడి నాడు. జగన్మాతకు నమస్కరించి వచ్చిన తాపసులు, స్త్రీలు వెళ్ళిపోయారు. కుమారస్వామి నవ్వినవైనం, పార్వతి అడిగిన మాటలు వారికి తెలియవు. తెలియక చేసిన పనికి మన్నింపమని కుమార స్వామి తల్లిపాదాలు పట్టుకుని ప్రార్థించాడు. చేసిన తప్పుపనికి పరిహారార్థమై తపస్సు చేసుకొనుటకు అనుమతి ఇవ్వమని తల్లిని ప్రాధేయ పడ్డాడు. తల్లి కాదన్నను వినక తపస్సుకోసం బయలుదేరాడు. తన రూపం ఇతరులకు కనిపించకూడదని ఉరగ రూపంలో పుట్టను ఏర్పరుచుకుని అందులో తపస్సుకు ఉపక్రమించాడు. ఒకే పుట్ట ఉంటే ఎవరికైనా సందేహం రావచ్చని ఆ ప్రదేశమంతా పుట్టలతో నింపివేశాడు. ఆ స్వామి మహిమతో సహజ వైరజంతువులు సైతం స్నేహంతో, సమానభావంతో ఉంటున్నాయి అని అగస్త్య మహర్షి తన శిష్యులకు వివరించాడు. అంతేకాక తాను దివ్యదృష్టితో చూచిన దృశ్యాలను సవివరంగా శిష్యులకు తెలియ పరిచినాడు.

భగవంతుడు తన వైనాన్ని పరోక్షంగా భక్తులకు తెలియపరుస్తూ ఉంటాడు. నెమలి ఈకలు ఎట్లుండును? రంగురంగులుగా చూడముచ్చటగా ఉండును. ఎగయు స్వభావము కూడా ఉంది. ప్రకృతి రూపం చిత్రవిచిత్రమై ఉంటుంది. గంతులు చేయడం కూడా సహజం మనం ప్రకృతిని స్వేచ్ఛగా సాగనిస్తే ప్రజలు ప్రళయాన్నే చూస్తారు. దానిని బంధిస్తే కట్టుబాటులో ఉంటుంది. కాబట్టి తాను బ్రహ్మవస్తువుకాన ప్రకృతి తన కైవసమై ఉంటుంది అనే భావం మనకు వ్యక్తీకరించుటే దృష్టాంతము. ఫలికుండలముపై నిలబడినట్లున్నదే ప్రకృతికి తానే ఆధారమని తెలియచేయుట, సకల జీవరాసులలో కుండలినీ శక్తి ఒకటుంటుంది. అదిపాము చుట్టవలే ఉండి అపానస్థానము నుండి షట్చక్రముకు ఆధారముగా ఉండును.

ఆ కుండలినియే బ్రహ్మమనుట తదాధారము మీద చక్రస్వరూపిణియైన శక్తి ప్రకృతియున్నదనుట లోకమునకు తెలియపరచేందుకే నెమలి పాముచుట్టపై ఉన్న విధానము. ఇంకోప్రక్క నెమలి మీద ఉన్న పామును చూశామే, అది ప్రకృతి పురుష సంయోగానుబంధ జన్మమీ జగత్తు. శక్తి పురుషులలోని అవినాభావసంబంధమును నిరూపించుటయే అందలి పరమార్థం. ముంగిస, పాములు ఆడుకొనిచున్నవే అది విముక్తినందించు ముఖ్యసోపానమైన సమానతా సౌజన్యమునకు ప్రతీక అనిశిష్య బృందానికి కుమారక్షేత్ర మహత్త్యమును అగస్త్యమహర్షి వివరించెను. అందుకే "యుద్యాదాచ రతి శ్రేష్ఠః తత్త దేవేతరోజనః అనుట కలదు. తానొనర్చిన పనులు ప్రపంచమునకు సమాచారణీయములు



కాగలవు, కాన తాను తపించుట యాచరించి మనకు చూపించి యాధర్ముడు భవ్యారాధ్యుడైనాడు. సుబ్రహ్మణ్యుడు సర్వమైయున్న తెరగుతెల్పితి, కుమార క్షేత్రమనుట వినిచిత. ఈ క్షేత్రమునంటి కృష్ణానది ప్రవహించు చున్నది కాబట్టి "అత్రస్నానంతు కుర్యాచ్ఛేత్కోటి జన్మాఘ నాశనమ్" అనెడి నానుడి వచ్చింది, ఆ మహోతేజస్సు వచ్చెడి కోనయే యా స్వామినాధుడు వసించుతావు. మన పూర్వజన్మ సుకృతమున నీతలమునకు వచ్చితిమి. ఈ విషయమెరిగెడి భాగ్యం లభించినది. అనుచు సతీయుతుడై అగస్త్యముని సాష్టాంగ పడినాడు. శిష్యులు సైతం ప్రణమము లొనర్చినారు. పడగవలె ఉండే శివలింగాన్ని దివ్యతేజస్సు వచ్చే పుట్టమీద ప్రతిష్ఠించాడు మహర్షి. తొలుత స్వామివారిని అర్చించినది అగస్త్య మహర్షివారే. అందుకే మార్గదర్శి మహర్షి అన్నారు పెద్దలు అగస్త్య మహర్షి చేత పూజింపబడిన సుబ్రహ్మణ్యేశ్వరస్వామి యొక్క మహాత్మ్యాన్ని అవగతం చేసుకున్న దేవతలు, మునులు ఎందరెందరో స్వామిని సేవించారు. ఆరాధించారు. ప్రశాంతమైన పుణ్యభూమిలో మునులు తపస్సు చేసుకోగలిగారు. ఈ విషయము ఏనాటిదో, ఏ గుడముదో, ఆరోజుల్లో ఈ ప్రదేశము ఎలా ఉండేదో కూడా వర్ణించలేము. ఆకాలంలో పుట్టకు గుడిలేదు. భక్తుల సందడిలేదు. లౌకికపు వైభవమూలేదు.

**స్వామి ఆలయం :** ఈనాడు మనం చూస్తున్న దేవాలయం సుమారు 500 ఏళ్లక్రిందట లేదని తెలుస్తోంది. ప్రదేశమంత పుట్టలతో నిండి ఉంది. దేవతాదిగణంచే పూజలందుకుంటున్న సుబ్రహ్మణ్యేశ్వరలింగంకూడా కొన్నాళ్లు కాలగర్భంలో తన ఉనికిని విస్మరింపచేసి పుట్టలోనే అంతర్గతముగా ఉన్నాడు. ఈనాడు మనం చూస్తున్న లింగంను వీరారపు పర్వతాలు అనే మహాభక్తుని కారణంగా చూడగలుగుతున్నాము. పుట్టలున్న ప్రాంతానికి సమీపంలోనే కుమ్మరులు నివశించేవారు. ఆ కుమ్మరి వారిలో వీరారపు పర్వతాలు అనేవాడు ఉండేవాడు. అతడు మహాభక్తుడు. అతనికి స్వామి స్వప్నంలో కనిపించి తను ఎక్కడ ఉన్నదీ, చెప్పి తన లింగమున్న పుట్టను చూపించి ఆలయం ఏర్పరచి పుట్టనుండి లింగమును వెలికితీసి ప్రతిష్ఠించమని చెప్పాడు. పర్వతాలు తనస్వప్న వృత్తాంతాన్ని తనవారందరికీ చెప్పి పుట్టను త్రవ్వి లింగమును వెలుపలికి తీసి పుట్టపై ప్రతిష్ట చేశాడు. తను ప్రతిష్ఠించిన దైవానికి తన వృత్తిని అంకితం చేయసంకల్పించి మట్టితో సుబ్రహ్మణ్యస్వామికి ఇష్టమైన వస్తువులను తయారు చేసి కాల్చి అవి చెడిపోకుండా స్వామివారికి సమర్పించి ఆలయంలో ఉంచేవాడు. అలా తయారు చేసిన విగ్రహాల్లో గుర్రం, నంది, కోడి, గరుత్మంతుడు, మహాతపస్సుల విగ్రహాలు ముఖ్యమైనవి. ఆ బొమ్మలను చూస్తే సామాన్యులకు

అలవికాని పనియని ఊహించుకోవచ్చు. ఒకవేళ అతనికంటే గొప్పపని వారు ఉండవచ్చు మట్టిబొమ్మలు చేసి కాల్చవచ్చు. కానీ కాల్చిన బొమ్మలు యథాతథంగా కనిపించడం మాత్రం జరగదు. అవి ఏనాటి బొమ్మలు తయారుచేసి ఎన్నేళ్లు అయిందో ఈనాటికీ చెక్కు చెదరక అలాగే ఉన్నాయి. ఇటీవల కాలంలో ఆలయానికి మరమత్తులు చేసిన మహర్షుల బొమ్మలు పగిలిపోయినాయి. కోడి, నెమలి బొమ్మలకు తలలు పోవడంతో ప్రక్కకు తొలగించారు. ఆలయానికి మరమ్మతులు చేసి సుమారు 40 ఏళ్ళు అవుతోంది వీరారపు పర్వతాలు ఆనాడు స్వామికి అర్పించి విగ్రహాలు గుర్రము, నంది ఈనాటికీ ఆల యంలో చూడవచ్చు.

**మోహినీ పురమే – మోపిదేవి :** కాలచక్ర భ్రమణంలో పుట్టలు అన్నీ అంతరించి గ్రామంగా అవతరించింది. గ్రామాన్ని తొలుత మోహినీపురమని పిలిచేవారని పెద్దలు చెపుతుంటారు. అదియు నిజమైయుండవచ్చు "మోహయతీతి మోహినీ మోహింప చేయునది మోహిని" యనబడుగదా భక్తిభావమును కలిగించి దూరపు వారిని కూడ నాకర్షించి దరికి రప్పించుకొనునది రప్పించుకొను చున్నది. అందువల్ల మోహినీ పురమనెడినుడిసర్థ్యేమ యగును. తర్వాత కాలంలో మోపిదేవిగా పిలవబడుతోంది. పుణ్యక్షేత్రంగా భాసిల్లింది.

**స్వామి మహిమలు :** సంతానములేని వారికి సంతానం కలిగించడం, కనుల చూపుమందగించినవారికి చక్కనినేత్ర దృష్టిని ప్రసాదించడం చెవుల బాధ పోటును తగ్గించి సుశ్రవణమును కలిగించుట, చీము కారుతున్న నివారణ, శారీర దౌర్భల్యము వల్ల స్త్రీలకు వచ్చే కుసుమ వ్యాధులను నివారించడం, చర్మంపై పొడలను పోగొట్టడం, పూర్వజన్మ దుష్కర్మవల్ల సంతానం నశిస్తుంటే పాపాన్ని తొలగించడం, విద్యాభివృద్ధిని గావించడం, సకలసంపదలు సమకూర్చడం, శారీరక ఆరోగ్యం కలగజేయడం, మనోవ్యధను పోగొట్టి సంసార సౌఖ్యం, సౌభాగ్యం ఒసంగడం స్వామి మహిమలుగా భక్తులు విశ్వసిస్తున్నారు.

సుబ్రహ్మణ్యుని మహిమలన్నియు వర్ణనాతీతము. సుబ్రహ్మణ్యుని దయ, కరుణచేత మోపిదేవి క్షేత్రం పురోగమిస్తోంది. నమ్మకంతో తనవద్దకు వచ్చినవారి కోర్కెలు తీర్చి కరుణించి కాపాడి చల్లని కరుణామృతమును అందించే కుమారస్వామి పరిజనులకు, పురజనులకు, పొరుగువారిపై సైతము పెరటలోనున్న హరిచందనమై కీర్తి గడించినాడు. మోపిదేవి చిన్న పల్లెటూరు అయినను, మండల కేంద్రంగా ఉన్నను స్వామి దయతో మహాపుణ్యక్షేత్రంగా



వర్ధిల్లుతోంది. జిల్లా నలుమూలల నుండేకాక, రాష్ట్రంలోని అనేక ప్రాంతముల నుండి వచ్చి మ్రొక్కుబడులు తీర్చుకుంటు న్నారు. స్వామి మహిమలు వినుటయేకాక స్వయంగా స్వామి మహత్తును తెలుసుకున్న దేవరకోట సంస్థానధీశులు చల్లపల్లి రాజావారు ఆలయాన్ని తమ యాజమాన్యమునకు తీసుకున్నారు. చల్లపల్లి శ్రీమంతు రాజా యార్లగడ్డ శివరామప్రసాదు బహదూర్ వారు ఆలయాన్ని అభివృద్ధిచేశారు. ఆలయానికి చల్లపల్లి జమిందారులు వంశపారం పర్య ధర్మకర్తలుగా ఉన్నారు. దేవదాయ, ధర్మాదాయ శాఖవారు ఆలయంలో భక్తులకు అవసరమైన విధంగా అభివృద్ధి పనులను చేస్తున్నారు.

సుబ్రహ్మణ్యేశ్వరస్వామి ఆలయం తూర్పుదిశగా ఉంది. గర్భగుడిలో 6 లేక 7 పాముచుట్టల మీద (ఇదేపావనపట్టం) ఈశ్వరుడు (లింగం) ఉన్నాడు ఈయనే సుబ్రహ్మణ్యేశ్వరస్వామి. పావనపట్టం క్రింద అందరికి కనపడే విధంగా లోపలికి ఒక రంధ్రం ఉంది. అర్చన, అభిషేక సమయాల్లో ఆ రంధ్రంలో పాలుపోయడం జరుగుతుంది. ఆలయ ప్రదక్షణమార్గంలో దక్షిణంవైపు ఉన్న పుట్టనుండి గర్భగుడి లోపలికిదారి ఉన్నట్లు, ఆ దారినుండే దేవతా సర్పం పయనిస్తుందని భక్తుల విశ్వాసం.

స్వామివారి దర్శనానికి భక్తులు విశేషసంఖ్యలో వస్తున్నారు. భక్తుల సౌకర్యార్థం విశ్రాంతి శాల నిర్మించారు. తమ మ్రొక్కుబడులను వివిధ రూపాల్లో చెల్లిస్తూ తమ భక్తి ప్రపత్తులను చాటుకుంటున్నారు. ముఖ్యంగా ఆలయంలో స్వామి సన్నిధిన చెవిపోగులు కుట్టిస్తారు. తలనీలాలు సమర్పిస్తారు. అన్న ప్రాశన, అక్షరాభ్యాసం వంటివి కోవెలలో జరుపుకుంటారు. మహాన్యాస పూర్వక రుద్రాభిషేకం, మహన్యాస పూర్వక వారాభిషేకం శాస్త్రోక్తంగా చేస్తారు. చీరమ్రొక్కుబడి, ఉయ్యాల ఊపుమొక్కలు తీర్చుకుంటారు. నాగదోషం ఉన్నవారు, పెళ్లికానివారు ప్రత్యేకంగా పూజలు చేయించు కుంటారు.

చల్లపల్లి రాజా వంశీయులు ఆలయానికి ఆగ్నేయ దిశగా కళ్యాణ మండపం నిర్మించారు.

**స్వామివారికి జరుగు విశేష ఉత్సవాలు :** శ్రీ సుబ్రహ్మణ్యేశ్వరస్వామి వారికి వైదికస్మార్త ఆగమబద్ధ విధంగా పూజావిధులు సమర్థంగా నిర్వహించబడతాయి. ఉగాది పర్వదినం, శ్రావణార్చనము, దసరాలో శమీపూజ, కార్తీక దీపారాధనలు, ఆర్ద్రోత్సవము, నాగులచవితి, నాగపంచమి పర్వదినాల్లో విశేష పూజాది కార్యక్రమాలు జరుగుతాయి. మాఘమాసంలో కళ్యాణమహోత్సవం, రథోత్సవం, వసంతోత్సవం వైభవంగా జరుగుతాయి.

## 14. స్వయంభువు మల్లాం శ్రీ సుబ్రహ్మణ్యేశ్వరస్వామి

శ్లో॥ ద్విషడ్భుజం, షణ్ముఖం, అంబికాసుతం
కుమారం, ఆదిత్య సహస్ర తేజసం
వందే మయూరాసన మగ్నిసంభవం
సేనాన్య వంధ్యాహ మభీష్టసిద్ధయే

మనోజ్ఞమైన, చోళపల్లవ శిల్పకళా సమ్మిశ్రశోభితమై మిక్కిలి మాహాత్మ్యం గల శ్రీ సుబ్రహ్మణ్యేశ్వర స్వామి వారి దేవాలయం ఆంధ్రప్రదేశ్‌లో నెల్లూరు జిల్లా చిట్టమూరు మండలం మల్లాం గ్రామంలో గలదు. ఇది మన రాష్ట్రంలోని సుబ్రహ్మణ్యక్షేత్రాలలో అతి ప్రాచీనమైనది మరియు తలమానికమైనది. ఇచ్చటి దేవేరులు శ్రీవల్లి, దేవసేనలు.

ఈ దేవాలయ మాహాత్మ్యానికి ముఖ్యకారణం ఇచ్చట శ్రీ సుబ్రహ్మణ్యేశ్వర స్వామివారు స్వయంభువుకావడమే. తారకాసురాది రాక్షస సంహారానంతరం తనకు సంభవించిన బ్రహ్మహత్యాపాతక నివారణార్థం శ్రీ సుబ్రహ్మణ్యేశ్వర స్వామివారు తిరువాంబూరునందు తపస్సు చేయుచుండెను. (ప్రస్తుతం "మల్లాం" అను పేరుగల గ్రామమునకు పూర్వం "తిరువాంబూరు" అనే పేరుండేది)

పాండ్యరాజ్యాధినేత సేవకులు పల్లకీల నిర్మాణమునకై వెదురు బొంగులను నరుకుచుండగా వాటి మధ్యపుట్టలో తపస్సు చేయుచున్న శ్రీ స్వామివారి హస్తములు తెగి రక్తసిక్తమై హస్త శూర్యుడయ్యెను. రాజసేవకులకు కంటిచూపు పోయెను. రాజునకు అయోమయము తటస్థించెను. దిక్కుతోచక నిరాశా నిస్పృహలకు లోనై ఆందోళన పడుచుండెను. శ్రీ స్వామివారు రాజునకు స్వప్నము నందు దర్శనమిచ్చి తన కచ్చట దేవాలయము నిర్మించి పాపమును బాపుకొమ్మని ఆదేశించెను. భగవంతుని ఆజ్ఞమేరకు రాజు అచ్చట దేవాలయ మును నిర్మించి నిత్యనైవేద్య దీపారాధనలకు కొరతలేకుండ మడిమాన్యముల నేర్పరచి ధన్యుడయ్యెను.

శ్రీ స్వామివారు తిరువాంబూరునందు స్వయంభువుగా వెలయుటకు కారణమైనట్టియు, తిరువాంబూరు మల్లాం గ్రామంగా పేరొందుటకు గల



పూర్వకథను తెలిసికొందాం. తిరువాంబూరు నందు మల్లాసుర, కొల్లాసురులను రాక్షససోదరు లుండెడివారు. వారు దానిని పరిపాలించుచు ప్రజాకంటకులై ఎల్లవారిని హింసించుచు ప్రజల సిరిసంపదలను దోచుకొనుచుండిరి. వీరివలన బాధలు పడలేక ప్రజలు శ్రీసుబ్రహ్మణ్యేశ్వరస్వామివారిని శరణువేడిరి. దైవము కరుణించెను. రాక్షసులకు హెచ్చరిక చేసెను. మదాంధులగు రాక్షసులకు శ్రీస్వామి వారి హితవచనములు చెవికి శంఖూది నట్లయ్యెను. చివరకు దండోపాయము అనివార్య మయ్యెను. రాక్షసులకు భగవంతునికి మధ్య సంకుల సమరమయ్యెను. పార్వతీ పరమేశ్వరులు తారకాసుర సంహారార్థమై శ్రీస్వామి వారికిచ్చిన "శక్తి" ఆయుధమును ప్రయోగించెను. మల్లాసుర, కొల్లాసురులు భూమిపైబడి అరకొర ప్రాణములతో నుండిరి.

మరణ సమయమున మల్లాసురుడు తన తప్పును తెలిసికొని స్వామివారి పాదములపైబడి తన జీవితమును చరితార్థము చేయుమని వేడుకొనెను. రాక్షసుని కరుణించి భవిష్యత్కాలమున తిరువాంబూరు మల్లపురముగ పిలువబడుననియు, తనకుజరుగు బ్రహ్మోత్సవములందు అతని వృత్తాంతమును కొర్లవుభయముగ తిలకింతురనియు తెల్పెను. ఆ కారణముననే నేడు బ్రహ్మోత్సవములలో కొర్లవు-భయము ప్రాధాన్యతను సంతరించుకొన్నది. తిరువాంబూరు మల్లాసురుని పేర మల్లపురముగా పేరొంది కాలక్రమమున నేడు మల్లాం గ్రామంగా ప్రసిద్ధి చెందింది. కొల్లాసురుని పేర కొల్లాసురతిప్ప అను ప్రదేశముకూడ ఇచ్చట గలదు.

మల్లాసుర కొల్లాసురులు తమకోటచుట్టు కందకమును త్రవ్వించి లోతుగా నీళ్ళను నింపి కోట భద్రతకై పటిష్ఠమైన ఏర్పాట్లు చేసిరి. ఆ కందకమే నేడు మల్లాం చుట్టు నీరు తిరిగినట్లుండుట వలన ఆ గ్రామమునకు తిరుగుడు మల్లాం అను పేరు కూడ గలదు.

ఇచ్చట శ్రీ సుబ్రహ్మణ్యేశ్వరస్వామి వారు స్వయంభువు. కావున ఈ దేవాలయము మిక్కిలి మహిమాన్వితమైనది. ఇది ఎవ్వరిచేతను ప్రతిష్ఠా పింపబడినది కాదు. కుజగ్రహదోష నివారణగలదు. కుజగ్రహమునకు శ్రీ సుబ్రహ్మణ్యేశ్వరస్వామి వారు అధిష్ఠానదేవత, ఇచ్చట కుజగ్రహమునకు పూజచేసి శ్రీ స్వామివారిని సేవించిన వారికి కుజదోషము పరిహారమై వివాహములు కానివారికి, త్వరలో వివాహములు జరుగుట, జరిగిన వివాహ ములు ఫలప్రద మగుట, అనారోగ్యముగ నుండి నిస్సంతువులైన దంపతులకు ఆరోగ్యముచేకూరి సత్సంతానము ప్రాప్తించుట జరుగును.

బ్రహ్మోత్సవసమయమందు ధ్వజారోహణ (కొడి) నాడ కొడిముద్ద (ప్రసాదము) ను భుజించి సంతానవంతులైన స్త్రీలు కోకొల్లలు. ఈ సమయము నందే శ్రీ స్వామివారికి వల్లీ,దేవసేనలతో జరుగు కళ్యాణవేడుకలు చూడ ముచ్చటగ నుండును. శ్రీస్వామివారికి జరుగు కళ్యాణసమయముననే ఆలయ ప్రాంగణమున జాతి,మత, కులభేదములు లేక అనేకమంది యువతీయువకులు దంపతులగు చుండిరి. వీరికి శ్రీ వల్లీదేవసేనాసమేత శ్రీసుబ్రహ్మణ్యేశ్వర స్వామివారి శుభాశీస్సులు లభించి సుఖసంతోషములతో తమవైవాహిక జీవితమును గడుపుదురు.

ఈ దేవాలయమునందలి ఆకర్షణలలో శతస్థంభ కళ్యాణమంటపము ప్రధానమైనది. ఇందలి శిల్పకళావైభవము వర్ణనాతీతము. ఇది రథాకారమున నుండి చూపరులకు వింతగొల్పుచుండును. దీనికి అమర్చబడిన చక్రముల శిల్పకళా నైపుణ్యము అపురూపమైనది. దీనికి పూన్చబడిన అశ్వములు, గజములు, చూచువారలకు ఆనందోత్సాహములు కల్గించుచు భక్తజనులకు స్వాగతము పల్కుచున్నట్లుండును. దీనియందు ఇతిహాస, పురాణ, శాస్త్ర విషయములకు సంబంధించిన ముఖ్యఘట్టములను తెలియజేయు శిల్పములను చూచి ఆనందించ వలసినదేగాని, చదివి, విని తృప్తిజెందు విషయములుగావు. ఈ శిల్పకళ పాండ్య, చోళ, విజయనగర రాజుల శిల్పకళా సంప్రదాయములను పోలియుండుట వలన ఈ రాజ్యములను పాలించు రాజులందరికి ఈ దేవాలయ నిర్మాణము నందు జోక్యము వుండి యుండవచ్చునని భావించవచ్చును. ఈ శిల్పకళావైభవము శైవ, వైష్ణవ, మతసంప్రదాయములకు అతీతమై శివకేశవుల అభేదమును తెలియజేయు చున్నది.

మల్లాం గ్రామమున ప్రతి సంవత్సరం భాద్రపద శుద్ధ దశమి నుండి బ్రహ్మోత్సవములు ప్రారంభమగును. వీటిలో నందిసేవ, (కొర్లవుభయము) రథోత్సవం, కళ్యాణరాయబారం, కళ్యాణ తలంబ్రాలు, దోపు మున్నగునవి ముఖ్యమైనవి. ఈ తిరునాళ్ళ సంబరములను తిలకించుటకు ఆంధ్రప్రదేశ్, తమిళనాడు రాష్ట్రముల వివిధ ప్రాంతముల నుండి అశేషజనవాహిని తరలివచ్చు దృశ్యములు మహాదానంద కరములు.

**దేవాలయ వివరములు :-** శ్రీస్వామివారు స్వయంభువు. ఎవరును ప్రతిష్ఠించలేదు. చేతులులేని పుట్టు విగ్రహము దాదాపు రెండు అడుగుల ఎత్తున గర్భగుడిలో గలదు. దానికి కుడివైపున 6 అడుగుల ఎత్తున మూలవిరాట్టు శోభాయమానముగ ప్రకాశించుచుండును. శ్రీ నటరాజ స్వామి, శివకామ



సుందరుల కాంశ్యవిగ్రహములు పరిమాణమున పెద్దవై ఆకర్షణీయముగ నుండును.

ఆలయప్రాంగణమున శ్రీ వినాయకునిదే ప్రథమ దర్శనము. ఈ ఆలయము విశాలమైన ప్రదేశమున మధ్యలో నిర్మింపబడి యున్నది. చుట్టును గల గదులలో భారీఎత్తున పెద్దదైన వినాయక విగ్రహము చూడదగినది. కోమలేశ్వరుని శివలింగం- కామాక్షీదేవి గుడి, చండికేశ్వరుడు, నవగ్రహములు, కాలభైరవస్వామివార్ల సన్నిధులు విశేషములైనవి. ఎత్తైన ధ్వజస్తంభం, బలిపీఠం, మయూరశిల్పం వరుసలో ఒకదాని తర్వాత ఒకటి వుండి దేవాలయం మయూరాగమశాస్త్రం ప్రకారం నిర్మించబడిందని తెలియజేస్తాయి.

ఇది నెల్లూరు జిల్లాలో విజయవాడ-మదరాసు జాతీయ రహదారిపై నుండు నాయుడుపేటకు తూర్పుగా 30 కిలోమీటర్ల దూరమున బంగాళా ఖాతానికి 8 కిలోమీటర్లుకు ఇవతల గలదు. నెల్లూరు నుండి కోటమీదుగా మల్లాంకు బస్సులు గలవు. ఇచ్చటి పూజారులలో ఒకరు అర్చకులు, మరియొకరు వేదపారాయణం, మూడవవారు పరిచారకం. వీరు ముప్పురునూ ఆగమశాస్త్ర పండితులైన కారణంగా దేవాలయ కార్యక్రమములన్నింటిని సజావుగా నిర్వహించుచు, సర్వదోష నివారణలకు భక్తులకు సహాయపడుచున్నారు.

ఇటీవల కాలమున ఈ దేవాలయ ప్రాంగణమున శ్రీ కారంచేటి పార్వతీశం గురుకులం వారిచే జంటనాగుల ప్రతిష్ఠ జరుపబడినది. ఇంతగొప్ప దేవాలయం, శిల్పకళల కాణాచిగా ఈ గ్రామంలో వెలిసిందంటే మిక్కిలి ఆశ్చర్యకరమే. ఈ చుట్టుపట్ల ప్రాంతాలలో కొండలుగాని, రాతిగుట్టలుగానిలేవు. ఇంతపెద్ద రాతిస్థంభాలకు కావలసినరాళ్ళు, శిల్పాలకు ఎలా సేకరించారో, ఎలా తెచ్చారో అనూహ్యాము.

చోళ, పల్లవరాజుల కాలము ఈ దేవాలయానికి స్వర్ణయుగం, ఇట్టి పురాతన శిల్పకళ నిండి నిబిడీకృతమై యున్న దేవాలయాన్ని, స్వామివారిని దర్శించి, అనుగ్రహాన్ని పొందుతారని ఆశిద్దాం.

**శక్తిహస్తం విరూపాక్షం శిఖివాహం షఢాననం**
**దారుణం రిపురోగఘ్నం భావమే కుక్కుటధ్వయం ॥**

**(చిలుకూరు జయరామిరెడ్డి గారి సౌజన్యముతో)**

## 15. సుబ్రహ్మణ్యేశ్వరస్వామి - కొత్తపేట, ఇంద్రకీలాద్రి కొండమీద - విజయవాడ

మన భారతదేశములోను అత్యంత శ్రద్ధాభక్తులతో పూజించుచున్నారు. విజయవాడ, ఇంద్రకీలాద్రిపై భక్తాగ్రేసరులైన మా తండ్రిగారు శ్రీ యిద్దిపిల్లి గురువులుదాసు గారు నిత్యం స్నాన అనుష్ఠానములతో ఉదయం సూర్య నమస్కారములు చేయు చుండెడివారు. వారికి 1942సం॥లో ఒకనాటి ప్రాతః కాలమందు శ్రీ స్వామివారు సర్పముగా కనిపించి అంతర్ధానమాయెను. తదుపరి 6వరోజున రాత్రి స్వప్నములో శ్రీ సుబ్రహ్మణ్యేశ్వరస్వామి వారు “నాకు ఆలయ నిర్మాణము గావించి భక్తులందరకు తెలియపరచవలసినదిగా చెప్పియున్నారు. ఈ విషయమై కొంతమంది భక్తులకు తెలియపర్చగా వారు శ్రీ సుబ్రహ్మణ్యేశ్వర స్వామివారు దక్షిణ దేశమున ప్రసిద్ధి అని చెప్పగా వారు దక్షిణ దేశయాత్రకు వెళ్ళి శ్రీ సుబ్రహ్మణ్యేశ్వర స్వామివారి దేవస్థానములు చూచి తిరుత్తణిలో వేంచేసియున్న శ్రీ వల్లీ దేవసేనా సమేత శ్రీ సుబ్రహ్మణ్యేశ్వర స్వామివారి మాదిరి సంకల్పించుకొని యాత్ర నుండి వచ్చిన వెంటనే పని ప్రారంభించుచూ చుట్టూ ప్రాకారమునకై త్రవ్వుచుండగా ఒక గుహయందు శ్రీ బాల సుబ్రహ్మణ్యేశ్వర స్వామివారి విగ్రహము బయల్పడినది. 18-6-1945వ తేదీన వారు అకస్మాత్తుగా పరమపదించినారు. వారు పమపదం చేరబోయే ముందు తన జ్యేష్టకుమారుని నన్ను పిలిచి నీవు ఈ స్వామివారి సేవ నేను నా జీవితకాలంలో చేసిన దానికన్నను మిన్నగా యే అపచారములు లేకుండా అందరి అనువొద్దికతో నిత్యదీపారాధనలు, నైవేద్యములు పూజలు జరిపించుచు, దేవస్థానమును అభివృద్ధి చేయుచూ భక్తులైన వారికి తెలియపర్చుచూ ఉండవలసినదిగా ఆజ్ఞాపించిరి. నా తండ్రిగారి ఆదేశాను సారము గత 51 సం॥లు నుండి శ్రీ బాలసుబ్రహ్మణ్యేశ్వర స్వామి, శ్రీవల్లీ దేవసేనా సమేత శ్రీ సుబ్రహ్మణ్యేశ్వర స్వామివార్ల పూజలు అభివృద్ధి కార్యక్రమములు యధావిధిగా జరుగుచుండుటకు భక్తులు తమకు తోచిన రీతిగా సహాయము చేసి దోహదము గావించిన విషయము అందరికీ తెలిసినదే.

కంచి కామకోటి పీఠాధిపతులు శ్రీశ్రీశ్రీశ్రీ జయేంద్రసరస్వతి స్వామివారు ది. 24-2-1975న ఇడుంబన్, నెమలి మరియు బలిపీఠము, మాజేటి రామచంద్రరావుగారి ద్రవ్యసహాయముచే ప్రతిష్ఠ జరిపి దేవస్థానము యొక్క మెట్ల పునః నిర్మాణమునకు శంకుస్థాపన చేస్తూ కలియుగములో శ్రీ



సుబ్రహ్మణ్యేశ్వర స్వామి ప్రత్యక్షదైవమని ఆ స్వామిని ఆరాధించిన యెడల సమస్త దేవతలను ఆరాధించినట్లగుననియు 5 ప్రసిద్ధ క్షేత్రములు కొండమీద ఉన్నవి. ఆంధ్రప్రదేశ్‌లో విజయవాడలో ఇంద్రకీలాద్రిపై వెలసియున్న శ్రీ సుబ్రహ్మణ్యేశ్వర స్వామివారి దేవస్థానము 6వ క్షేత్రముగా పరిగణింపబడి అభివృద్ధి చెందునని, మీ తండ్రిగారు దేవస్థానము నిర్మాణము చేసిరి. నీవు రాజగోపురం, కళ్యాణ మంటపములు నిర్మించి, దేవస్థానము అభివృద్ధి పరచవలెనని చెప్పి మొదటి మెట్టుకి విరాళము ఇచ్చిరి. తన మొదటి మెట్టు దాటి పైకివచ్చు ప్రతి మెట్టు యొక్క దాతలు ఆయురారోగ్య ఐశ్వర్యవంతులగుదురు అనియు, వారికి శ్రీవారి ఆశీస్సులు ఎల్లప్పుడూ తోడుగా నుండుననియు పలికినారు. తదనంతరము దాతల విరాళములతో మెట్ల పునర్నిర్మా ణం పూర్తిగావించి ది. 24-10-76న కృష్ణాజిల్లా కలెక్టర్ శ్రీ యస్. సంతానంగారిచే ప్రారంభోత్సవము గావించబడినది. భక్తుల సౌకర్యార్థం మెట్ల ప్రారంభం నుండి దేవస్థానం చేరునంతలో 3 మంటపములు నిర్మింపతలచి కోరినంతనే మొదటి మండపమునకు తనశక్తి మేరకు విరాళమిచ్చి పూర్తిగావించిన దాత శ్రీ పువ్వుల వెంకట్రావుగారు; వారిచ్చిన ప్రోత్సాహము మేరకు ఇంకను 2 మంటపములు కట్టదలచియున్నాము. ఈ మూడు మంటపములపై భారతదేశంలోని శ్రీ సుబ్రహ్మణ్యే శ్వర స్వామివారి మహాక్షేత్రములుగా ప్రసిద్ధి చెందిన 6 క్షేత్రములు 1. పళని 2. తిరుత్తణి 3. తిరుచందూర్ 4. స్వామిమలై 5. తిరుప్పుర కుండ్రము 6. పలముదిర్ చోలై క్షేత్రముల విగ్రహములను చిత్రించి నిర్మించుటకు దేవస్థానమువారు నిర్ణయించి ఒక్కొక్క మంటపము నిర్మాణమునకు రూ. 40,000 ఖర్చుఅగునని అంచనా వేసియున్నారు.

ది. 30-3-1980వ తేదీన రాజగోపురం నిర్మాణం నిమిత్తం అప్పటి రోడ్లు, భవనాల శాఖామంత్రి శ్రీ కొణిజేటి రోశయ్యగారు శంకుస్థాపన చేసియున్నారు. ఇప్పటి వరకు సుమారు 30 లక్షల రూపాయల అభివృద్ధి కార్యక్రమములు జరిగి యున్నవి. ఇంకా సుమారు 50 లక్షల రూ॥ల అభివృద్ధి కార్యక్రమములు జరగవలసి యున్నది. దేవస్థానము అభివృద్ధికి శ్రీ సుబ్రహ్మణ్యే శ్వర స్వామి ఉత్సవ కమిటీ వారు తోడ్పడుతున్నారు. శ్రీ కుర్తాళం శంకరాచార్య జగద్గురు శ్రీశ్రీశ్రీశ్రీ చిదానంద భారతి స్వామివారు, శ్రీ శివతిరువలం శ్రీ పూండిస్వామి, శ్రీ రత్నగిరి స్వామి, శ్రీ కృపానంద వారియారు మొదలగు పెద్దల ఆశీర్వాదములతో అభివృద్ధి కార్యక్రమములు నిర్వహింప బడుచున్నవి. దక్షిణ దేశములో వున్న ఆరు క్షేత్రములవలె ఈ దేవస్థానము చాలా ప్రసిద్ధి చెందియున్నది.

సంతానము లేనివారు పూజించిన, వారికి సంతానం కలుగును. వివాహము కాని వారికి వివాహము జరుగును. పూజించిన భక్తులయొక్క మనోభీష్టములు నెరవేరుచున్నవి. భక్తులు ఇంకా ఎన్నో నిదర్శనములు దర్శించి యున్నారు.

భక్తుల సౌకర్యార్థమై శ్రీ సుబ్రహ్మణ్యేశ్వర స్వామివారికి కళ్యాణమంటప నిర్మాణము శ్రీ స్వామివారి ఆజ్ఞానుసారము ప్రారంభం అయినది. సుమారు 25 లక్షల రూపాయలు ఖర్చుఅగునని అంచనా వేసియున్నారు. కావున భక్తులు తమ శక్త్యానుసారం ధన, వస్తు రూపేణా విరివిగా విరాళములు యిచ్చి త్వరగా పూర్తిఅగుటకు ఈకార్యక్రమమునకు తోడ్పడవలసినదిగా మిక్కిలి కోరుచున్నాము.

శ్రీ సుబ్రహ్మణ్యేశ్వర స్వామివారి ఆశీస్సులు మీకు ఎల్లప్పుడూ ఉండుగాక!

**పూజా రుసుముల వివరములు**

| | | |
|---|---|---|
| 1. | జీవిత సభ్యత్వం నిత్యపూజ | రు. 2,116-00 |
| 2. | జీవిత కృత్తిక లేక శుద్ధ షష్ఠి | రు. 1,516-00 |
| 3. | జీవిత పూజా ఉభయము | రు. 1,516-00 |
| 4. | నిత్యపూజ (నిత్యము1సం॥నకు) | రు. 301-00 |
| 5. | కృత్తిక లేక శుద్ధషష్ఠి (సంవత్సరచందా) | రు. 201-00 |
| 6. | నిత్యపూజ ఒకరోజుకు | రు. 50-00 |
| 7. | కృత్తిక లేక శుద్ధ షష్ఠిపూజ ప్రతినెల | రు. 25-00 |
| 8. | 11 ద్రవ్యముల అభిషేకములు (1రోజుకు) | రు. 351-00 |

**గమనిక :** ఉభయదాతల పూజ సమయమునకు రాని యెడల వారి గోత్రనామములతో పూజ జరిపించి విభూది, కుంకుమ, ప్రసాదము పోస్టుద్వారా పంపబడును. చిరునామలో మార్పు ఉన్న యెడల వెంటనే తెలుపగలరు. ఫోన్ : 2561696. (0866) ఎమ్.ఓ.ద్వారా పైకము పంపువారు తమ పూర్తి చిరునామా స్పష్టముగా వ్రాసి పంపగలరు. పైపూజలు జరిపించ దలచినవారు దేవస్థానం అచ్చు రశీదు పొంద ప్రార్థన. దేవస్థానము రశీదు పొందని యెడల వారి గోత్రనామములో పూజ జరుప బడదు. పూర్తి వివరములు కావలసినవారు దేవస్థానమునందు సంప్రదించగలరు.

**దేవాలయం తెరచివుంచు వేళలు**

ఉదయం 6 గంటల నుండి మధ్యాహ్నం 12 గంటలవరకు, సాయంత్రం 5 గంటలనుండి రాత్రి 8 గంటలు వరకు



## 16. శ్రీ కుమార సుబ్రహ్మణేశ్వరుడు

**బిక్కవోలు మండలం, తూర్పుగోదావరి జిల్లా.**

ఆంధ్రప్రదేశ్‌లోని అతి ప్రాచీన పుణ్యక్షేత్రములలో బిక్కవోలు (రాజమండ్రి - కాకినాడ కెనాల్ రోడ్ ప్రక్కన) ఆలరారుతూ ఏటేటా జరుగు శ్రీ కుమార సుబ్రహ్మణ్యేశ్వర షష్ఠి ఉత్సవాల ద్వారా భక్తి కోటిని అలరిస్తోంది. చాళుక్యుల తరువాత కొండవీటి రెడ్లు తరువాత కాలగమనములో పెద్దాపురం, సంస్థానాధీశుల పాలనలో రాజా వత్సవాయి సూర్యనారాయణ తిమ్మజగపతి మహారాజు కాలంలో కుమార సుబ్రహ్మణ్యేశ్వరస్వామి వారి ఆలయం నిర్మించారు.

ఇక్కడ స్వామికి ఒక ప్రత్యేకత ఉంది. సంతానహీనులైన మహిళలు ఈ స్వామిని నమ్మకుంటే సంతానవంతులు అవుతారని విశ్వాసం. అందుకోసం షష్ఠి రోజున ప్రత్యేకంగా నేయించిన నాగులచీర ధరించి తెల్లవారు జామునుండే ఆలయ ప్రాంగణంలో సాష్టాంగ నమస్కారములు చేస్తూ పడుకుంటే స్వామి కలలో సాక్షాత్క రించి సంతానాన్ని ప్రసాదిస్తాడని ప్రతీతి. ఇప్పటికీ అనేక మంది మహిళలు ఇక్కడకు వచ్చి ఆ (పుత్రకామేష్టి) వ్రతం చేస్తారు. అందుకే ఈ స్వామికి సుబ్రమ్మణ్యేశ్వర షష్ఠి మహోత్సవము నాడు రాజులు ఆధ్వర్యంలోను, నేడు గ్రామస్థుల సహకారంతోను అత్యంత వైభవంగా జరుగుచున్నవి. ఎండోమెంట్స్ వారు కూడా ప్రత్యేక ఏర్పాట్లు చేయుచున్నారు.

ప్రతి మంగళవారం స్వామి వారికి ప్రత్యేక పూజలు, అభిషేకములు జరుగుతాయి. కృత్తికా నక్షత్రము రోజున, షష్ఠి మంగళవారం రోజున కుజదోషమున్న వారు స్వామి వారికి అర్చిస్తే ఋణబాధలు, మానసిక చికాకులు తొలగి శాంతి లభిస్తుంది. వీలైనవారు ప్రతి నెల అమావాస్య వెళ్లిన పాఢ్యమి నుండి షష్ఠి అయ్యే వరకు నియమముతో స్వామిని అర్చించి పూజలు జరిపించుకుంటే శుభములు చేకూరును. అనేక మంది భక్తులు దివ్యానుభవము. శ్రీ కుమార సుబ్రహ్మణ్యేశ్వర స్వామి వారి దివ్య మంగళ రూపము భక్తుల కోరికలను తీరుస్తూ ప్రతి సంవత్సరం భక్తకోటిని పెంచు కుంటూ మరో పళనిగా భాసిల్లుతోంది.

(డా॥ రామిరెడ్డి రామమోహనరావు సౌజన్యముతో)

## 17. తిరుమలలోని కుమారధార తీర్థం

శ్రీవారి ఆలయానికి ఉత్తరంగా ఆరు కిలోమీటర్ల దూరంలో వున్న పవిత్ర క్షేత్రాలలో కుమారధార తీర్థం ఒకటి. తారకాసురుని చంపిన కుమారస్వామి తనకు అంటిన బ్రహ్మహత్యాపాతకం నుంచి విముక్తి పొందటానికి ఈ తీర్థంలో స్నానమా చరించారని, అందుకే ఈ తీర్థానికి కుమారధార తీర్థం అని పేరొచ్చిందని తెలుస్తోంది. పాపవినాశనం వెళ్ళే దారిలో బస్సు దిగి కొంతదూరం నడిచి వెళ్తే కుమారధార తీర్థం చేరుకోవచ్చు.

## 18. పాపాల పరిహారకుడు, ఫలప్రదాత పంపనూరు శ్రీ సుబ్రహ్మణ్యేశ్వస్వామి

ఒక పల్లెటూరు. పేరు పంపనూరు. అనంతపురం జిల్లాలోనిది. పదేళ్ళ క్రితం చుట్టుపక్కలవాళ్ళకే తెలియని ఊరది. ఇప్పుడు సీమలోని మూడు జిల్లాలు మొదలు పంపనూరు వాసులకు గుర్తించడం, భగవంతుడు ఎక్కడ ఉంటాడో భక్తులు అక్కడకు చేరతారని ఇక్కడి క్షేత్రమ్ చెబుతుంది. కొలువై ఉన్న స్వామి సుబ్రహ్మణ్యస్వామి గర్భగుడిలోని స్వామివారి మూర్తి సప్తశిరస్సుల విగ్రహము. అనంతపురంనుండి కళ్యాణదుర్గం వెళ్ళేప్రదాన రహదారి ప్రక్కనే 20 కి.మీ. దూరంలో అతిచిన్న పల్లెటూరు. సుబ్రహ్మణ్యేశ్వరుని చలవతో ఆదశను అధిగమించే దిశగా భక్తుల రద్దీ, కానుకల సమర్పణ ఆలయవిస్తరణ పెంచుతున్నాయి. పదేళ్లకిందట గుడిలోని స్వామివారికి దీపం వెలిగించడమే చాలకష్టంగా ఉండేదట, ఇవ్వాళ పెళ్ళిళ్ళలకు అన్నదానములకు విశాలమైన మండపాలు వెలశాయి. ఇంచుమించు కోటి రూపాయలు అభివృద్ధికి ఈ దేవాలయం వెచ్చించగల భక్తాభిమానులను సుబ్రహ్మణ్యేశ్వరస్వామి సము పార్జించు కున్నాడు.

పదేళ్లలో ఎంత మార్పు, చూడముచ్చటగా రూపుదిద్దుకుంటుందీ క్షేత్రమ్. ఖచ్చితంగా ఇది స్వామి మహిమే. బాధలు తుడిచివేసిన స్వామిని మళ్ళీ మళ్ళీ చూడాలిన భక్తులు తపిస్తారు. అందుకు ప్రత్యక్ష నిదర్శనం పంపనూరు ఆలయం. ప్రతి ఆదివారం వేలల్లో భక్తుల సంఖ్య, అందరికి అన్నదానం, అంతశక్తిని స్వామివారు ఇస్తున్నారు. అని పంపనూరు శ్రీ సుబ్రహ్మణ్యేశ్వరస్వామి ఆలయ కమిటీ అధ్యక్షుడు 69 ఏళ్ళ ఇనుగూరు నాగభూషణం ఆనందాన్ని వ్యక్తం చేశారు. శ్రీ కృష్ణదేవరాయల కాలంనాడు ప్రతిష్ఠితమైన ఇక్కడి సుబ్రహ్మణ్యేశ్వర స్వామి మూర్తి ఐదు రూపాలలో కనిపిస్తుంది. ఈ రూపాలు అలంకారానికి ముందు చూడగలం. ఏకశిలా విగ్రహమిది. 1. గణపతి 2. శివలింగం 3. శిఖివాహనం (నెమలి) 4. ఏక పడగ-సప్త శిరస్సులు 5. సప్త శిరస్సాసనం ఒకేమూర్తిలో స్వామివారు ఇలా ఐదు విధాలా దర్శనం ఇవ్వడం విశేషం.



ఈ మూర్తిని పూజిస్తే కుజదోషం, రాహు-కేతువు కాలసర్ప దోషాలు దూరం, పిల్లలకోసం పరితపించే దంపతులకు ఫలసిద్ధి. వ్యాపారులు, ఉద్యోగులకు వృత్తి క్రమంలో వృద్ధి. వివాహం కానివారికి కళ్యాణప్రాప్తిరస్తు. అనారోగ్య పీడితులు కోలు కుంటారు. ఇక్కడకు ఒకసారి వచ్చి వెళ్ళిన భక్తులు పునర్దర్శనానికి రావడం జరుగుతోంది. అంటే వాళ్లు బాధల్లోంచి బయట పడుతున్నారనే కదా అర్థం.

ఈ స్వామిని దర్శించే భక్తుల సంఖ్య ఆదివారాల్లో అధికం. తొమ్మిది వారాలు వరసగా పంపనూరు సుబ్రహ్మణ్యేశ్వరస్వామిని దర్శించి, పూజిస్తే కష్టాలు క్రమేపీ కరిగిపోతాయని భక్తుల నమ్మిక. మనశ్శాంతికి కొదవ ఉండదు. పుత్రపౌత్రాదులు కలుగుతాయి. ఆర్థికంగా బావుంటారు. ఆదివారం రోజున సామూహిక జపవిధానం ఉంటుంది. ఇతర భక్తులతో కలిసి భక్తిశ్రద్ధలతో జపాదులు చేయాలి. స్వామివారి అనుగ్రహం భాగ్యం తప్పకుండా లభిస్తుంది. పంపనూరులో ఆధ్యాత్మిక భావతరంగాలు వీస్తున్నాయి. పంపనూరు సుబ్రహ్మణ్యేశ్వరస్వామి స్థలి శైవక్షేత్రమ్. దీనికి ఎగువ ఎత్తయిన కొండపై వైష్ణవాలయం. లక్ష్మీ సహిత నరసింహుడు. ఇది పురాతనమైనది. ఇప్పుడిప్పుడే అభివృద్ధి దిశగా చూపుసారిస్తోంది. ఈ గుడి నిర్వహణ ప్రభుత్వానిది. శైవ, వైష్ణవ క్షేత్రాల కూడలిగా పంపనూరు ప్రకాశిస్తోంది.

శ్రీ సుబ్రహ్మణ్యేశ్వర స్వామి గుడి ఒకప్పుడు దేవాదాశాఖ ఆధీనంలోనిదే. కనీస పూజలకు అరకొర నిధులు, ఇవ్వాళ డబ్బు దానంతటదే స్వామివారి ప్రాభవ ఉద్ధరణకు సమకూరుతోంది. చాలా ఏళ్ళక్రితం అనంతరపరంలోని నూనెమిల్లు వ్యాపారస్తుడు ఇనుగూరు నాగభూషణం దగ్గరకు ఆలయ కర్తలను శ్రీ సుబ్రహ్మణ్యేశ్వర స్వామిపంపాడు. మార్గశిర శుద్ధ షష్ఠి పూజల ఖర్చుకు కావలసిన ధనాన్ని అర్థించారు. అప్పటికి పంపనూరు గుడి గురించి వినడమే గానీ చూడలేదు. ఇనుగూరు నాగ భూషణం, ఆలయకర్తల అభ్యర్థనను గౌరవించారాయన. అయితే ఒక నిబంధన అన్నారు. ఈ ఒక్క ఏడాదే కాదు నేను బతికున్నంతకాలం ప్రతి ఏటా మార్గశిర శుద్ధషష్ఠి పూజకు ఎంత ఖర్చయినా భరిస్తాను. ఆ భాధ్యత నాకు మాత్రమే పరిమితం కావాలి అన్నారు నాగభూషణం. స్వామివారి పూజాదికాలకై రోజు ఇబ్బంది పడుతోన్న ఆలయ అర్చకులకు, నాగభూషం మాటల్లో సుబ్రహ్మణ్యేశ్వరుడు కనిపించాడు. ఆనందంతో అంతకంటే కావలసినది ఏముంటుంది. అని మాట ఇచ్చారు. అప్పటి నుండి స్వామికి మార్గశిర శుద్ధ షష్ఠి పూజ ఆయన పేరుమీదనే. ఒకప్పుడు శిథిలస్థితిలో వుండేది పంపనూరు సుబ్రహ్మణ్యేశ్వర స్వామిగుడి. వ్యాపారపరంగా వృద్ధిచెందాడు

నాగభూషణం, ఆలయ ఉద్ధరణ సంకల్పాన్ని ఇనుగూరు మనసులో మొలకెత్తించాడు సుబ్రహ్మణ్యస్వామి. స్థానిక ఆర్యవైశ్య సంఘంద్వారా దేవాదాయ శాఖను సంప్రదించాడు నాగభూషణం, గుడిని బాగుచేసే బరువు నెత్తికెత్తుకున్నాడు. సహ వ్యాపారస్థులతో ఒక కమిటీని ఏర్పాటుచేశాడు. ఆలయ కమిటీ అధ్యక్షు హోదాలో ఇనుగూరు నాగభూషణం ముందుకు అడుగువేశాడు. 1998లో కొత్తకట్టడాలు మొదలెట్టారు. 2002 ఫిబ్రవరి 23న, శ్రీగణపతి సచ్చిదానంద స్వామి చేతులమీదుగా పూజలు, యజ్ఞాలు జరిపారు. నిర్మాణం పూర్తయిన భోజనశాల, కళ్యాణ మండపాన్ని సచ్చిదానంద ఆవిష్కరించారు. ఇది మేము చేసినది కాదు. భగవంతుడే భక్తుల సౌకర్యార్థం ఏర్పాటు చేశాడు. అంటోన్న నాగభూషణం మాటల్లో భక్తితత్త్వం స్ఫుటీకరించింది. వ్యక్తిగతంగానూ, కుటుంబపరంగా మాకు ఏరోజున ఎలాంటి కష్టం రాలేదన్నారు. కోరినవన్నీ సుబ్రహ్మణ్యేశ్వరుడు ఇచ్చారని నాగభూషనం సంతృప్తి చెందాడు. దాతల విరాళాలు, భక్తుల కానుకలు, ఆలయ వృద్ధికి ఇప్పటికి ఏభై లక్షలకు పైనే సమకూర్చాయి. ప్రస్తుతం లక్షల బడ్జెట్‌ని కొత్తపనులకు కేటాయించారు. ఈ డబ్బుతో ఆలయముఖ ద్వారం, వేలల్లో ప్రాకారం, భోజనశాల కట్టడాలకు పార్లమెంట్ సభ్యుడు అనంత వెంకట రామిరెడ్డి, ఆత్మకూరు మండలం మాజీ అధ్యక్షుడు తోపుదుర్తి భాస్కరరెడ్డి, శాసనసభ్యుడు శైలజానాథ్‌ల చేత శంకుస్థాపన ఇటీవలే చేయించారు. ఒక్క ఆదివారం రోజునే 10 వేల మంది భక్తులకు అన్నదానం చేస్తారు. అందుకే ఈ గుడికి శ్రీ సుబ్రహ్మణ్యేశ్వస్వామి అన్నదాన సమితి అని పేరు పెట్టారు.

నానాటికి అధికమవుతోన్న భక్తుల గురించి నాగభూషనం చెబుతూ ఆపదల్లో ఆదుకునే దేవుడు సుబ్రహ్మణ్యస్వామి అన్నారు. సుబ్రహ్మణ్యేశ్వరస్వామి ప్రక్కనే వేరు వేరుగా శివునికి (లింగం)ని, గౌరిని ప్రతిష్టించారు. ఈ మూడు మందిరాలు వరసగా ఉన్నాయి. అర్చకులు సంకేపల్లి కృష్ణశాస్త్రి జయరామశర్మ శాస్త్రోక్తంగా భక్తుల తరపున స్వామివారికి పూజలు జరపుతుంటారు. కష్టాలు, దోషాలూ మనల్ని వెంటాడుతూనే ఉంటాయి. కాపాడగలిగే శక్తిసమన్వితుడు పంపనూరు సుబ్రహ్మణ్యేశ్వరుడు. స్వామిని దర్శించి వేడుకుండే విముక్తి తప్పక లభిస్తుంది.

ఈ ఆలయానికి వెళ్లాలి అనుకునే భక్తులు ముందుగా అనంతపురం పట్టణానికి చేరుకోవాలి. అక్కడి నుండి కళ్యాణదుర్గంకు వెళ్ళే బస్సులో పంపనూరుకు అర్థగంట ప్రయాణం. వీలుచూసుకుని శ్రీ సుబ్రహ్మణ్యేశ్వర స్వామిని దర్శించుకు రండి. ఫలసిద్ధి రస్తు. వివరాలకు : పంపనూరు, శ్రీ సుబ్రహ్మణ్యేశ్వర క్షేత్రమ్, ఫోన్ : (08554) 250688

# తమిళనాడు సుబ్రహ్మణ్య క్షేత్రములు



## ఆరుపడవీడు



మనఃపూర్వకంగా శ్రీ సుబ్రహ్మణ్యస్వామికి నమస్కారంచేస్తే త్రిశక్తులతో కూడిన త్రిమూర్తులకు నమస్కారంచేసినట్లే. ఎందుకంటే శ్రీ సుబ్రహ్మణ్యుడు ఆరుశక్తులతో కూడినవాడు. అంతేకాదు ఈ స్వామిని అర్చిస్తే అగ్నిదేవునికూడా అర్చించినట్లేనని స్వామివారి మాహాత్మ్యాన్నీ నామౌన్నత్యాన్నీ స్కందపురాణం చక్కగా వివరిస్తోంది. ఆయన జ్ఞానశక్త్యాత్ముడు, స్కందుడు, అగ్నిగర్భుడు, శరవణోద్భవుడు, కార్తికేయుడు, కుమారస్వామి, షణ్ముఖుడు, శివతేజుడు, శిఖివాహనుడు తదితర నామాలతో భక్తకోటి స్తోత్రాలందుకుంటున్నాడు. బాలసుబ్రహ్మణ్యుడు, షణ్ముఖసుబ్రహ్మణ్యుడు, వల్లీదేవసేనా సమేతుడు ఇలా అనేక రూపాలలో ఆ స్వామి మనకు దర్శనమిస్తారు. సర్పరూపంలో స్వామిని ఆరాధిస్తారు. స్వామి పరమ దయాళువు. కరుణామూర్తి. వంశవృద్ధికరుడు, వల్లీదేవసేనా సమేతుడైన ఆ స్వామి చక్కని దాంపత్యజీవితాన్ని ప్రసాదించే అమృత మూర్తి. ఆయన పరబ్రహ్మస్వరూపుడు.

పరమపురుషుడు విష్ణువు, లేదా శివుడు, అవ్యక్త శక్తి లక్ష్మి లేదా ఉమాదేవి వీరిరువురి సమైక్య సమన్వయ తత్త్వమూర్తి కుమారస్వామి అని స్కందపురాణం స్పష్టంచేస్తున్నది. అంటే కుమారస్వామిని అర్చిస్తే శివశక్తుల్నీ, లక్ష్మీనారాయణుల్నీ కలిసి అర్చించినట్లే. ప్రకృతి పురుషుల ఏకత్వం కుమారస్వామి తత్త్వం. షట్కోణ యంత్రమే షణ్ముఖతత్వానికి ప్రతీక. శివతేజం స్కన్నమై వచ్చి రూపుకట్టిన దైవం కనుక ఆయన స్కందుడు అయినాడు. శ్రీసుబ్రహ్మణ్యస్వామి జ్ఞాన స్వరూపుడు. జ్ఞానశక్తికి మూర్తిమత్వం సుబ్రహ్మణ్యతత్త్వం. సునిశితమైన

మేధాశక్తికి ప్రతీక ఆయన చేతిలో శక్తిహస్తం. అంటే బల్లెం అన్నమాట. శివజ్ఞాన ప్రదాయిని అయిన అమ్మవారు ప్రసాదించిన దివ్యాయుధం అది. అదే అజ్ఞానమనే తారకాసురుని సంహరించిన జ్ఞానశక్త్యాయుధం. అందుకనే జ్ఞానశక్త్యాత్మా అనే నామంతో ఆయనను స్తుతిస్తారు. అలాగే ఇచ్ఛాజ్ఞానక్రియా శక్తులను ధరించిన పరమోన్నత శక్తిమంతుడాయన. శ్రీసుబ్రహ్మణ్యస్వామి షట్కోణయంత్రస్థితుడు. రెండు త్రికోణాల కలయికే శివశక్త్యాత్మకం. అలా ఏర్పడిందే షట్కోణం. ఈ షట్కోణంలోని ఆరుకోణాలు షణ్ముఖాలకు చిహ్నాలు. శివతత్త్వానికీ శక్తితత్వానికీ కుమారస్వామి దృశ్యరూపం కనుక ఆయన "శక్తిధరుడ"యినాడు. అంతేకాక ఈ షట్కోణం బహుముఖీనమైన శక్తులకూ ప్రజ్ఞాపాటవాలకూ నిలయం, కనుక శ్రీసుబ్రహ్మణ్యుడు కవిత్వానికీ, ప్రజ్ఞకూ సృజనాత్మకతకూ అధినాయకుడయినాడు. అందుకే **శ్రీ సుబ్రహ్మణ్యాయ నమః**

తమిళనాడులోని ఆరు పుణ్యక్షేత్రాలో శ్రీ సుబ్రహ్మణ్యస్వామి ఆలయాలు ప్రసిద్ధి చెందాయి. ఈ ఆలయాల్లో స్వామివారు భక్తకోటి నుంచి నిత్యం ఘనమైన పూజలందుకుంటున్నారు. ఆ క్షేత్రాలేవంటే 1 పళై మధురచూలై 2. తిరుత్తణి 3. స్వామిమలై 4. తిర్పుపురకుంద్రా. సృష్టిగతమైన శక్తికి కుమారస్వామి వారే హేతువని స్కాంధపురాణం చెబుతోంది. సమస్త అవరోధాలనూ గణపతి తొలగిస్తే అభీష్టాలను నెరవేర్చే శక్తిని సుబ్రహ్మణ్యేశ్వరస్వామివారు ప్రసాదిస్తారు. ఆరుముఖాలతో ముల్లోకాలను ఆశ్చర్యపరిచే శక్తిసామర్థ్యాలున్న కుమారస్వామి ప్రస్తావన ఎక్కువగా స్కంధసంహిత, స్కాంధపురాణాలలోనే దర్శనమిస్తుంది.

సుబ్రహ్మణ్యుని మనసారా సంభావించిన వారికి చిత్తశుద్ధికలిగి తమోగుణం దూరమై జీవనయానంలో మహాంధకారాలు ఛేదించబడి స్కంధకాంతి ఆవిష్కృతమవు తుందని నారదుడు చెప్పడం శివమహాపురాణంలో కనిపిస్తుంది.

ఒకచేతిలో మహాశక్తి ఒక చేతిలో ప్రకాశవంతమైన వజ్రాయుధం. ఇంకొక చేతిని కటిపై ఉంచి మరొక హస్తాన్ని అభయహస్తం దాల్చి వుంటాడు సుబ్రహ్మణ్యస్వామి. నక్కీరుడు అనే మహాకవి మొట్టమొదటిగా సుబ్రహ్మణ్య క్షేత్రాలలో అవి ముఖ్యమైన ఆరు క్షేత్రాలను గురించి ప్రశంసించినది. ఇతను సుబ్రహ్మణ్యుని విజయాలను గురించి అనేక విధాలుగా కీర్తించాడు. నిరక్ష్య రాస్యుడైన మహాభక్తుడు అరుణగిరి నాధుడుకి స్వామి దర్శనమివ్వగా పరవశంతో సుబ్రహ్మణ్య దైవశక్తిని స్వామి నెలకొని వున్న పుణ్య స్థలాన్ని స్తుతించగా వెంటనే అరుణగిరి నాధునికి ఉన్న కుష్టువ్యాధి నయమై కొన్ని శక్తులు సిద్ధులు సిద్ధించాయి. ఈ స్తుతి కావ్యమే "తిరుపుగళ్" అనే నామముతో ప్రసిద్ధి చెందినది.



## 1. తిరుపుర కుండ్రం

1. కొండమీద కుమారస్వామి దేవసేనను వివాహం చేసుకొన్న పవిత్రమైన పుణ్యక్షేత్రము.
2. మధురై పుణ్యక్షేత్రమునకు 10 కి.మీ.దూరములో కలదు.
3. ఈ ఆలయములో 48 స్తంభాలతో ప్రాంగణముతో 1050 అడుగుల ఎత్తుగల కొండపై వున్నది.
4. ఇంద్రుని కోరికమేరకు తన కుమార్తె దేవసేనను వివాహమాడిన ప్రదేశము. ఫాల్గుణమాస ఉత్తరదినాన ఈ క్షేత్రములో వైభవముగా ఉత్సవాలు చేస్తారు.
5. ఇచ్చట స్వామి వారికి గాక ఆయన ఆయుధమైన వేల్ అనేబడే శూలకారపు ఆయుధమునకు అభిషేకము జరుగును.
6. శ్రీ సుబ్రహ్మణ్యస్వామి వారికిగల ఏకైక గుహాలయం స్వామివారు కార్తికేయన్, దేవయాని.
7. నక్కీరుడు తన విజయాలలో మొట్ట మొదటిగా పేర్కొన్న క్షేత్రము. నక్కీరుని ఒక భూతంనుండి కాపాడుటయేకాక అతనిచర్మవ్యాధుని నయంచేసిన క్షేత్రం.
8. ఇచ్చట పరాశరుని ఆరుగురు కుమారులు మత్స్యరూపం నుండి స్వామి అనుగ్రహం వల్ల శాపవిముక్తులైనారు.
9. స్థలపురాణం ప్రకాశం శూరపద్ముడు, అతని రాక్షసగణాలను సంహరించిన అనంతరం స్వామి దేవతలతో కలిసి తిరుచందూర్ నుండి తిరుపుర కుండ్రం చేరినారు.

10. కొండ శివలింగాకృతిలో వుండుటవలన "శివమలై" అనిపిలుస్తారు. ఈ కొండపై సుబ్రహ్మణ్యుడు కళ్యాణ రూపములో దర్శనమిస్తాడు.

11. పంచ పాండవులు అరణ్యవాసములో పడుకున్న గుహలు వున్నాయి. కొండపైన కాశీవిశ్వేశ్వరాలయం ప్రక్కనే సరస్సు ఉన్నాయి.

12. కొండపైన వున్న సరస్సును స్వామి తన శక్తి బల్లెంలో సృష్ఠించాడు కనుక ఈ నీరు ఎన్నటికి ఎండదు. నీరు గంగానదికి సమానమైనది.

13. దీనికి సమీపములో లక్ష్మీతీర్థం, బ్రహ్మతీర్థం వున్నాయి. లక్ష్మీతీర్థం సమీపములో గణపతి ఆలయం వున్నది.

14. లక్ష్మి తీర్థంలో ఉప్పు మిరపకాయలువేసి మొక్కుకుంటే ఎటువంటి చర్మవ్యాధులు నయము కాగలవు.

15. బ్రహ్మతీర్థంలో స్నానం చేస్తే చక్కెరవ్యాధి నయం కాగలదు ఎందుకనగా అని బ్రహ్మదేవునిచే సృష్ఠించబడినది.





## 2. పళని

1. మధురై పుణ్యక్షేత్రమునకు 120 కి.మీ. దూరములో వున్నది.
2. ఈ స్వామివారికి కదంబ పువ్వులు అంటే చాలా యిష్టం.
3. ఇచ్చట స్వామివారు అభిషేకప్రియుడు. కోట్లాది అభిషేకములు జరిగినా, జరుగుతూవున్న అరగని తరగని చిన్న విగ్రహం స్వామివారిది.



4. షణ్ముఖ నదీతీరమున శివగిరి కొండమీద ఖనిజాలతో తయారైన విగ్రహరూపం స్వామివారిది.
5. ఇక్కడే నక్కనార్ అనే భక్తుడు జన్మించెను.
6. ఔషధ మొక్కలతో తయారుకాబడిన విగ్రహము. ఇచ్చట దండాయుధపాణి వున్నవాడు.
7. కోయంబత్తూరుకు 105 కి.మీ. దూరములో వున్నది. కొడైకెనాల్‌కు 30 కి.మీ. దూరములో వున్నది.
8. అలంకరణలు తీసివేసి విగ్రహానికి అభిషేకములు చేయుదురు. అభిషేక జలము ఔషధముగా వాడుదురు.
9. 9 రకముల ఖనిజధాతువులతో (పాషాణములతో) తయారు కాబడిన విగ్రహము. అభిషేకంచేసిన వాటిలో ఔషధ గుణాలు కన్పడ్తాయట.
10. స్వామివారికి కావడి ఉత్సవములు ప్రత్యేకత, తేనె, పంచదార, పాలు, అరటిపండ్లు గుజ్జులతో అభిషేకములు జరుగును. అభిషేక జలముతో బొల్లి ఆస్మా వ్యాధులు నివారణమగును.
11. కొండపైనున్న ఆలయమునకు వెళ్లుటకు దిగుటకు వించ్ ఏర్పాటు కలదు. ఓపిక వున్నవారు ఎక్కుటకు మెట్లు కూడ కలవు.
12. ఈ మధ్యనే దేవస్థానం వారు రోప్ వే కూడ ఏర్పాటుచేసియున్నారు.
13. మొట్టమొదటిసారిగా బిడ్డకుపాలు స్వామివారి కెదురుగా యిచ్చునట్లు మొక్కుబడి ఉన్న ఆలయము.





## తిరుచందూర్

1. ఈ ఆలయం వెయ్యి సం॥ క్రితం నిర్మించినది. పాండ్యరాజుల నుండి ప్రసిద్ధి చెందిన పుణ్యక్షేత్రము.
2. విష్ణుమూర్తి శనీశ్వరస్వామి సమేతముగా సముద్రతీరాన వెలసిన సుబ్రహ్మణ్య క్షేత్రము.
3. ఈ క్షేత్రము కన్యాకుమారికి 100కి.మీ. దూరములో కలదు. మరియు తిరునల్వేలి నుండి 48 కి.మీ. దూరములో ఉన్నది.
4. బధిరులకు కరుణించి మాటలు ప్రసాదించు స్వామిగా ప్రసిద్ధి చెందినారు.
5. ఇచ్చట స్వామివారు ఒకచేతిలో జపమాల మరొక చేతిలో పుష్పమును ధరించి వుంటారు.
6. ఇక్కడ కొబ్బరికాయను పూర్తిగా పీచు తీసి వేసికొట్టాలి.
7. ఇక్కడ గల ఆలయంలో 24 బావులున్నాయి. ఇందులో "నాలికణర్" బావిలో తీర్థము తియ్యగా వుంటుంది. మిగతా బావులన్నింట ఉప్పునీరే. శ్రీ మురుగర్ కోవెలలో ప్రధానమైన వాటిలో యిది ఒకటి.
8. భస్మము, గంధము ఆకులలో పెట్టి ప్రసాదముగా ఇస్తారు.
9. దేవాలయం సముద్రతీరము ఇసుకలో కాళ్ళకాలకుండా ప్రయాణించుటకు సిమెంటు రోడ్డు పైన రేకులషెడ్డు ఆలయం వరకు వున్నది.
10. శనీశ్వరుని విగ్రహం కల ఏకైక సుబ్రహ్మణ్యస్వామి ఆలయం.
11. సముద్రమునకు అతి దగ్గరగల ఆలయానికి ప్రక్కనే మంచి నీరుగల ఆలయము. యాత్రికులందరూ స్నానము చేయుటకు పనికి వస్తుంది. నీరు ఎంత వాడినను తరగదు.
12. రహస్య దీపారాధన జరుగు ఆలయం. తెరవెనుక ఉన్న షణ్ముఖునికి ముందుగా పూజచేసి తరువాత తెరముందు వున్న సుబ్రహ్మణ్యస్వామిపూజ.
13. 45 రోజులు స్వామివారిని పూజించిన మాటలు వచ్చును. పూర్వము ఒక భక్తునికి 45 రోజులు పూజలు జరిగిన తరువాత మాటలు వచ్చి మహాకవి అయ్యెను.
14. జగద్గురు ఆదిశంకరాచార్యులు వారు ఈ క్షేత్రాన్ని దర్శించి స్వామిని సాక్షాత్కరింప జేసుకొని సుబ్రహ్మణ్యభుజంగ స్తోత్రాన్ని రచించాడు. ఇది అత్యంత మహిమాన్వితమైనది. దీని పఠనంవల్ల సర్వవ్యాధులు నశించి శాంతి చేకూరు తుంది.
15. స్కంధషష్ఠి పర్వదినమున భక్తులు ఈ క్షేత్రములో ఆరురోజులు వ్రతం ఆచరించి సుబ్రహ్మణ్యుని అనుగ్రహం పొందుతారు.
16. శూరపద్ముడు అనే రాక్షసుని వధానాంతరం స్వామి తిరుచెందూరులో కొలువై నారు.





## స్వామిమలై

1. ఈ క్షేత్రము కుంభకోణంకు 10 కి.మీ. దూరములోవున్నది.
2. ఇచ్చట స్వామి గురునాధుడుగా శివునకు ప్రణవరహస్యమును చెప్పినట్లుగా వున్న క్షేత్రము.
3. స్కంధునిచే బంధింపబడిన బ్రహ్మ తండ్రి కోరికమేరకు బంధవిముక్తుడు అయినాడు.
4. తరువాత శివుడే స్వయంగా ప్రణవరహస్యం తెలుసుకోవడానికి సుబ్రహ్మణ్యుని ఆశ్రయించగా స్వామి తండ్రికే గురువై అతడి చెవిలో రహస్యాన్ని బోధించాడు.
5. అందువల్ల స్వామికి "స్వామినాధుడు", శివగురునాధుడు అని పేర్లు వున్నాయి.
6. ఇక్కడ మూడు ప్రాకారాలు, చుట్టూ అనేక దేవాలయములు ఉన్నాయి. తూర్పు ప్రాకారంలో వజ్రతీర్థం అనేతీర్థం ఉన్నది. ఇందులో నీటితోనే స్వామివారికి నిత్యాభిషేకం చేస్తారు. ఈ తీర్థంలో స్నానంచేసినవారికి పుత్రభాగ్యం కలుగుతుంది.
7. ఈ దేవాలయానికి వున్న అరవై మెట్లు అరవై సంవత్సరాల పేర్లని, అరవై దేవతలని సూచిస్తాయి.



8. ఇక్కడ ఇంద్రుడు సుబ్రహ్మణ్యస్వామికై తపస్సుచేసి కోల్పోయిన సర్వశక్తులూ పొంది తన ఐరావతాన్ని స్కందునికి బహూకరించినారు. అందువల్ల ఉత్సవ సమయాల్లో స్వామిని ఐరావతముపై ఊరేగిస్తారు.
9. ఇక్కడ అధిక సంఖ్యలో వివాహాలు జరుగుతాయి. ఇక్కడ వెలసిన స్వామినాధుడు పుత్రభాగ్యాన్ని ప్రసాదిస్తాడు.
10. ఇక్కడ జరుపబడే ఉత్సావాల్లో కార్తీక దీపం అతి ప్రాచుర్యమైనది.



## పఝు ముదిరసోలై

1. ఇచ్చట స్వామివారు చిన్న కొండపై బాల సుబ్రహ్మణ్యముగా భక్తులు కొలుస్తారు.
2. మధురై పుణ్యక్షేత్రమునకు తూర్పుదిశగా 15కి.మీ. దూరములో వున్నది.
3. దీనిని అళగర్‌కోయల్ (అందమైనవానికోవెల) అని అంటారు.
4. పళముదిర్‌చోళై అనగా పళ్ళతోట అని అర్థం.
5. ఇక్కడ సుబ్రహ్మణ్యుడు వల్లీదేవసేనలతో అనుగ్రహిస్తూ వుంటాడు.
6. అవ్వయార్ (భక్తురాలు) నాగపళ్ళు(నేరేడు) అని దాని మూలముగా జ్ఞాన తత్వాన్ని పొందిన కారణముగా దీనికి పళముదిర్‌చోళై అనిపేరు వచ్చినది.

7. కుమారస్వామి అర్చిస్తే శివశక్తుల్ని, లక్ష్మీనారాయణుల్ని కలిపి అర్చించినట్లే అని ప్రతీతి.

8. అవ్వయార్ మధురై వెళ్లుతూ సేదతీరడానికి నేరేడు చెట్టు క్రింద నిలబడగా ఆకలివేసినది. స్వామి గోవులకాపరి వేషంలో అటువైపు వస్తూ నీకు పళ్లు కావాలా వేడినా? చల్లనివా? అని అడిగినారు.

9. అవ్వయార్ వేడిపళ్లు ఇమ్మని కోరగా సుబ్రహ్మణ్యుడు చెట్టు పట్టుకొని ఊపగా ఆమెక్రింద పడిన పళ్ళని అందుకున్న మట్టి ఊదుకుంటూండగా ఏమిఅవ్వా పళ్లుఅంతగా కాలుతున్నాయా అనిఅడుగగా అవ్వయార్ తనకి అన్నితెలుసు అన్న అహంకారాన్ని పోగొట్టిన బాలుడు ఎవరుఅని ఆశ్చర్యము పొందగాబాలుడు సుబ్రహ్మణ్యస్వామి రూపంలో దర్శనమిచ్చాడు.

10. అవ్వయార్ అనేక విధములుగా కీర్తించగా స్వామి అవ్వ ప్రతిజీవి ప్రపంచములో మట్టి అనే బంధము వదిలేస్తేగాని పరమాత్ముని దర్శించ గలరు అని జ్ఞానబోధ చేస్తారు.



## తిరుత్తణి

1. ఈ క్షేత్రం తిరుపతి చెన్నై - రేణిగుంట మార్గములో వున్నది.

2. ఇచ్చట స్వామి వల్లీదేవసేనాసమేతముగా వెలిసియున్నారు.

3. స్వామి వారికి చందనము సమర్పించి భక్తులకు శ్రీపాదరేణువుగా ప్రసాదాన్ని అందజేస్తారు. సర్వవ్యాధి నిర్మూలనము అని నమ్మకము.



4. చెన్నై నుండి 80కి.మీ. దూరములో ఈ క్షేత్రము కలదు.

5. ఇచ్చట స్వామివారు కార్తికేయన్‌గా ప్రసిద్ధి చెందినారు.

6. అరక్కోణం నుండి 13 కి.మీ.దూరములో వున్నది. తిరుపతి నుండి 62 కి.మీ. దూరము కంచి నుండి 42 కి.మీ. దూరము

7. ఈ దేవస్థానములో పెద్దగంధపు సానవున్నది. ఎడమ చేతివైపు వైష్ణవి, దుర్గ విగ్రహములు వున్నవి.

8. ఈ క్షేత్రములో స్వామి వేటగాళ్ళ కులానికి సంబంధించిన వల్లీదేవిని వివాహమాడి కొలువుదీరాడు.

9. ఈ క్షేత్రానికి "తనికమల" "పూర్ణగిరి" సేరుత్తణి తనికాచలం అనే నామాలు వున్నాయి.

10. తిరుత్తణి కొండ నాలుగువందల అడుగుల ఎత్తున వున్నది. కొండపైకి వెళ్లడానికి 365మెట్లు, నాలుగు ప్రాకారాలు వున్నాయి.

11. ఇచ్చట "ఆడికృత్తిక" అత్యంత వైభవముగా జరుపబడుతుంది. ఇది కాక ప్రతి సం॥ డిసెంబర్ 31వతేదీన జరిగే మెట్లపూజ చూడదగినది.

12. నాలుగు ప్రాకారాల్లో విష్ణుతీర్థం, నాగతీర్థం, బ్రహ్మతీర్థం ఉన్నాయి. సకల దేవతా సన్నిధులు వున్నాయి.

13. గర్భ గృహములో స్వామి దండాయుధపాణిగా వేలాధాయున్ని ధరించి దర్శన మిస్తాడు. కుడిచేతిని తొడపైన పెట్టుకొని ఎడమచేతితో జ్ఞానశక్తి ఆయుధముతో దర్శనమిస్తారు.

14. తిరుపతికి సమీపములో వున్న అత్యంత సుందరమైన సుబ్రహ్మణ్యక్షేత్రము.



## 2. ఆరు సుబ్రహ్మణ్యేశ్వర దేవాలయాల యాత్ర విశేషాలు

వినాయకుడు విఘ్నేశ్వరుడిగా దేశప్రజలందరి పూజలు అందుకుంటున్నాడు. ఆయన సోదరుడు సుబ్రహ్మణ్యేశ్వరుని దక్షిణాదిన ముఖ్యంగా తమిళనాట విశేషంగా పూజిస్తారు. దర్శనమాత్రంతో సర్వదోషాలను పోగొట్టే దేవుడిగా ఆయన్ని కొనియాడ తారు. శివుని త్రినేత్రంలో నుండి పుట్టినవాడు సుబ్రహ్మణ్యేశ్వరుడు. ఆయన్నే కార్తికేయుడని, మురుగన్ అని అంటారు.

నెమలి వాహనం కలిగినవాడు, ఆరుముఖాలు, కుంకుమధారి....నెమలి నఖాలలోపాము... ఆయన విగ్రహరూపం. దేవతలకు సైన్యాధిపతి ఆయన. స్వామి ఆయుధం ప్రత్యేకమైంది. త్రిశూలంకాదు, గొడ్డలికాదు, కాని పదునైనది. ఆ ఆయు ధంతో శత్రుసంహారమేకాదు అజ్ఞానాన్ని పారద్రోలుతాడు. తమిళ సాహిత్యంలో ఆయనను ఎన్నో పేర్లతోకొనియాడారు. బ్రహ్మను బంధించిన శక్తివంతుడు, తండ్రికి బోధచేసిన పండితుడు ఆయన. మొత్తం నాలుగువందల పేర్లు ఆయనకున్నాయి.

తమిళనాడులో సుబ్రహ్మణ్యేశ్వరస్వామికి నిర్మించబడిన క్షేత్రాలు అనేకం. విరాలిమలై, వాయలూర్, వైదీశ్వరన్ కోయిల్, మైలాడుతురై, తిరుచిరాపల్లి, కలుగుమలై, కున్నకూడి వంటివెన్నో వున్నాయి. అయితే ఇవికాకుండా ఒక ఆరింటిని మాత్రం ప్రత్యేకంగా పేర్కొంటారు. ఆ ఆరు క్షేత్రాలను కలిపి సుబ్రహ్మణ్యేశ్వర షష్ఠ క్షేత్రాలు అంటారు. ఇవన్నీ జీవితకాలంలో ఒకసారి సందర్శించాలి.

### తిరుచందూర్

సుబ్రహ్మణ్యేశ్వర స్వామి దేవాలయాలు ఆరు ప్రధానమైతే వాటిలో ప్రత్యేకమైనది తిరుచందూర్. ఇది కన్యాకుమారికి సమీపంలోవుంది. తిరుత్తణికి 56కి.మీ. దూరంలో వుంది. మిగిలిన అయిదు పుణ్యక్షేత్రాలు కొండలులేదా గుట్టల మీద వుండగా తిరుచందూర్ క్షేత్రం సముద్రతీరంలో వున్నది.

పైగా ఇక్కడి స్వామికి ఆరుముఖాలు, పన్నెండు చేతులు, ఏ దేవాలయం లోనైనా స్వామినిదర్శించే ముందు పాదాల్ని కడుక్కోవటం ఆచారం. అందుకై దేవాలయ ప్రాంగణంలో ఒకబావి వుంటుంది. కాని ఈ క్షేత్రంలో దేవాలయ ప్రవేశానికి ముందు సముద్రంలో కాళ్ళు కడుక్కోవాలి. ఇక్కడి పుష్కరిణిలో స్నానం ఆచరించటం ఆరోగ్యానికి మంచిది.



ఇది తొమ్మిది తీర్థముల కలయికతో ఏర్పడినది. ఈ క్షేత్రంలోనే సుబ్రహ్మణ్యేశ్వ రుడు ఏనుగును అధిష్టించి సూరపద్ముడు అనే రాక్షసునితో పోరాడి సంహరించాడు.

ఈ దేవాలయం ఆరంభంలో ఇసుకరాయితో నిర్మితమైంది. కాని హిందూ మహాసముద్రపు గాలులకు ఆ దేవాలయ నిర్మాణం దెబ్బతింది. ఆ తర్వాతి కాలంలో పునరుద్ధరణలో భాగంగా మూడు ప్రాకారాలను నల్లగ్రానైట్‌తో నిర్మించారు. సాధార ణంగా దేవాలయ గోపురం తూర్పుదిశగా వుంటుంది. కాని ఇక్కడ పడమర ముఖంగా వుంటుంది. ఇది తొమ్మిది అంతస్తుల గోపురం. నూటముప్పై ఏడు అడుగుల ఎత్తున వుంటుంది.

ఇక్కడి ఒక ప్రత్యేకత, అరుదైన అంశం దేవాలయానికి 200 గజాల దూరంలో కనిపిస్తుంది. ఇక్కడ రెండు బావులు ఒకదానిలో ఒకటి నిర్మించ బడున్నాయి. వెలుపలిగావున్న బావిలోనీరు అంతస్వచ్ఛంగా వుండదు. వాసనవేస్తుంది. కాని లోపలి బావిలో నీరు స్వచ్ఛంగా వుంటుంది. సుబ్రహ్మణ్యేశ్వ రుడు రాక్షససంహారం తరువాత అలసిన తన సేనలకుదాహం తీర్చేందుకు తన త్రిశూలంతోగుచ్చి పాతాళగంగను పైకి తెప్పించాడంటారు.

### స్వామిమలై

తమిళనాడు రాష్ట్రంలోని ప్రసిద్ధ పుణ్యక్షేత్రం. కుంభకోణంకి సమీపంలో వుంది స్వామిమలై. ప్రసిద్ధ చారిత్రాత్మక నగరం తంజావూరునుండి 32 కిలోమీటర్ల దూరంలో వున్న స్వామిమలై చేరి సుబ్రహ్మణ్యేశ్వరుని కొలవవచ్చు. శివుని రెండవ కుమారుడు సుబ్రహ్మణ్యేశ్వరుడు, తమిళులు ముద్దుగా మురుగు అని సంబోధిస్తారు. సుబ్రహ్మణ్యేశ్వరుడు తండ్రికే విద్యనేర్పినవాడు. ఓంకారనాదం బ్రహ్మ, విష్ణు, శివులనే త్రిమూర్తులకు ప్రతీక అని వివరించాడు. ప్రణవనాదానికి తగిన అర్థం వివరించని బ్రహ్మను ఈ క్షేత్రంలోనే సుబ్రహ్మణ్యే శ్వరుడు బంధించాడని, ఆ తర్వాత ముక్కోటి దేవతల ప్రార్థనల్ని ఆలకించి వదిలాడని అంటారు. సమీపంలో తిరువలాంచులి వుంది. ఇక్కడి దేవాలయానికి అరవై మెట్లున్నాయి. గర్భగుడికి ఎదురుగా స్వామి నెమలి వాహనంకాక ఏనుగు వుండటం ఒకవిశేషం. దేవాలయానికి మూడు ప్రాకారాలున్నాయి. తొలి ప్రాకారం భూమట్టంలో, రెండవది సగం మెట్ల ఎత్తులో, ఇక మూడవ ప్రాకారం గర్భగుడిచుట్టూ వుంటాయి. కింది ప్రాకారందగ్గర మీనాక్షి సుందరేశ్వరుల మందిరాలున్నాయి. రథోత్సవంనాడు ఉపయోగించే బంగారు రథం వుంది.

## పళని

దిండిగల్-కోయంబత్తూర్ రైలుమార్గంలోని పళని రైల్వేస్టేషన్‌లో దిగితే రెండు మైళ్లదూరంలో కొండ కనిపిస్తుంది. మధుర మీనాక్షీదేవిని దర్శించి బస్సులో పళని రావచ్చు. లేదా కొడైకెనాల్ విహారయాత్ర ముగించి రెండు గంటలలోపు ప్రయాణంతో ఇక్కడికి చేరవచ్చు.

సుబ్రహ్మణ్యేశ్వరుని ప్రసిద్ధక్షేత్రాలలో మూడవది ఇది. ఈ కొండకు కింది తిరువావినాన్ కుడి దేవాలయం, కొండమీద పళని ఆండవార్ మందిరం వున్నాయి. పళని ఆండవార్‌మందిర గోపురం బంగారపు పూతపూసిన విమానం కలిగివుండి ప్రత్యేకంగా ఆకర్షిస్తుంది. ఇక్కడి మూలవిరాట్టు అయిన సుబ్రహ్మణ్యే శ్వరుడు దండాయుధపాణి. ఆయన చేతిలో దండంవుంటుంది. మెడలో రుద్రాక్షమాలతో దర్శనమిచ్చే ఈ స్వామిది సాధురూపం.

పళనిస్వామిని హిందువులే కాదు ముస్లిమ్‌లు కూడా పూజిస్తారు. ముస్లిమ్‌లు ఆయన్ని పళని బాబాగా కొలుస్తారు. వారు గర్భగుడిలోకిరాక బైట అరుగుపై తమ ప్రార్థనలు చేస్తారు.

పళని పరిసరాల్లో పలు ఇతర దేవాలయాలున్నాయి. శ్రీమారియమ్మన్ మందిరం, పెరియ ఉదయార్ మందిరం వున్నాయి. పెరియ ఉదయార్ మందిరంలో లింగరూపంలో బృహదీశ్వరుడు, మహావిష్ణువు, నటరాజమూర్తి దర్శనమిస్తారు. శ్రీ బృహన్నాయకి అమ్మన్ మందిరం మరో ప్రసిద్ధమందిరం. పళని ప్రాంతంలోని ఐవర్‌మలైలో పాండవులు అరణ్యవాసంలో కొంత సమయం గడిపారంటారు.

## తిరుప్పారకుండ్రం

మధురకు 8 కి.మీ. దూరంలో వుంది తిరుప్పారకుండ్రం. సుబ్రహ్మణ్యే శ్వరుడు దేవతలను రక్షించే భారం తీసుకున్నాడు. సూరపద్ముడనే రాక్షసుని, అతని సేనలను ఓడించిన మురుగన్ ఈ క్షేత్రం దగ్గరికి వచ్చాడు. తమను రక్షించినందుకు కృతజ్ఞతగా ఇంద్రుడు తన కూతురు దేవయానిని ఇచ్చి పెళ్లిజరిపించాడు. ఆ వివాహం జరిగిన ప్రదేశంలోనే నేడు తిరుప్పారకుండ్ర ముంది. అందువల్లే ఈ దేవాలయానికి ప్రాముఖ్యత ఎక్కువ.

ఆకాశాన్ని తాకే గోపురం, దాని వెనకకొండ...చాలాదూరం నుండి భక్తులను ఆకర్షిస్తాయి...ఇది సూర్యచంద్రుల కలయిక ప్రాంతమంటారు.



తమిళులు తమ వివాహాలు జరుపుకునే పుణ్యక్షేత్రం. తమిళుల వివాహాలు విశేషంగా జరుపుకునే ఫాల్గుణమాసంలో ఈ దేవాలయంలో రద్దీ అధికంగా వుంటుంది. దేవాలయ ప్రాంగణంలోని పుష్కరిణిలో నీరు ఎంతో స్వచ్ఛంగా వుండి అట్టడుగునవున్న వస్తువులు కూడా కనిపిస్తాయి. ఈ పుష్కరిణిలో ఈదే చేపలకు ఆహారం వేయటం ఇక్కడికి వచ్చిన పిల్లలు సరదాగా చేసే పని.

## తిరుత్తణి

ఆంధ్ర సరిహద్దుకు సమీపంలో వున్న పుణ్యక్షేత్రం తిరుత్తణి. తిరుపతి, కంచి, చెన్నైల నుండి ఇక్కడికి బస్సుమార్గాలున్నాయి. ఇక్కడ వల్లీసహిత సుబ్రహ్మణ్యేశ్వర స్వామి కొలువైవున్నాడు. వల్లిమలై అనే సమీప పర్వత శ్రేణుల్లోవేటాడిజీవించే గిరిజన సంతతికి చెందిన వల్లిసుబ్రహ్మణ్యేశ్వరుడినే పెళ్ళి చేసుకుంటానంటుంది. ఆమె ప్రేమను పరీక్షించేందుకు పలు ప్రయత్నాలు చేస్తారు.

సుబ్రహ్మణ్యేశ్వరస్వామి సోదరుడైన వినాయకుడు మదపుటేనుగు రూపంలో భీకరంగా ప్రవర్తిస్తూ వల్లిని భయపెట్టాడు. ఆమె పరుగు పరుగు వెళ్ళి సుబ్రహ్మణ్యేశ్వ రుని శరణుచేరి ఆయన్ను గట్టిగాపట్టుకుంటుంది. ఆయన ముదుసలిరూపంలో కనిపిస్తాడు. అయినా ఆయనే తన ప్రాణవల్లభుడని వల్లి పట్టుకుంటుంది. అప్పుడు వినాయకుడే దగ్గరుండి వల్లితో స్వామి వివాహం జరిపిస్తాడు.

ఈ దేవాలయంలో మూలవిరాట్టుకు ఎదురుగా వుండే ఏనుగు పెడముఖంగా వుంటుంది. పశ్చిమానికి చూడవలసిన ఏనుగు తూర్పు ముఖంగా వుంది. ఆ ఏనుగు ఐరావతం. ఇంద్రుని వాహనం, తన కూతురు దేవయానిని ఇచ్చి వివాహంచేసి అల్లునికి సమర్పించిన కానుకలలో ఐరావతం కూడా వుంది. ఐరావతం స్వర్గం వీడటంతో ఇంద్రుని సంపద తరిగిపోసాగింది.

మామ స్థితిని గమనించిన అల్లుడు సుబ్రహ్మణ్యేశ్వరస్వామి ఐరావతాన్ని వెనక్కి ఇస్తానంటాడు. కాని అల్లునికి ఇచ్చిన బహుమతి వెనక్కి తీసుకోవటం భావ్యంకాదని, అయితే ఐరావతం కనుచూపు స్వర్గలోకంవైపు వుండేవిధంగా అనుమతించమని దేవేంద్రుడు కోరాడు. అందుకు సుబ్రహ్మణ్యేశ్వర స్వామి అంగీకరించాడు. అందుకే ఐరావతం అలా తూర్పుముఖంగా వుంటుంది ఇక్కడ.

## పాలముదిర్‌సోలై

మధురైనుండి 4కి.మీ. దూరంలో వున్న క్షేత్రం పాలముదిర్‌సోలై. ఇక్కడి సుబ్రహ్మణ్యేశ్వర స్వామి నాలుగు చేతులు కలిగిన విగ్రహం. ఆ విగ్రహాని

కిరువైపుల ఆయన భార్యలు వల్లి, దేవయానిల విగ్రహాలున్నాయి. ఈ విగ్రహంచేతిలో పాషాణంతో తయారైన ఆయుధం వుంటుంది. ఇది ఒక విశేషం. మూల వార్‌గా ఆయన్ని ఇక్కడ కొలుస్తారు.

ఈ స్థల వృక్షపండ్లు స్కంధషష్ఠి రోజున సరిగా పరిపక్వానికి రావటం ఇక్కడి విశేషం. దేవాలయ సమీపంలోని ఒక వృక్షం వేలాది సంవత్సరాలుగా పూజలు అందుకుంటున్నది. ఆ చెట్టుదగ్గరే స్వామి బాలరూపంలో కనిపించి తమిళ కవి, భక్తుడు అవ్వయార్‌ని పరీక్షించాడంటారు.

పాలముదిర్‌సోలై క్షేత్రాన్ని అలగర్‌కోయిల్ కొండలలోనిదిగా గుర్తిస్తారు. ఇక్కడ అలగర్‌విష్ణు మందిరం వుంది. ఇది ఒక సుందర ప్రదేశం. విశేష వృక్ష, జంతు సంపదగల అటవీ ప్రాంతం. ఇక్కడి ప్రకృతి విశేషాలను, వృక్షజంతువర్ణనల్ని వేల సంవత్సరాలక్రితం నక్కీరుడు తన గ్రంథాలలో వర్ణించినరీతిలో నేటికీ వున్నాయి.

(బి.అర్చన సౌజన్యముతో)

### 3. తిరుత్తణి

పుష్పాలలో తామరలా, నదులలో గంగానదిలా, నగరాలలో కాంచీ పురంలా, పర్వతాలలో శ్రేష్ఠమైన పర్వతం 'తనిగైమలై' అని స్కంధ పురాణంలో కచ్చియప్పశివా చార్యులు పేర్కొన్నారు. తనిగైమలై అనే ప్రసిద్ధిచెందిన తిరుత్తణి దివ్యక్షేత్రంలో తమిళుల ఆరాధ్యదైవం అయిన కుమారస్వామి కొలువైవున్నారు.

తిరువళ్ళూరు జిల్లాలో వున్న ఈ దివ్యక్షేత్రం చెన్నై-ముంబయి రైలు మార్గంలో అరక్కోణంకు ఉత్తరంవైపు 13 కిలోమీటర్ల దూరంలోనూ చెన్నై నుండి 84 కి.మీ.ల దూరంలోనూ ఉంది. ఈ క్షేత్రం 'తొండైనాడు' అనే ప్రాంతంలో వున్నట్లు తమిళప్రాచీన గ్రంథాలు పేర్కొంటున్నాయి.

తొండైనాడు రాజధాని కాంచీపురం దక్షిణాన, విరింజిపురం, వళ్ళిమలై, శోళింగపురం పడమర దిక్కున, తిరువాలంగాడు తూర్పున, శ్రీకాళహస్తి, తిరుపతి క్షేత్రాలు ఉత్తరదిక్కున సరిహద్దులుగా వున్నతిరుత్తణిలో సుబ్రహ్మణ్యేశ్వరస్వామి కొండపై కొలువై భక్తుల కోర్కెలను తీర్చుతున్నారు.

దేవతలను రక్షించేందుకు శూరపద్ముడు అనే రాక్షస రాజును సంహరించ డానికి సుదీర్ఘ సమరం జరిపి, వల్లిదేవిని పరిణయమాడటానికి పులిందులతో యుద్ధంచేసి అలసటచెందిన కుమారస్వామిసేద తీరిన క్షేత్రమే తిరుత్తణిగై.

తిరుత్తణి క్షేత్రాన్ని ఎగువ తిరుత్తణి అనీ దిగువ తిరుత్తణి అనీ భక్తులు పిలుస్తుంటారు. ఎగువ తిరుత్తణిలో కొండపై కుమారస్వామి కొలువై భక్తులకు కనువిందు చేస్తుండగా, దిగువ తిరుత్తణిలో సర్వపాపాలను హరించే 'శరవణ తీర్థం' అనే పుష్కరిణి భక్తులను పునీతులను కావిస్తోంది. తిరుత్తణిగై క్షేత్రాన్ని త్రిమూర్తులతో పాటు శ్రీరాముడు, ఇంద్రుడు, వాసుకి సందర్శించి కుమారస్వామి కృపాకటాక్షాల్ని పొందినట్లుగా పురాణగాథలున్నాయి.

**ఆలయ చరిత్ర :–** తిరుత్తణి సుబ్రహ్మణ్యేశ్వరస్వామి దేవాలయం అత్యంత ప్రాచీనమైనదని వివిధ శివాచార్యుల రచనలను బట్టి తెలుస్తోంది. స్వామివారి భక్తాగ్రేసరుడూ, విజయనగర రాజులలో ఒకరైన ప్రపుట దేవరాజు (క్రీ.శ. 450) కాలంనాటి శివాచార్యులు అరుణగిరి నాధర్ తన 'తిరుప్పుగళ్'పాటలలో తిరుత్తణి క్షేత్రవైభవాన్ని అత్యంత రమణీయంగా వర్ణించారు.

దీనినిబట్టి తిరుత్తణి ఆలయం ఆరు వందల సంవత్సరాలకుపూర్వమే సుప్రసిద్ధ క్షేత్రంగా పేరుగడించిందనీ తెలుస్తోంది. తొమ్మిది వందల సంవత్సరాలకు పూర్వం కచ్చియప్పశివాచార్యులు స్కంధ పురాణంలో ఈ క్షేత్రం యొక్క ప్రాశస్త్యాన్ని వివరిస్తూ పర్వతాలలో కైలాసానికి ఉన్న విశిష్టత తిరుత్తణిగై పర్వతానికి ఉందనీ పేర్కొన్నారు.

పల్లవ సామ్రాజ్యాధీశుడు అపరాజిత వర్మ(క్రీ.శ. 875-893) శిలా శాసనం, మొదటి పరందగ చోళన్ (క్రీ.శ.907-953) శిలాశాసనం ప్రకారం వెయ్యేళ్ళకు ముందు పల్లవ, చోళరాజులు ఈక్షేత్రాన్ని దర్శించి స్వామివారి కరుణాకటాక్షాలు అందుకొన్నారనీ తెలుస్తోంది. ఇప్పటికి 13 వందల సంవత్సరాలకు పూర్వమే తిరునా వుక్కరసర్ అనే శివభక్తుడు తిరుత్తణిగై వైభవాన్ని వివరిస్తూ దేవేంద్రుడే ఈ క్షేత్రాధిపతి కుమారస్వామిని దర్శించారని పేర్కొన్నారు.

వీటన్నింటినీ బట్టి తిరుత్తణి 1500 ఏళ్ళకు ముందే పుణ్యక్షేత్రంగా భాసిల్లిందని చెప్పవచ్చు. రెండువేల ఏళ్ళకు పూర్వం 'నక్కీరన్'అనే తమిళ పండితుడు 'తిరుమురు గాట్రుపడై' అనే గ్రంథంలో కుమారస్వామి కొలువైవున్న ఆరు పర్వతాలలోనే అత్యంత శ్రేష్ఠమైన పర్వతం 'తిరుత్తణిగై' అని పేర్కొన్నారు. ఇంతటి ప్రాచీన చరిత్ర కలిగిన తిరుత్తణి క్షేత్రాన్ని భక్తులు పదే పదే దర్శిస్తూ వుండటం విశేషమే! ఈ దివ్యక్షేత్ర మహిమలను కచ్చియప్ప శివచార్యులు స్కంధపురాణంలోనూ, కచ్చియప్పమునీశ్వరులు 'తనిగైపురాణం'లోనూ కందప్పదేశికర్ తనికాచల పురాణంలోనూ, తమదైన బాణీలలో గేయ రూపంలో వివరించారు. శివభక్తాగ్రేసరుడు అరుణ గిరినాధర్ తన 63 తిరుప్పుగళ్ పాటలను ఈ క్షేత్రానికి అంకితమిచ్చారు.

వడలూరు రామలింగ అడిగళార్ తన 'తిరువరుద్పా'లో ఈక్షేత్రవైభవాన్ని వివరించారు. 17వ శతాబ్దానికి చెందిన ముత్తుస్వామి దీక్షితర్ అరుదైన సంగీత కృతులతో స్వామివారి కీర్తిని చాటారు.

**స్వామివారి దర్శించే విధానం :–** తిరుత్తణి క్షేత్రానికివిచ్చేసే భక్తులు దిగువ తిరుత్తణిలోని శరవణతీర్థం (పుష్కరిణి)లో స్నానంచేసి, పరిశుభ్రమయిన దుస్తులు ధరించి, నుదుటిపై విభూతి రేఖలు దిద్దుకొని మెడలో రుద్రాక్ష తదితర శైవచిహ్నాలను ధరించి అత్యంత భక్తిభావంతో కాలినడక దారిలోని మెట్లపై అడుగుపెట్టాలి. మెట్లుమీదుగా వెళ్ళేసమయంలో స్వామివారి వైభవాలను తెలిపే భజనకీర్తనలను గానం చేయడమో లేక 'మురుగా శరణం'అంటూ పదేపదే నినాదాలుఇస్తూ కొండపైకి చేరుకోవాలి. శిఖరాగ్రానికి వెళ్ళాక తూర్పు ప్రాకారంలోని ధ్వజస్తంభ విఘ్నేశ్వరుని, ఐరావతాన్ని దర్శనం చేసుకోవాలి. దక్షిణప్రాకారంలో వున్న ఇంద్రతీర్థాన్ని దర్శించాక ఆలయంలో అడుగుపెట్టాలి.

ఆలయంలోపల ఆపత్సహాయవినాయకుడికి, వీరబాహు తదితరాది నవవీరు లకు, కుమారలింగేశ్వరునికి మొక్కాలి. ఆ తర్వాతే మూలస్థానంలో వేంచేసి యున్న జ్ఞానశక్తి ధారుడిగా కొలువైన తనిగైమురుగుని, వల్లి, దేవసై అమ్మవార్లను దర్శనం చేసుకోవాలి. ఇక్కడి మూలవిరాట్టును భక్తులు నిశితంగా పరిశీలిస్తే స్వామి వారి వక్షస్థలంవద్ద గుండ్రటి పల్లప్రదేశం కనబడుతుంది.

మహావిష్ణువు చెంతనున్న శంఖు, చక్రాలను తారకాసురుడు అపహరించు కెళ్ళిన తరువాత, కుమారస్వామి,ఆ రాక్షసుణ్ణి సంహరించి వాటిని స్వాధీనపరచు కొంటారు. శంఖుచక్రాలను మహావిష్ణువుకు సమర్పించటానికి ముందుగా కొంత తడవు సుదర్శన చక్రాన్ని తన వక్షస్థలంవద్ద కుమారస్వామి ధరిస్తారు. ఆ సుదర్శన చక్రధారణవల్ల కల్గిన గాయం స్వామివారి విగ్రహం వక్షస్థలంపై గుండ్రటి పల్లంగా దర్శనమిస్తోందని చెబుతుంటారు.

**అఖండ కర్పూరజ్యోతి :–** సుదర్శన చక్రం ధరించిన చోట చందనం పూతను పూస్తారు. ఆ చందనాన్ని తిరుమేనిపూసు (శ్రీపాదరేణు) అని పిలుస్తారు. ఆ చందనాన్ని భక్తులకు పంపిణీ చేయడం ఆనవాయితీగా జరుగుతోంది. ఆ చందనాన్ని తింటే సర్వరోగాలు మటుమాయమవుతాయని భక్తుల ప్రగాఢ విశ్వాసం.

దిగువ తిరుత్తణి నుండి శ్రీవారు కొలువైవున్న ఎగువ తిరుత్తణికి కాలినడకన వెళ్లేదారిలో 365 మెట్లున్నాయి. ఏడాదికి ఎన్నిరోజులో అన్ని మెట్లెక్కి స్వామివారిని దర్శనం చేసుకుంటే ఏడాది పొడవునా స్వామిని సేవించిన పుణ్యం దక్కుతుందనీ భక్తుల నమ్మిక. ఈ మెట్లు తక్కువ ఎత్తులో ఉండటంతో భక్తులు పర్వతారోహణకు కష్టపడాల్సిన పనిలేదు. మెట్లమీదుగా భక్తిగీతాలను ఆలపిస్తూవెళ్తుంటే మార్గమధ్యంలో బ్రహ్మతీర్థం, విఘ్నేశ్వరుడు, బ్రహ్మలింగేశ్వరులను దర్శనం చేసుకోవచ్చు.

పర్వతశిఖరాగ్రం చేరుకుంటే తూర్పు బాహ్యప్రాకారం కనపడుతుంది. ఈ ప్రాకారానికి కొద్దిదూరంలో కర్పూర కొబ్బరై స్వామివారి సన్నిధికి అభిముఖంగా ఉంటుంది. కృత్తిక తదితర పర్వదినాలలో భక్తులు తమ మొక్కుబళ్ళను ఈచోట కర్పూరం వెలిగించి తీర్చుకుంటారు. భక్తులు వెలిగించే కర్పూరజ్యోతులన్నీ కలిసి అఖండ జ్యోతిగా వెలుగుతుందిక్కడ. ఆలయ వైశాల్యం సుమారు వెయ్యి అడుగులు మాత్రమే. తేరువీధిని ప్రదక్షిణంచేసుకుంటూ వెళితే దక్షిణద్వారానికి ఎదురుగా దక్షిణంవైపున ఇంద్రనీల తీర్థం కనపడుతుంది.

ఈ తీర్థపు జలాలు స్వామివారికోసం ఉపయోగపడుతున్నాయి. ఈ తీర్థంలో భక్తులు అడుగుపెట్టనీయకుండా ఆలయ అధికారులు కట్టుదిట్టంచేశారు.

ఈ తీర్థాన్ని దర్శించి ఇంకాస్త ముందుకెళితే వాహన మంటపం కన్పిస్తుంది. ఉత్సవాల సందర్భంగా స్వామివారు వివిధ వాహనాల్లో ఇక్కడినుండే ఊరేగింపుగా వెళ్ళి భక్తులకు కనువిందుచేస్తారు. పడమటి ప్రాకారంవద్ద మెట్లదారి ఉంటుంది. ఉత్తరంవైపు ప్రాకారం చివరన నవాబ్‌వాద్యమంటపం ఉంది. స్వామివారి నిత్యపూజల వేళల్లో మహమ్మదీయులు ఈ మంటపంలో మంగళవాయిద్యాలను ప్రోగించటం విశేషం.

తూర్పు బాహ్యప్రాకారంనుండి తూర్పు ద్వారం మీదుగాను, ఉత్తరద్వారం మీదుగాను కొన్ని మెట్లెక్కితే స్వామివారి సన్నిధిచేరుకోవచ్చును.

**ఆలయంలో అంగప్రదక్షిణ :–** తూర్పుద్వారం వెలుపల, ఉత్తరదిక్కుగావున్న వినాయకుడిని దర్శించి, లోపలకు వెళితే బాహ్యప్రాకారాన్ని చేరుకోవచ్చు. లోపలకు వెళితే బాహ్య ప్రాకారాన్ని చేరుకోవచ్చు. ఇక్కడే కృత్తిక పర్వదినాల్లో భక్తులు అంగ ప్రదక్షిణం చేస్తారు. ఈ ప్రాకారాన్ని దాటివెళితే ఉమామహేశ్వరుల సన్నిధిని దర్శించ వచ్చు. ఇంకాస్తముందుకెళితే సర్వవాద్య మంటపం, ఉచ్చిపిళ్ళయార్ సన్నిధి కనబడతాయి.

తూర్పుప్రాకారంలోని ధ్వజస్తంభ వినాయకుడిని, ఐరావతాన్ని దర్శించు కున్నాక సన్నిధిలోకెళ్ళవచ్చు. ఇంద్రుడి ఐరావతం స్వామికి అభిముఖంగా గాక తూర్పు దిక్కుగా నిలిచివుంటుంది. ఐరావతం ఇలా నిలిచి ఉండటానికి కారణాన్ని (పురణాగాథలవల్ల) పరిశీలిస్తే ఓ ఆసక్తికరమైన కథను తెలుసుకోవలసి

ఉంటుంది. స్వామివారు దేవసేనను పరిణయమాడినప్పుడు ఇంద్రుడు తన ఐరావతాన్ని కట్నకానుకల కింద బహూ కరించారు. ఇంద్రలోకాన్ని ఐరావతం విడిచిపెట్టడంతో ఆ లోకంలో అష్టైశ్వర్యాలు క్రమేణా తగ్గిపోయాయి. ఆ కొరతను తీర్చడంకోసం దేవేంద్రుడు స్వామివారిని చెంగల్వ పూలతో సేవించి ప్రసన్నం చేసుకుంటారు.

స్వామివారు ప్రత్యక్షమై తనకు కానుకగా ఇచ్చిన ఐరావతాన్ని తిరిగి తీసుకోమని ఇంద్రుడిని ఆజ్ఞాపిస్తారు. ఐతే కానుకగా ఇచ్చిన ఐరావతాన్ని తీసుకెళ్లేందుకు దేవేంద్రుడి మనసొప్పదు. ఐరావతం కూడా సుబ్రహ్మణ్యేశ్వరుని సన్నిధిని విడిచి పెట్టేందుకు తటపటాయించింది. ఈ లోపున ఇంద్రుడికి ఓ యోచనతట్టింది. ఐరావతం స్వామి సన్నిధిలోవుంటూ, దేవేంద్రలోకం వున్న తూర్పు దిక్కువైపు నిలబడి వుంటే తన లోకంలో అష్టైశ్వర్యాలు నిలిచి ఉంటాయని ఇంద్రుడు తెలిపారు. స్వామి వారు 'తథాస్తు' అన్నారు.

**ఐరావతానికి మొక్కాలి :-** ఈ కారణంగానే ఐరావతం స్వామివారికి అభిముఖంగా నిలబడక ఇంద్రలోకంవైపు తిరిగినిలిచి ఉందని చెబుతుంటారు. స్వామివారిని దర్శించే భక్తులు తప్పనిసరిగా ఐరావతాన్ని మొక్కుతుంటారు. ఇక సన్నిధిద్వారం దక్షిణదిక్కుగా 'ప్రసన్నఖాదర్ ఈశ్వరర్' అనే శివ సన్నిధిని చూడవచ్చు. ఖాదర్ అనే నవాబు ఇక్కడ శివలింగాన్ని ప్రతిష్ఠించారని చెబుతుంటారు. సన్నిధి ద్వారం ఉత్తరంవైపు కాలుమంటపం, ఆలయ కార్యాలయం వున్నాయి. ఉత్సవ సమయాలలో స్వామివారు ఇష్టదేవేరుల సమేతంగా కాలుమంటపంలో కొలువవు తారు. ఇక ద్వితీయ అంతర ప్రాకారంలోకెళ్తే మడపల్లి, కామాక్షిదేవి సమేత ఏకాంబరేశ్వరుల సన్నిధి, షణ్ముగస్వామి మూలవర్లసన్నిధి, ఆరుముగస్వామి అభిషేకమంటపం, కుమారలింగేశ్వర సన్నిధి, స్వామివారి చందనం తయారీకోసం దేవేంద్రుడు కానుకగా ఇచ్చిన నాపరాయి కన్పిస్తాయి. తూర్పు ప్రాకారం ఉత్తరంవైపున షణ్ముగమూర్తి ఉత్సవర్లు కనిపిస్తారు.

ప్రదోష సమయాల్లో సాయంత్రం ఆరున్నర తర్వాత ఈ ఉత్సవర్లకు దీపారాధన జరుగుతంది. ఆ తర్వాతనే మూలవిరాట్టుకు అభిషేకం, పూజలు, దీపారాధన జరుగు తాయి. షణ్ముగ స్వామివారికి తూర్పున ఆపత్సహాయ వినాయకపెరుమాళ్, వారి పక్కనే అరుణ గిరినాథర్ వీరభద్రులు, నవవీరులు, వీరబాహుదేవర్, సూర్యమూర్తిని భక్తులు తిలకిస్తారు. ఈ ప్రాకారం నుండి లోపలివైపు ప్రాకారానికెళ్ళే మెట్లను 'పంచాక్షరిమెట్లు' అంటారు.



మూడో ప్రాకారానికి వెళ్ళేందుకు పంచాక్షరి మెట్లను దాటుకుని వెళ్ళాలి. తొలుత తపన మంటపం, తర్వాత అర్ధమంటపం ఉంటాయి. ఆ తర్వాత తపన వినాయకుడు దర్శనమిస్తారు. వీటిని దాటుకుని వెళ్తే జ్ఞానసిద్ధులైన తిరుత్తణిగై సుబ్రహ్మణ్యేశ్వరస్వామివారిని దర్శించుకోవచ్చు.

మూలస్థానానికి ఇరువైపులా స్వామివారి ఇష్టసఖులు వల్లి, దేవసేన కొలువై వున్నారు. మూలవిరాట్టును దర్శనం చేసుకొని వెలుపలికి వస్తే తూర్పు లోపలి ప్రాకారంలో ఉత్తరంవైపు దేవసేన సన్నిధి, దక్షిణంవైపు వల్లిదేవి సన్నిధిని చూడవచ్చు.

వల్లీదేవి సన్నిధి తరువాత పడమటి ప్రాకారం మధ్యన బాలసుబ్రహ్మణ్యం సన్నిధిని తిలకించవచ్చు. ఆరుద్ర దర్శన ఉత్సవరోజుల్లో ఈ స్వామికి వేడినీటితో అభిషేకం జరపటం విశేషం. ఉత్తరప్రాకారంలో సుమద్రేసురర్, చండసురర్ సన్నిది, వల్లియరై-భైరవర్ సన్నిధి ఉంటాయి.



**త్రిమూర్తులు దర్శించిన దివ్యక్షేత్రం**

తిరుత్తణిగై క్షేత్రాన్ని త్రిమూర్తులు సందర్శించి కుమారస్వామి కృపాకటాక్షాలను పొందారని పురాణాల ద్వారా తెలుస్తోంది.

**బ్రహ్మ :-** బ్రహ్మదేవుడు తిరుత్తణి స్వామిని పూజించి సృష్టి కార్యక్రమాలను నిర్వహించే అద్భుతశక్తిని పొందారనీ, శూరపద్ముడు అపహరించుకెళ్ళిన సకల ఐశ్వర్యాలను స్వామివారి అనుగ్రహంతో పొందగలిగారని పురాణగాథలలో పేర్కొన్నారు. సరస్వతీదేవి కూడా ఇక్కడి స్వామివారిని దర్శనం చేసుకున్నదని చెబుతున్నారు. ఆలయానికి మెట్లమీదుగా వెళ్లేదారిలో 'బ్రహ్మతీర్థం'వుంది.

**విష్ణువు :-** తిరుత్తణి క్షేత్రాధీశుణ్ణి ప్రార్థించి మహావిష్ణువు తారకాసురుడు అపహరించుకెళ్ళిన శంఖు చక్రాయుధాలను పొందగలిగారు. స్వామివారికి కృతజ్ఞతా సూచకంగా శ్రీ మహావిష్ణువు ఈ క్షేత్రంలో 'విష్ణుతీర్థం' నిర్మించారని చెబుతుంటారు. తిరుత్తణి పర్వతంపై ఆలయానికి పడమటి వైపున ఈ తీర్థం వుంది.

**మహేశ్వరుడు :-** తనయుడు కొలువైవున్న 'తనిగై'లో తండ్రి ప్రణవోపదేశం పొందిన ప్రసిద్ధక్షేత్రం తిరుత్తణిగై అనీ పురాణ గాథలనుబట్టి తెలుస్తోంది. తిరుత్తణిలో సుబ్రహ్మణ్యేశ్వరుని ధ్యానించి మహా శివుడు ప్రణవోపదేశం పొందారు. తండ్రికి ప్రణవ పాఠాలు చెప్పిన గురువుగా ఇక్కడి స్వామివారు కీర్తి గడించటం విశేషం. తనయుడి మంత్రోపదేశం విని మహాశివుడు

ఆనందంతో అట్టహాసంచేశారు. మహాశివుడు అట్టహాసం చేశారన్నవాదనలకు వత్తాసుగా తిరుత్తణికి ఈశాన్యంలో నందియారువద్ద 'వీరాట్టహాస ఈశ్వరాలయం' వుంది.

**శ్రీరాముడు :–** శ్రీరామచంద్రుడు కూడా తిరుత్తణి దివ్యక్షేత్రాన్ని దర్శించి స్వామివారిని పూజించి రావణాసురుడి సంహారానికి తగు శక్తిసామర్థ్యాలను పొందారని పురాణగాథలవల్ల తెలుస్తోంది. రావణ సంహారం తర్వాత మరోమారు కుమారస్వామిని శ్రీరాముడు దర్శనం చేసుకొన్నారట. రావణసంహారంతో శ్రీరాముడు విజయం సాధించటంతో ఇక్కడి శ్రీరాముడికి 'విజయరాఘవ పెరుమాళ్' పేరొచ్చింది. విజయరాఘవ పెరుమాళ్ ఆలయం తిరుత్తణి ఆలయానికి దక్షిణదిక్కుగా వుంది.

**ఇంద్రుడు :–** దేవలోకం నుండి శూరపద్ముడు అపహరించుకెళ్ళిన సంఘనిధి, పద్మనిధి, కామధేనువు, చింతామణి, కల్పతరువు తదితర ఐశ్వర్యాలను తిరిగి పొందటం కోసం దేవేంద్రుడు ముప్పూటలా సుబ్రహ్మణ్యేశ్వరుని పూజించారు. కనుకనే కొండమీది గుడి దక్షిణప్రాకారానికి ఎదురుగా 'ఇంద్రనీలాచ్చునై' అనే తీర్థం వుంది. ఈ తీర్థంలోని జలాలనే స్వామివారి కుంభాభిషేకం, తిరుమత్తెపళ్ళి పూజలకు ఉపయోగిస్తున్నారు.

**నందిదేవుడు :–** శివుడంతటివాడే తన పుత్రుడైన కుమారస్వామి నుండి ప్రణవోపదేశం పొందటంతో, నందిదేవుడు సైతం ఈ క్షేత్రాన్ని సందర్శించి జ్ఞానసిద్ధిని పొందారట, స్వామివారిని నందిదేవుడు ధ్యానించిన గుహకూడా కొండపై వుంది. ఆ గుహను 'నందిగుహ' అని పిలుస్తున్నారు.

**వాసుకి సర్పం :–** దేవతలంతా కలిసి అమృతం కోసం క్షీరసాగరమథనానికి వాసుకి సర్పాన్ని వాడటంతో ఆ సర్పానికి గాయాలయ్యాయి. తన గాయాలను మాపుకోవటానికి వాసుకి సర్పం తిరుత్తణి స్వామి దర్శించింది. స్వామివారు ఆ సర్పం గాయాలను పటాపంచలుచేశారు. స్వామివారిని పూజించే ముందు వాసుకి సర్పం ఓ కోనేటిలో స్నానమాచరించేది. ఆ కోనేటిని నాగతీర్థమని చెప్తుంటారు. ఆదిశేషుడు ఈ స్వామి దర్శనం చేసుకున్నారు. ఆదిశేషుడు స్నానమాచరించిన తీర్థానికి ఆదిశేషతీర్థమని పిలుస్తున్నారు. ఈ తీర్థం, విష్ణుతీర్థానికి పడమరవైపున కొండదారికి దక్షిణదిక్కున వుంది. అగస్త్య మహాముని, నారదులు, సప్తఋషులు ఈక్షేత్రాన్ని సందర్శించారని పౌరాణిక ఆధారాలున్నాయి.

(ఎ.విజయకుమారిగారి సౌజన్యముతో)



## తిరుత్తణి

తిరుత్తణి క్షేత్రం, ఆంధ్రప్రదేశ్ నెల్లూరు, చిత్తూరు జిల్లాలవారికి, తమిళనాడులోని ఉత్తర ప్రాంతం వారికి చాలా పవిత్రమైన పుణ్యక్షేత్రం. రేణిగుంట నుంచి ఆర్కోణం వెళ్ళేరైలు మార్గంలో ఆర్కోణం కన్నా సరిగా, ఎనిమిది మైళ్ళ ముందుగానే వచ్చే స్టేషన్ తిరుత్తణి. అనగా ఆర్కోణానికి ఉత్తరంగా ఎనిమిది మైళ్ళదూరంలో తిరుత్తణి, ఆర్కోణానికి దక్షిణంగా పదహారు మైళ్ళదూరంలో కంచి వున్నాయి.

మన దేశమాజీ రాష్ట్రపతి శ్రీ సర్వేపల్లి రాధాకృష్ణన్‌గారు జన్మించినది ఈ తిరుత్తణిలోనే.

పరమశివుని కుమారుడయిన కుమారస్వామి యొక్క ఆరు అంశలు వెలసి యున్న ఆరు పుణ్యక్షేత్రాలలోను, ఈ తిరుత్తణి నాలుగవక్షేత్రం. తన యిద్దరు భార్యలైన దేవయాని, శ్రీవల్లి అనే వారితో ఈ ఊరిలో కొలువు చేస్తూ వున్నాడు శ్రీ కుమార స్వామి. సముద్ర మట్టానికి సుమారు 700 అడుగుల ఎత్తున వున్న ఒక చిన్న కొండమీద కుమారస్వామి దేవాలయం వుంది.

దేవాలయం వున్న కొండకు సుమారు మైలుదూరంలో రైల్వే స్టేషన్‌వుంది. రిక్షాలు, ఆటోలు, సమృద్ధిగా వున్నాయి. కొండకు దిగువనే బస్సు స్టాండు వుంది. ఈ బస్సు స్టాండును ఆనుకునే, దేవస్థానంవారి సత్రం వుంది. ఈ సత్రంగాక అనేక కాటేజీలు గూడా వున్నాయి. అద్దె సుమారు ముప్పయి రూపాయలు వుంటుంది.

తిరుత్తణి ఓ మాదిరి పట్టణం. కాని కొండమీద దేవాలయం మాత్రమే వుంది. దేవాలయం చుట్టూ విశాలమయిన ఆరుబయలు ప్రదేశం వుంది. అత్యంత ప్రశాంత వాతావరణంలో నిండి వుండే ఈ ప్రదేశంలో తిరుగుతూ వుంటే, భక్తిమాట అటుంచి మనను మనమే మరిచిపోయేటంత తన్మయత్వం కలుగుతుంది.

మహావిష్ణువు యొక్క ఆయుధమైన చక్రాన్ని తారకాసురుడు అనే రాక్షసుడు అపహరించుకొని పోగా, దేవతల సేనాధిపతి అయిన ఈ సుబ్రహ్మణ్యేశ్వరుడు అనబడే కుమారస్వామి, ఆ తారకాసురుడు అనే రాక్షసుడినే గాకుండా, అతని తమ్ముడయిన శూరపద్ముడనేవాడిని గూడా సంహరించి, విష్ణువు యొక్క చక్రం తిరిగి ఆయనకు ఈ తిరుత్తణిలోనే యిచ్చాడు.

ఒకప్పుడు ఈ కుమారస్వామి బ్రహ్మదేవుని దగ్గరకు వెళ్ళి ప్రణవ మంత్రానికి అర్థం చెప్పమని అడిగాడుట. బ్రహ్మదేవుడు చెప్పలేకపోయేటప్పటికి

ఆయనను ఈ కుమారస్వామి బంధించాడుట. తరువాత తనను ఎన్నో విధాలుగా స్తుతిస్తూ ప్రార్థించిన బ్రహ్మదేవునికి, ఒక మునిరూపం ధరించి వచ్చిన కుమారస్వామి ఆ ప్రణవ మంత్ర రహస్యం ఈ ఊరిలోనే ఉపదేశించి, ఆయనను బంధవిముక్తుణ్ణి చేశాడుట, కొండ ఎక్కడానికి వున్న మెట్ల దారి మొదలయ్యే చోటనే ఒక చిన్న పుష్కరిణి వుంది. దీనిని బ్రహ్మకుండం అని అంటారు. కొలనులాగా వుండే ఒక చిన్న పుష్కరిణిలో స్నానం చేస్తే అనేక దీర్ఘవ్యాధులు కూడా నయమవుతాయని భక్తుల నమ్మకం.

తారకాసురుని సంహరించి, తిరిగి తనకు ఇంద్ర పదవిని ప్రసాదించి నందుకు కృతజ్ఞతగా దేవేంద్రుడు తన కుమార్తె అయిన దేవయాని అనే ఆమెను కుమారస్వామికి యిచ్చి వివాహంచేస్తాడు. అయితే, ఈ తిరుత్తణికి, దగ్గరలోనే వున్న వల్లిమలై (వల్లి పర్వతం) అనే కొండమీద 'శ్రీవల్లి' అనే ఆమె కుమారస్వామిని భర్తగా కోరుకుంటూ గొప్ప తపస్సు చేస్తూ వుంటుంది. రాక్షస సంహారానంతరం ఆ రౌద్రం తగ్గిన కుమార స్వామి, పరమశాంతమూర్తిగా మారి, ఈ ఊరికివచ్చి, ఆ 'శ్రీవల్లి' అనే కన్యను కూడా పెళ్ళాడి, తదనంతరం ఈ వూరిలోనే తన యిద్దరు భార్యలతోను సుఖంగా కాపురం చేసికొంటూ వుండిపోయాడు.

కొండమీద ఈ గది ప్రక్కనే దేవేంద్రుడు ఒక వనం ఏర్పాటు చేశాడు. "ఇంద్రవనం" అని పిలువబడే ఒక చిన్న పూలవనం ఇప్పటికీ వుంది. ఆ వనంలో దేవేంద్రుడు ఒక ప్రత్యేకమయిన మొక్క ఒకటి నాటాడుట. ఆ మొక్కకు ప్రతిరోజూ కేవలం మూడు పూవులు మాత్రమే పూస్తాయుట. ఇప్పటికీ ఆ మూడు పూవులతోనే ప్రతిరోజూ స్వామివారికి నిత్యపూజ ప్రారంభింప బడుతుందని అంటారు.

ఈ తిరుత్తణి వూరు నానుకునే ఒక వాగు లాంటిది వుంది. శివుని వాహన మయిన నందీశ్వరుడు ఒకప్పుడు దీని ఒడ్డున కూర్చుని, కుమారస్వామిని గూర్చి తపస్సుచేసి, ఆయన అనుగ్రహం వలన జ్ఞాన మార్గం తెలుసుకొన్నాడుట, అందువల్ల ఈ వాగును 'నందినది' అని పిలుస్తారు.

ఈ నంది నది తీరంలోనే, విజయ రాఘవస్వామి, విరాటేశ్వరుడు, ఆర్ముగ స్వామి, అనే ఆలయాలు వున్నాయి. ఇందులో ఆర్ముగస్వామి అంటే కుమారస్వామి సంవత్సరంలో మూడు రోజులు అంటే, మాఘమాసంలో సూర్యుడు ఈ ఆర్ముగ స్వామిని స్వయంగా పూజిస్తాడుట. ఆలయపు గోడకు వున్న ఒక రంధ్రంలో నుంచి, సూర్యకిరణాలు ప్రసరించి, మొదటిరోజున స్వామివారి పాదాలమీద, రెండవ రోజున హృదయ భాగంమీద, మూడవ



రోజున శిరస్సుమీద పడతాయట. ఈ మూడు రోజులు అనేక వేలమంది భక్తులు ఈ ఆలయానికి వచ్చి దర్శనం చేసికొంటూ వుంటారు.

కొండమీద వున్న కుమారస్వామివారి ఆలయంలో నాలుగడుగుల ఎత్తు వున్న ఒక పెద్ద నాపరాయి వుంది. దీనిమీద ప్రతిరోజు కిలోలకొద్దీ గంధం అరగదీసి తయారుచేస్తూ వుంటారు. ఎన్నో శతాబ్దాలుగా, ఇదే రాయిమీద ఇలాగే ప్రతిరోజూ ఇంతింత గంధం అరగదీస్తూ వున్నా ఆ రాయి మాత్రం అలా గరుకుగానే వుంది. అందువల్ల ఈ రాయి కొన్ని ప్రత్యేక ఔషధశక్తులు కలిగివున్నదని అంటారు. ఈ రాయి మీదనుంచి తీసిన గంధాన్నే స్వామివారికి అలంకారంగా వాడి తిరిగి, స్వామివారి ఒంటిమీదనుంచి తొలగించిన గంధాన్ని కొంచెం నోటిలో వేసికొంటే సర్వవ్యాధులూ నయమవుతాయని నమ్మకం.

అమృతంకోసం దేవతలు, రాక్షసులు మందర పర్వతంలో క్షీరసాగర మధనం జరిపినప్పుడు, కవ్వపు తాడుగా ఉపయోగపడిన వాసుకి, తనవంటిమీద అప్పుడు కలిగిన గాయాల్ని, ఈ తిరుత్తణిలోని స్వామిని ప్రార్థించి నయము చేసికొన్నాడట.

ఈ తిరుత్తణిలో ప్రతి సంవత్సరంలోనూ రెండు ప్రధానమయిన ఉత్సవాలు జరుగుతాయి. మొదటిది 'ఆదికృత్తిక'. ఈ రోజు కుమారస్వామి యొక్క జన్మదినం. ఇది సుమారుగా జ్యేష్ఠ, ఆషాఢమాసాలలో వస్తుంది. ఈ సుబ్రహ్మణ్యేశ్వరుని మరొక గుర్తు 'కావడి'. ఈయనకు చెంగల్వపూలు చాలా ప్రీతికరమట. 'ఆది కృత్తిక' ఆ రోజు కుమారస్వామి యొక్క 'జన్మదినం. ఇది సుమారుగా జ్యేష్ఠ, ఆషాఢ మాసాలలో వస్తుంది. ఈ సుబ్రహ్మణ్యేశ్వరుని మరొక గుర్తు 'కావడి.' ఈయనకు చెంగల్వపూలు చాలా ప్రీతికరమట. దాని వలన ఈయనకు చెంగల్వ రాయుడు అనే పేరు కూడ వుంది. 'ఆది కృత్తిక, పర్వదినం రోజున అనేక లక్షలమంది ఈ తిరుత్తణిస్వామి దర్శనానికి వస్తారు. అనేక వేలమంది చెంగల్వపూలు అలంకరించిన కావడి నొకదానిని భుజాన మోసుకుంటూ వచ్చి ఈ స్వామిని సేవించుకోవడం. ఈ స్వామి పేరిట, వున్న మొక్కుబడి, ఇదిగాక, చాలామంది భక్తులు, కుమారస్వామి ఆయుధమైన 'శూలం' రకరకాల సైజులలో వున్న వాటిని, ఒళ్ళంతా గుచ్చుకొని వచ్చి, ఈ స్వామిని దర్శించి సేవించుకొనడం మరొక మొక్కుబడి.

ఇక రెండవ పర్వదినం డిసెంబరు ముప్ఫై ఒకటవతేది. ఈ ఉత్సవం బ్రిటీష్‌వారి పరిపాలనా కాలంలో ప్రారంభం అయింది. తిరుత్తణికి ఆనుకునే వల్లిమలై అనే కొండ వుంది. ఒక స్వామివారు ఆ కొండమీద ఒక చిన్న

ఆశ్రమం నిర్మించుకుని, అందులోనే తన సన్యాస జీవితం గడుపుతూ వుండేవాడట. అప్పట్లో ప్రతికొత్త సంవత్సరం మొదటిరోజున, అంటే, ప్రతి జనవరి ఒకటవ తారీఖున, ప్రభుత్వోద్యోగు లందరూ, తమ తమ ఆఫీసులలోని పై అధికారులకు, ఉదయమే వెళ్ళి, నూతన సంవత్సర శుభాకాంక్షలు చెప్పుకోవాల్సి రావడం ఒక నిబంధనలాంటి ఆచారంగా వుండేది. అయితే అప్పటి ప్రతి ప్రభుత్వ కార్యాలయంలోనూ, పెద్ద అధికారులందరూ బ్రిటిష్‌వారే అయివుండటంతో, భారతీయులకు ప్రస్తుతం బ్రిటిష్‌వారి పరిపాలన మీద వున్న వ్యతిరేక భావ కారణంగా, చిన్న ఉద్యోగస్థులందరూ అలా ఉదయానే బలవంతంగా వెళ్ళి, ఆ బ్రిటిష్ అధికారులకు నూతన సంవత్సర శుభాకాంక్షలు చెప్పవలసి రావడం, మనసుకు కష్టంగా అనిపించటం సహజం. అందువల్ల ఆ బ్రిటిష్ అధికారుల దగ్గరకు వెళ్లటానికి ముందే, అంటే తెల్లవారుతూనే, మొదట సుబ్రహ్మణ్యస్వామి ఆలయానికివెళ్లి దర్శనంచేసికొని, ఆ తర్వాతనే ఆఫీసులకు వెళ్ళమని, కొండమీద ఆశ్రమంలో నివసిస్తున్న స్వామివారు సలహాయిచ్చారుట. అప్పటినుంచి ప్రతి సంవత్సరము జనవరి ఒకటవ తారీఖున ఉదయాన్నే ఈ స్వామి దర్శనం చేసికొనడం, ఆ తర్వాతనే తమ తమ ఆఫీసులకు వెళ్ళటం ప్రారంభించారుట. అప్పటి ప్రభుత్వోద్యోగులందరు, కాలక్రమేణా, భక్తులయిన వారందరూ ఇదే పద్ధతిని పాటించడం మొదలయింది. ఆ కారణంగా ప్రతి సంవత్సరమూ, డిసెంబరు ముప్పై ఒకటవ తేదీ కల్లా కొన్ని లక్షలమంది భక్తులు ఈ తిరుత్తణి వస్తారు. సరిగా అర్ధరాత్రి పన్నెండు గంటలు దాటగానే, భక్తుల కొండమీద వున్న స్వామివారి ఆలయానికి చేరుకోవడం ప్రారంభిస్తారు. మరొక విచిత్రమయిన విషయం ఏమిటంటే, స్వామి ఆలయం వున్న కొండ ఎక్కడానికి వుండే మెట్లు సరిగ్గా మూడు వందల అరవై అయిదు వున్నాయి. అందువల్ల భక్తులు ఒక్కొక్క మెట్టుమీద ఒక్కొక్కటి చొప్పున కర్పూర దీపాలు, లేక ప్రమిదదీపాలు, లేకపోతే, మైనపు వత్తులు వెలిగిస్తూ సంవత్సరం లోని మూడువందల అరవై అయిదు రోజులూ, తమకు శుభమే కలగాలని ప్రార్థిస్తూ కొండపైకి సాగిపోతుంటారు. ప్రతి సంవత్సరం జనవరి మొదటి తేదీన తిరుపతి మొదలైన పుణ్యక్షేత్రాలను దర్శించడమనే పద్ధతి. ఈ తిరుత్తణిలోనే ఆరంభ మయింది.

ఇక అన్ని దేవాలయాలలాగానే, ఈ తిరుత్తణి ఆలయంలోను అనేకరకాల పూజలు (సేవలు) జరుగుతాయి. ఈ తిరుత్తణిలోనే గాక ప్రతిచోట వున్న ప్రతి కుమారస్వామి ఆలయంలోను పాలతోగాని, విభూతితోగాని అభిషేకం చేయడం అనేది ఒక ప్రత్యేకత. అయితే, తగినన్ని పాలులేకపోతే విభూది మనమే తీసుకువెళ్ళాలి. సాధారణంగా గుడి ఆవరణ దగ్గరే ఈ రెండూ కూడా అమ్ముతూవుంటారు. ఈ అభిషేక సేవ చేయించడానికి కొంత ఛార్జివుంటుంది. అలాగే ఫలానా టైము అని గూడా వుంటుంది.

తిరుత్తణిలోని స్వామివారికి ఉదయం ఎనిమిది గంటలకు, తిరిగి ఉదయం పది గంటలకు, మరల సాయంత్రం ఎనిమిది గంటలకు ఈ అభిషేక సేవలు జరుగుతాయి. ఆలయం యొక్క ఆవరణలోనే వున్న దేవస్థానంవారి ఆఫీసులో ఇందుకు తగిన టిక్కెట్లు కొనుక్కుని, పాలు లేక విభూతి గూడా ముందే ఏర్పాటు చేసికొని, ఈసేవ చేయించుకొనవచ్చు. కాగా తిరుత్తణిలోని స్వామికి, పూర్తిగా బంగారు పూత పూసిన పద్దెనిమిది అడుగుల ఎత్తు వుండే రథం ఒకటి వుంది. స్వామివారి ఉత్సవ విగ్రహాలు ఈ రథంలో వున్నాయి. ఆలయ ప్రాకారం చుట్టూ ముమ్మారు త్రిప్పటం ఒక రకమైన సుమారు వెయ్యి రూపాయలు రుసుము కట్టిన భక్తులకోసం ఈ సేవ నిర్వహిస్తారు.

## తిరుత్తణి సౌకర్యములు

### విశ్రాంతి గృహములు గల నియమములు

1. **తణిగై ఇల్లము :**కాటేజ్ మరియు గృహములు బస్టాండుకు సమీపం
2. **కారికేయ నిలయము :** కాటేజ్ మరియు గృహములు అరక్కోణం మార్గమున కొండకు వెళ్ళుఘాట్ రోడ్డుకు ఎదురుగా
3. **శరవణ పొయొగై నిలయము :** కోనేటి సమీపమున ఉత్తర పశ్చిమమూల యందు సేవలు మరియు కట్న వివరములు

1. సాధారణము అష్టోత్తర అర్చనచేయించి పోస్టల్ ద్వారా స్వామివారి దివ్యప్రసాదము పంపుటకు కట్నము రూ. 25-00
2. ప్రతి మాసములలో కృత్తిక లేక తమనామ నక్షత్రపేరిట అష్టోత్తరార్చన చేయించి దివ్య ప్రసాదము పోస్టల్ ద్వారా ఒక ఏడాదికి పంపుటకు రూ. 350-00
3. అష్టోత్తర అర్చన కట్నమురూ. 2-00
4. కృత్తిక మరియు తిరుప్పగళ్ మొట్లోత్సవ రోజులలో అష్టోత్తర కట్నము రూ. 5-00
5. అమ్మవారు వినాయక సన్నిదులలో అర్చనకు రూ. 2-00

6. త్రిసతి అర్చనలకు రూ. 10-00
7. సహస్రనామార్చన రూ. 100-00
8. తలనీలాలు కట్నమురూ. 10-00
9. విభూది, పన్నీరు, గంధము, పాలు,పెరుగు, తేనే, కొబ్బరి నీరు మున్నగురూ. 30-00 వాటిని అభిషేకము చేయుటకు ఒక్కొక్క దానికి కట్టము
10. చెవులు కుట్టుటకు కట్నము రూ. 5-00
11. పెండ్లి చేసుకొనుటకు కట్నము రూ. 100-00

**పూజవేళలు**

| | | |
|---|---|---|
| విశ్వరూప దర్శనము | ఉదయం | 5-00 గంటలకు |
| అరుణోదయపు అభిషేకము | ఉదయం | 8-00 గంటలకు |
| ఉచ్ఛికాలపు అభిషేకము | ఉదయం | 10-00 గంటలకు |
| సంధ్యావేళపు అభిషేకము | సాయంత్రం | 5-00 గంటలకు |
| అర్థజామపూజ | రాత్రి | 8-00 గంటలకు |
| శయనగృహపూజ | రాత్రి | 9-00 గంటలకు |

**గమనిక :-** ఉత్సవ రోజులలో పూజాసమయములు మార్పులకు లోబడినవి. ప్రతి ప్రకృత్తిక రోజులలో అరుణోదయపు అభిషేకములను ఉదయం 4-00 గంటలు ప్రాంతమున జరుపబడును.

**ఈ దేవస్థానమునకు చెందిన ఇతర ఉప దేవస్థానముల వివరములు**

1. శ్రీ సుందర వినాయక ఆలయము, తిరుత్తణి - బజారులో
2. శ్రీ లక్ష్మీనరసింహస్వామి ఆలయము, తిరుత్తణి - కోనేటికి వెల్లు మార్గమున
3. శ్రీ సప్త కన్నియమ్మల ఆలయము, తిరుత్తణి- 2-00 కి.మి.(కన్నికాపుర మార్గములో)
4. శ్రీ షణ్ముఖ స్వామి ఆలయము, తిరుత్తణి - 2-00 కి.మీ.
5. శ్రీ విజయరాఘవ స్వామి ఆలయము, తిరుత్తణి - 2-00 కి.మీ
6. శ్రీ వీరాటేశ్వరస్వామి ఆలయము, తిరుత్తణి - 2 1/2 కి.మీ



7. శ్రీ వీరభద్రస్వామి ఆలయము, తిరుత్తణి - కాటేజ్ సమీపమున
8. శ్రీ సహశ్రీ శ్వరస్వామి ఆలయము, తిరుత్తణి - కాటేజ్ సమీపమున
9. శ్రీ పావాడ వినాయక ఆలయము, తిరుత్తణి- మెట్ల మార్గమునందు
10. శ్రీ పడవేటమ్మ వారి ఆలయము, తిరుత్తణి - తిరుమలలో
11. శ్రీ వటారణ్యేశ్వరస్వామి ఆలయము, తిరువాలంగాడు - 32 కి.మీ. అరక్కోణం-చెన్నై మార్గములో
12. శ్రీ భద్రకాళియమ్మవారి ఆలయము, తిరువాలంగాడు -32 కి.మీ. అరక్కోణం చెన్నై మార్గములో
13. శ్రీ సాక్షిభూదేశ్వరస్వామి ఆలయము, పరియసూర్ -35 కి.మీ. నగరి-పళ్ళిపట్టుమార్గం
14. శ్రీ నాధదీశ్వరస్వామి ఆలయము, కరింబేడు - 35 కి.మీ నగరి పళ్ళిపట్టు మార్గం
15. శ్రీ కరిమాణిక్య స్వామి ఆలయము, కరింబేడు -12 కి.మీ. తిరుత్తణి - రేణిగుంట మార్గం
16. శ్రీ మహిషాసురమర్థిని ఆలయము, మద్దూరు - 12 కి.మీ. తిరుత్తణి - రేణిగుంట మార్గం
17. శ్రీ అగత్తిశ్వరస్వామి ఆలయము, మద్దూరు - 12 కి.మీ. తిరుత్తణి - రేణిగుంట మార్గం
18. శ్రీ కోదండరామస్వామి ఆలయము, నెడుంబరము - 15 కి.మీ. తిరుత్తణి - చెన్నై మార్గం
19. శ్రీ సంతాన గోపాలస్వామి ఆలయము, సంతానవేణుగోపాలపురం - తిరుత్తణి-చిత్తూరుమార్గం
20. శ్రీ మాణిక్యవాచగస్వామి ఆలయము, గురువారజుపేట- 12 కి.మీ.
21. శ్రీ వాగీశ్వరస్వామి ఆలయము తిరుప్పచూరు -36 కి.మీ. తిరుత్తణి - చెన్నై మార్గం
22. శ్రీవిద్యావనిత పల్లవ పరమేశ్వర శివ ఆలయము కూరం -42 కి.మీ. తిరుత్తణి కంచిమార్గం

23. శ్రీ నాగేశ్వరస్వామి ఆలయము పెద్దనాగపూడి - 36 కి.మీ. తిరుత్తణి (వయా) శోలింగపురం, చిత్తూరుమార్గం.

**కళ్యాణ మండపముల కట్న వివరములు**

| | | |
|---|---|---|
| 1. | బంగారురథోత్సవము | రూ. 1250-00 |
| 2. | వెండిరథోత్సవము | రూ. 2200-00 |
| 3. | వెండి మయూర వాహనము ఇతర వాహనముల ఉత్సవము | రూ. 2000-00 |
| 4. | ఖేడయ ఉత్సవము | రూ. 500-00 |
| 5. | బంగారు కవచము | రూ. 250-00 |
| 6. | పంచామృత అభిషేకం | రూ. 600-00 |
| 7. | కళ్యాణ ఉత్సవం | రూ. 1100-00 |
| 8. | గంధపు అలంకారము కట్నం | రూ. 101-00 |
| | గంధము ఖరీదు:ప్రస్తుతము 1100-00 | రూ.1201-00 |

**కళ్యాణ మండపము కట్న వివరములు**

| | | |
|---|---|---|
| 1. | శ్రీ షణ్ముఖస్వామి కళ్యాణమండపము | రూ. 3000-00 |
| 2. | శ్రీ తణిగేశన్ కళ్యాణ మండపము | రూ. 3000-00 |
| 3. | శ్రీ వళ్ళియమ్మ కళ్యాణ మండపము | రూ. 2250-00 |
| 4. | శ్రీదేవసేన కళ్యాణ మండపము | రూ. 1800-00 |

కొండమీద గుడికిపోవు వాహనముల వసతికలదు. ప్రతి ఒక్కరికి రానుపోను బస్ చార్జీ 10రూ. కొండమీద నుండి క్రింద దిగు వారికి 5 రూ.చెల్లించవలెను.

**భక్తుల విశ్రాంతి కుటీరములు మరియు గదుల కట్టణములు వివరములు**

1. ఎ.సి.కాటేజ్ 1కి కట్నము (రిజర్వేషన్ చేయబడవు) రూ.3500-00
2. కుటీరము (కాటేజ్) 1కి సాధారణముగ ఒక్కరోజునకు బుకింగ్ చేయుటకు కట్నము రూ. 100-00
   అధిక పక్షముగ రూ. 140-00
3. గదులు ఒక రోజునకు రూ. 25-00 మొదలు రూ. 50-00 వరకు గలవు



4. అడ్వాన్సు రిజర్వేషన్ చేయుటకు (సాయంత్రం 3-00 గం॥ నుండి మరు దినము 3-00 గం॥వరకు కాటేజ్-1కిరూ. 220-00
   గది 1కి రూ. 130-00

రిజర్వేషన్ చేయువారు పైకమును 15 రోజులకు ముందుగా దేవస్థాన కార్యాలయమునకు చేరునట్లు పంపవలయును.

## తిరుచందూరు

తమిళనాడులో అతి ప్రధానమయిన పుణ్యక్షేత్రాలలో తిరుచందూరు ఒకటి. అంతేకాక అతిభాగ్యవంతమయిన ఆలయాలలో కూడా ఒకటి. సుబ్రహ్మణ్యస్వామి యొక్క ఆరు అంశలలో రెండవ అంశకు సంబంధించిన ఆలయమే ఈ తిరుచందూరు ఆలయం. తిరుచందూరు ఆలయం సముద్రం ఒడ్డునేవుంది. ఆలయపు వెనుకవైపు గోడలకు సముద్రపు అలలు కొట్టుకుంటూ వుంటాయి. ఈ ఆలయం చాలా పురాతన మయినదిగా చెబుతారు. ఈ ఆలయానికి ఎన్నో కోట్ల రూపాయల విలువగల ఆస్తిపాస్తులు వున్నాయి. తమిళనాడులో అత్యంత అధిక ఆదాయం గల ఆలయాలలో ఇది ఒకటి.

పరమేశ్వరుడైన శివుడు దేవగణాలకు అధిపతి. కాగా తారకాసురుడు అనే రాక్షసుడు దేవతలను హింసించి, అమితంగా బాధిస్తూ వుండేవారు. అతనిని సంహరించడానికిగాను, దేవతలందరూ వెళ్ళి పరమేశ్వరుని ప్రార్థించగా ఆయన ఆ బాధ్యతను తన కుమారుడైన కుమారస్వామికి అప్పగించాడు. అప్పుడు కుమారస్వామి మొట్టమొదటగా, గొప్ప తపస్సుచేశాడు. అతని తల్లి పార్వతీదేవి ఆదిశక్తి రూపంలో ప్రత్యక్షమై, తన శక్తినంతా పొదిగిన ఒక బల్లెం (శూలం) కుమారునికి ప్రసాదించింది. వెంటనే, త్రిమూర్తులు, మిగిలిన దేవతలు అందరూ కూడావచ్చి, తమ తమ అంశంకు సంబంధించిన శక్తులన్నీ ఆ బల్లెంలో నింపారుట, అనంతరం, దేవగణాలను వెంటబెట్టుకొని, తారకాసురునితో యుద్ధంచేసి, చివరకు అతడిని, అతని తమ్ముడైన శూరపద్ముని సంహరించాడు. ఆ తారకాసురుని సంహరించినది ఈతిరుచందూరులోనే అని స్థలపురాణం. తారకాసురునితో యుద్ధం ఆరురోజులు జరిగిందట. ఆరవరోజున తారకాసుర సంహారం జరిగిందట. ఆ రోజు కార్తీక శుద్ధ షష్ఠి, దీనిని తమిళులు 'స్కంధషష్ఠి' అంటారు. కార్తీకశుద్ధ పాడ్యమి మొదలు షష్ఠి రోజు వరకూ తమిళనాడు అంతటా ఎన్నో ఉత్సవాలు జరుగుతాయి. చివరి రోజయిన స్కంధషష్ఠి రోజున చాలా కోలాహలంగా వుంటుంది. సుబ్రహ్మణ్యస్వామికి సంబంధించిన అన్ని దేవాలయాలలోను, ఎన్నోరకాల కార్యక్రమాలతో ఈ ఆరు రోజులూ ఉత్సవాలు జరిగినా,

ముఖ్యమైన కార్యక్రమం ఈ తిరుచందూరులోనే జరుగుతుంది. స్కంధషష్ఠినాడు ఈ తిరుచందూరుకు సుమారు పదిహేను నుండి ఇరవై లక్షలమంది వస్తారు.

తారకాసురుని సంహరించిన తరువాత అతని తమ్ముడైన శూరపద్ముడు పారిపోవటం మొదలు పెట్టాడుట, కుమారస్వామి శూరపద్ముని వెంటబడగా, ఆ ఆ రాక్షసుడు ఒకచోట ఒక మామిడిచెట్టుగా మారిపోయాడుట. కుమారస్వామి తన బల్లెంతో ఆ చెట్టును రెండుగా చీల్చి శూరపద్ముని గూడా చంపివేశాడుట. అప్పుడు ఆ చెట్టులోని ఒకభాగం నెమలిగాను, మరొకభాగం ఒక కోడిగాను రూపం దాల్చా యట. ఆ రెండింటిని స్వామి తన వాహనాలుగా చేసికొన్నాడట, ఆయన ఆయుధమైన బల్లెం సుబ్రహ్మణ్యేశ్వరుని గుర్తుగా పూజింపబడుతూ వుంటుంది.

పళనిలోనూ, తిరుచందూరులోనూ మరే యితర ఆలయాలలోనూ లేని ఒక గొప్ప యిబ్బంది వుంది. స్వామివారికి రోజూ నిర్వహింపబడే పూజా కార్యక్రమాలు నిర్వహిస్తూ వుండే అర్చకులు, గర్భగుడిలో స్వామి విగ్రహం దగ్గర వుండనే వుంటారు. కాని గుడి ముందర ఆవరణలో అనేకమంది బ్రాహ్మణులు తిరుగుతూ వుంటారు. మనం దర్శనం చేసికోవటానికి నుంచునే 'క్యూ' అంతటా గూడా ఈ అనధికార పూజారులు ఎంతోమంది తిరుగుతూ వుంటారు. మనం స్వామివారికి గాను కొనుక్కుని వచ్చిన కొబ్బరికాయ మొదలైన పూజా సామానులు వుంచుకున్న బుట్టగాని, పళ్లెంగాని మన చేతిలో చూడగానే, అనధికార పూజారులు వెంట తగుల్తారు. 'అర్చన' చేయిస్తామంటూ మన పూజాసామాను మనం వారిలో ఎవరికో ఒకరికి అప్పగించ వలసిందే. వారే స్వామివారి దగ్గరకు వెళ్లినట్లు వెళ్లి, కొబ్బరికాయ రెండు ముక్కలుచేసి పట్టుకొచ్చి, మొత్తం పూజాసామాను మనకు తిరిగి అప్పగిస్తారు. అర్చన చేసి వచ్చా మని చెబుతూ, దీనికిగానూ మనం వారికి ఎంతో కొంత ముట్టచెప్పుకోవాల్సి వుం టుంది. ఈ తిరుచందూరులో స్వామికి, ఉదయం సుమారు పది పదకొండు గంటల మధ్య తిరిగి సాయంత్రం మరొక మారు, విభూతి అభిషేకం చేసే కార్యక్రమం వుం టుంది.

తిరుచందూరులో గుడి వాకిటి ముందరే బీచ్, సముద్రం ఏమీ ప్రమాదకరంగా కూడా వుండదు. స్నానంచేస్తే మహదానందంగా స్నానం చేసే చోటనే, అంటే బీచ్‌లో పొడుగాటి షెడ్లు వున్నాయి. బట్టలు మార్చుకోవడానికీ, ఆరవేసుకోవటానికీ చాలా అనుకూలంగా వుంటుంది. ఆ షెడ్లకు చివరగా అంటే గుడివైపు వుండే కొసగాకుండా అవతలి వైపు వుండే కొసను ఒక పెద్ద గది లాంటిది వుంది. సముద్రపు ఒడ్డున ఇరవయి గజాల దూరంలో మంచినీటిని



బావి వుండటం ఆశ్చర్యం కలిగించక మానదు. సముద్రంలో స్నానంచేసి వచ్చిన వారందరూ, తిరిగి ఈ బావిలో (దిగటానికి మెట్లు వున్నాయి) స్నానం చేసి ఆ పైన బట్టలు మార్చుకుంటారు.

## పళని

కుమారస్వామి యొక్క ఆరు అంశలకు సంబంధించి వెలసిన ఆరు దేవాలయాలలోనూ, పళనిలోని దేవాలయమే ప్రధానమైనదని సుబ్రహ్మణ్యేశ్వరుని భక్తుల విశ్వాసం, కుమారస్వామి దేవాలయాలలోనేగాక, తమిళనాడులోని దేవాలయా లన్నిటిలోను అత్యంత భాగ్యవంతమయిన ఆలయాలలో ఈ పళని దేవాలయం ప్రముఖమయినది. దిండిగల్లు నుంచి కోయంబత్తూరు వరకు ఉన్న రైలుమార్గంలో మధ్యగా వుంది పళని. రైలుమీద వెళితే దిండిగల్లు నుంచి పళని 49 కి.మీ. సుమారు గంటన్నర ప్రయాణం, కోయంబత్తూరు నుంచి 109 కి.మీ. ఎక్స్‌ప్రెస్ రైలు మూడు గంటలు, పాసింజరు నాలుగు గంటలు. కోయంబత్తూరు నుంచి రామేశ్వరం వరకూ వున్న ఒకరైలు, పళని, దిండిగల్లు, మధురై మీదుగావుంది. అంటే ఈ రైలులో మధురై పళని మధ్య దిండిగల్లులో మారకుండా ప్రయాణించవచ్చు.

పళని దేవాలయం ఒక రకం కొండమీద వుంది. పైకి ఎక్కటానికి మెట్లదారి వుంది. మెట్ల దారిని ఆనుకునే చదునైన రోడ్డు దారిగూడా వుంది. మామూలు వారుతేలికగా నడుచుకుంటూ ఎక్కేయవచ్చు. మెట్ల దారికి కొంచెం అవతలగా సుమారు 100 గజాల దూరంలో చిన్న రకం రైలు పెట్టెలలాంటి వాటిలో కొండపైకి తీసుకువెళ్ళే రోప్‌వే వుంది. ఛార్జి మనిషికి సుమారు పదిహేను రూ॥లు వుంటుంది.

ఆలయం సుమారు 450 అడుగుల ఎత్తున వున్న కొండమీద వున్నది. ఈ కొండను ఎడుంబన్ కొండఅంటారు. ఒకానొకప్పుడు అగస్త్యుడు ఈ ప్రాంతంలో తపస్సు చేసికొంటూ ఎందుకో రెండు కొండలను సృష్టించాడు. అందులో ఒక కొండ పేరు పగిరి, తర్వాత, అగస్త్యుడు తన శిష్యులలో ఒకడయిన 'ఎడుంబన్' అనే రాక్షసుడిని ఒకడిని పిలిచి, ఆ రెండు కొండలను ఒక కావడిలో చెరొక ప్రక్క నుంచి, తన వెనుకే మోసుకు రమ్మనిచెప్పి, కొంతదూరం పోయాక తను బ్రహ్మలోకం వెళ్లాడుట. కావడి మోసుకుంటూ వెళ్తూవున్న ఎడుంబన్, కొంతదూరంపోయింతర్వాత, కావడిలో ఒకవైపు క్రిందకు వంగిపోయి, బరువుగా వున్నట్లు అనిపించగా, కావడి క్రిందకు దించి చూశాడట. కావడిలో శివగిరి వున్న వైపు క్రిందకు దిగి ఉందట. ఆ కొండమీద సుబ్రహ్మణ్యేశ్వరుడు ఒకచిన్న

